HE LARGEST CIRCULATED
ELUGU MONTHLY

# చతుర

అక్టోబర్ 1998 ★ రూ.7/-



ఐ. కవిత

## కాటిచిలక

# చతుర కతలు

## “... చేరలేదు”

‘ఏమిటోయ్! జలజాక్షీ... ఆ ప్రక్కింటావిడ గురించి నిద్రలో పలవరిస్తున్నావు. ఆవిడతో నీకు గొడవేమిటి? మొన్నటిదాకా తుమ్మజిగురులాగా అతుక్కుని ‘స్నేహమేరా జీవితం’ అంటూ రాగాలు తీశారే, ఇంతలో ఏమొచ్చింది. అదీగాక వాళ్ళు ట్రాన్స్‌ఫరయి వెళ్ళిపోతున్నారన్నావు కూడాను’’ అన్నాను శ్రీమతితో.




“ఏమిటీ పాపం అంటున్నారు నేనేదో పిల్లిని చంపినట్టూ. ఆ కుళ్ళుమొహం దాంతో నాకేంటి స్నేహం. ప్రతిదానికీ నాతో పోటీ పడుతుంది. అదే నాకు నచ్చదు’’ అంది శ్రీమతి కోపంగా.

“పోటీనా? అంటే? మీ మహిళామండలి ఆటలపోటీల్లోనా?”

“ఆటలపోటీ అయితే నాకెందుకుబాధ. నేనేదైనా కొంటేసరి. నిమిషాల్లో తనూ పోటీ పడి అంతకంటే మంచిది, లేటెస్ట్ అయినదీ కొనేసి అదేదో తెచ్చి ముందు అందరికీ ఆ తర్వాత నాకు చూపించి నాకు బి.పి పెరిగే వరకూ గొప్పలు చెబుతుంది. ఆమధ్య నేను డైనింగ్‌సెట్టు కొంటే, తను ఢిల్లీనించి ఖరీదయినదీ, కళ్లు జిగేలుమనిపించేలాంటిది కొంది. నేనిక్కడిషాపులో ధర్మవరం పట్టు చీర కొంటే తను ధర్మవరంవెళ్లి స్వంత డిజైనుతో స్వయంగా దగ్గరుండి వేయించుకుని మరీ తెచ్చుకుంది. ఇలా నేను చేతిరుమాలు కొన్నాసరే, తానూ అంతకంటే ఖరీదైంది కొంటుంది. కొంటేకొంది, దానిడబ్బులు దానిష్టం అనుకుందామంటే... ఆ వస్తువు కొన్నాక దాని పుట్టుపూర్వోత్తరాలతో సహా గొప్పగా వర్ణించి దానికోసం తానెంత కష్టపడిందీ కూర్చోబెట్టి మరీ సవివరంగా చెబుతుంది. నాకు వళ్ళు మండదూ మరి’’ అంది శ్రీమతి.

“అంత నచ్చనపుడు అటెళ్లకుండా, అసల

వేవీ వినకుంటేపోలా? ఇంత బాధెందుకు'' అన్నాను ఓదారుస్తూ.

"అయ్యయ్యో! వినేలాచేసే ఆమె టెక్నిక్ మీకర్థంకాదులెండి''

"అయితే ఈ సమస్యకు పరిష్కారం లేదా?"

"లేకేం! నేనేం తక్కువ తిన్నానా? పోయిన నెలలో నేను పాతికవేలు పోసి 'లాంగ్‌చైన్' కొన్నానుకదా! అది ఆవిడకు చూపించి వచ్చేశాను. ఈసారి ఆవిడ ప్రతీకారానికి బలికాకూడదని ఆరోజునించి మళ్లీ ఆవిడకు కనిపించలేదు''

"ఆవిడ మన ఇంటికి రాలేదా?"

"వచ్చింది! ఇంట్లో ఉండి కూడా పనిమనిషిచేత లేనని చెప్పించి పంపేశాను. నాలుగుసార్లు ఫోన్ చేసింది. ఆవిడ గొంతు వినగానే మాట్లాడ్డానికి అవకాశం ఇవ్వకుండా ఫోను పెట్టేశాను'' అంది నవ్వుతూ.

"పోన్లెద్దూ! వాళ్లాయనకి ట్రాన్స్‌ఫరయి ఊరు విడిచివెళ్లిపోయారుకదా! నీకింకేబాధుండదులే' అన్నాను నిట్టూరుస్తూ.

"ఊరు మారినా దానిబుద్ధి మారుతుందా! 'ఫ్రం' అడ్రసు రాయకుండా ఓ చేంతాడంత ఉత్తరం రాసింది. దాన్నిండా తను కొన్న లాంగ్‌చైన్ గురించిన గొప్పలే! ఎంత అతితెలివో చూశారా''

"అరెరె, అలా చేసిందా! అయితే ఆవిడ దెబ్బకు నువ్వు పడిపోయావన్నమాట. ఎంతపని జరిగింది'' సానుభూతి చూపించాను.

"ఏమిటి జరిగేది! చింతకాయతొక్కు. నేనేం అంత తెలివితక్కువ దాన్నా' 'నువ్వు కొన్న లాంగ్‌చైన్ గురించి నాకు రాసిన చాంతాడంత ఉత్తరం నాకు చేరలేదు' అంటూ రాసి వెంటనే పోస్టు చేశాను, ఆ ప్రక్కింటివాళ్ల దగ్గర అడ్రస్ తీసుకుని..." అంటూ గర్వంగా చెబుతున్న శ్రీమతిని నోరువెళ్లబెట్టి చూశాను.

—ఎ. జయలక్ష్మిరాజు

---

## వ్యవస్థ

"లేండాఫ్ ఫ్రీడమ్‌నుంచి లేండాఫ్ హెల్‌కి బయలుదేరుతున్నాం" చెప్పాడు సుకుమార్ బాధగా.

అతని మిత్రులిద్దరూ మాట్లాడలేదు.ఆటో దిగి బాగ్స్‌ని భుజాన తగిలించుకుని బస్‌స్టాండ్‌లోకి నడిచారు.

"ఏరా సుకుమార్! ఆఖరిసారి అడుగుతున్నాను... వద్దంటావా?" అడిగాడు చెయిన్లు సుకుమార్‌ని.

అంతకుమునుపు ఆవిషయం మీద చాలాసార్లు చర్చ జరిగినట్లుంది, చెయిన్లు దేనిగురించి అడుగుతున్నాడో అర్థమైంది సుకుమార్‌కి.

"వద్దన్నానా?" కసిరాడు సుకుమార్.

"ఓ సిక్స్టీ యం.ఎల్. మినియేచర్ తీసుకెళ్తే రిస్క్ వుండదు. ఆఖరి ఛాన్స్ కోసం బస్‌స్టాండ్ పక్కనే వైన్ షాప్ వుంది''

"ఇదుగో చెయిన్లు, ముగ్గురం కలిసి వచ్చాం. తిరిగి హైదరాబాద్ ముగ్గురం కలిసే వెళ్లాలంటే మామాట విను. లేనిపోని ప్రలోభాలకి పోకు'' చెయిన్లుకి హితవు చెప్పాడు దాసాంజనేయులు.

"అయినా ఓ పెగ్ బాటిల్ తీసుకెళ్లి ఏం వుపయోగం? సగంపెట్టి మేనత్త సామెతవుతుంది'' నవ్వాడు చెయిన్లు వాళ్ల వాదనతో అంగీకరిస్తున్న భావనని ఒప్పుకునే తీరుగా.

"నిన్నరాత్రి, మొన్నరాత్రి ఎంజాయ్ చేసింది చాలు. కావాలంటే మళ్లీ వీకెండ్‌కి రా'' సుకుమార్ చెయిన్లుని సముదాయిస్తున్నట్లుగా చెప్పాడు.

"చూడు బ్రదర్. నేను తాగేది ఎప్పుడూ సరిగ్గా క్వార్టరే. బీదర్‌లో ఉన్నాం కదాని





అంతకుమించి నిన్నరాత్రి కాని మొన్నరాత్రి కాని ఒక్క పెగ్ అయినా ఎక్కువ తాగానా? కాకపోతే వారానికి నాకు కనీసం నాలుగు రాత్రులు అది కావాలి. రెండు మూడు రోజులుపోయాక మళ్లీ డ్రింక్ కావాలని పిస్తుంది'' చెప్పాడు చెయిన్లు.

"బీదరకి ట్రాన్స్‌ఫర్ పెట్టుకోవడం ఒకటే సొల్యూషన్'

"ఇస్తారు కాని సర్కిల్ మారుతుంది. రేపు ఆంధ్రాలో ప్రొహిబిషన్ ఎత్తేస్తే మళ్లీ ఆంధ్రా సర్కిల్‌కి బదిలీ అవకపోతే?" చెయిన్లు అనుమానం వ్యక్తం చేశాడు.

"హైద్రాబాద్‌లో బాటిల్ మూడు వందల ఏభైకి డోర్ డెలివరి దొరుకుతున్నప్పుడు బీదర్‌కి రావడం వేస్ట్ రానుపోను ఖర్చు, హెూటల్‌గది అద్దె లెక్కచూసుకుంటే హైద్రాబాదే చవకవుతుంది. బీర్‌మీద మనసుపోయినప్పుడు ఏ ఆర్నెల్లకో ఓసారి రావడం బెటర్' తన అభిప్రాయం చెప్పాడు దాసాంజనేయులు.

బీదర్ బస్‌స్టాండ్‌నుంచి హైద్రాబాద్‌కి కర్నాటక ట్రాన్స్‌పోర్ట్ బస్సులు, ఏ.పి.యస్.ఆర్.టి.సి బస్సులు కూడా వెళ్తాయి. అయితే ఏపి బస్సులు ఎక్కువ.

ఏ.పి.యస్.ఆర్.టి.సి. బస్సులకి సీట్ రిజర్వేషన్ ఇవ్వబడును అన్న బోర్డుకింద బల్లముందు కూర్చున్న ఒకతనితో మాట్లాడి సుకుమార్ మధ్యాహ్నం పన్నెండున్నరకి బయలుదేరే బస్‌కి మూడు టిక్కెట్లు తలో రెండు రూపాయలిచ్చి రిజర్వేషన్ చేయించాడు.

సుకుమార్ వెయింగ్ మిషన్ మీద వెయిట్ చూసుకుని చెప్పాడు,

"ఈ రెండు రోజుల్లో నలభై గ్రాములు పెరిగాను''

"జోక్ పేలలా! అది కిలోల లెక్క చూపిస్తుందికాని గ్రాములుకాదు'' చెప్పాడు చెయిన్లు సీరియస్‌గా.

పన్నెండున్నరకి వచ్చింది బస్. ముందే రిజర్వేషన్ చేశారుకాబట్టి రద్దీగావున్నా ఏం ప్రాబ్లం లేకపోయింది వాళ్లకి. రెండు రోజుల క్రితం హైద్రాబాద్‌లో బీదర్‌కి బస్ కదలగానే చెయిన్లు "బీదరు పోదాం, బీరు తాగుదాం చలోచలో! అల్లరి చేద్దాం చలోచలో! మూత తీసి, బీరు పోసి హాయిగ తాగేమూ'' అని హుషారుగా పాడాడు. కాని ఇప్పుడు ఆ హుషారేం లేదు అతనిలో.

బస్ కదిలాక కిటికీలో కుడివైపు తాము బీరుసీసాలు కొన్న ప్రిన్స్‌వైన్ షాప్‌ని చూశారు. కొద్దిదూరంలో తామున్న ప్రిన్స్ హెూటల్‌ని చూశారు.

క్రమంగా రోడ్డుపక్కనున్న బీదర్ కోటగోడలు కూడా కదిలిపోయాయి. ముగ్గురు మిత్రులు మౌనంగా ఉన్నారు.

బస్ బయలుదేరిన అరగంట దాటకుండానే అకస్మాత్తుగా ఆగింది. డ్రైవర్ ఇంజన్ ఆపేశాడు. కండక్టర్ లేచి డోర్ తెరిచాడు. ఏం జరుగుతుందో అర్థం అయ్యేలోగానే ఖాకీ డ్రెస్‌లోవున్న ఇద్దరు లోపలకి ఎక్కారు. ఇద్దరికీ టోపీలులేవు.

"ఎవరి దగ్గరైనా లిక్కర్ బాటిల్స్ ఉన్నాయా?" అడిగారు ఒకరు తెలుగులో ఇంకొకరు కన్నడంలో, హిందీలో.

ఎవరినించి సమాధానం లేకపోవడంతో,

"అంతా కిందకి దిగండి'' చెప్పారు.

బస్‌లోంచి ఒక్కొక్కరే దిగారు. వాళ్లు చేసేది కింద నుంచుని కిటికీలోంచి గమనించారు మిత్రులు ముగ్గురూ.

సూట్‌కేస్‌లని రేక్స్‌లోంచి తీసి, గట్టిగా ఊపుతున్నారు.

"ఎందుకలా కదుపుతున్నారు?" అడిగాడు చెయిన్లు కండక్టర్‌ని.

"లోపల బాటిల్స్ ఉంటే అందులోని విస్కీ అటుఇటు కదులుతుందిగా, ఆ చప్పుడుని వాళ్లు గ్రహించగలరు''

సీట్లకింద ఖాళీస్థలంలో నిశితంగా పరిశీలించాక కిందకి దిగారు వాళ్లు.

ఒక్కొక్కర్ని తడిమి, ముఖ్యంగా బొడ్డులో బాటిల్స్ దోపుకున్నారేమోనని తడిమి ఎక్కనివ్వసాగారు. ఆడవాళ్లని కూడా వాళ్లు వదల్లేదు.

"తీసుకు రాకపోవడం మంచిదైంది'' చెప్పాడు చెయిన్లు లోపలికి ఎక్కాక.

వెళ్లచ్చున్నట్లుగా సంజ్ఞ చేశాడు ఓ ఖాకీ, అదే యూనిఫాంలో ఉన్న కండక్టర్‌కి.



అతను ప్రయాణీకులని లెక్కచూసుకున్నాక బస్‌మళ్లీ కదిలింది. బస్ కదిలాక మిత్రులు ముగ్గురు ఒకరి మొహాలు మరొకరు చూసుకున్నారు.

"చూశావా?" చెప్పాడు చెయిన్లు ఫిర్యాదు చేస్తున్నట్లుగా. సుకుమార్ అవునన్నట్లుగా తల ఊపాడు.

దాసాంజనేయులు చిన్నగా నవ్వి చెప్పాడు.

"మనకన్నా వాళ్లిద్దరూ అదృష్టవంతులు''

"అవును... సెలవు పెట్టక్కర్లేదు'' చెప్పాడు చెయిన్లు.

"అంతేకాదు. హోటల్‌కి రోజూ నూటనలభై అయిదు రూపాయలు అద్దెకట్టక్కర్లేదు'' చెప్పాడు సుకుమార్.

ఆ ఇద్దరు ఎక్సయిజ్ కాన్‌స్టేబుల్స్‌నించి వచ్చిన ఆల్కహాల్ వాసనని ఆ ముగ్గురు మిత్రులేకాక, తమని తడమడానికి దగ్గరకి వచ్చిన బస్‌లోని ప్రతివాళ్లూ పసిగట్టారు.

చట్టం సక్రమంగా అమలు జరపబడే ఇంగ్లండ్ లేదా సింగపూర్‌లాంటి దేశాల నించి వచ్చినవాళ్లు ఆ బస్‌లోవుంటే అందుకు ఆశ్చర్యపడేవాళ్లేమో కాని ఓట్లే ధ్యేయంగా పాలించబడే ఈ దేశంలోనిఈ వ్యవస్థని తమ జీవనయానంలో సమూలంగా అర్థం చేసుకున్న పౌరులెవరూ అందుకు విస్మయపడలేదు.

తల వెనక్కి తిప్పి చూసిన చెయిన్లుకి ఆ ప్రొహిబిషన్ అండ్ ఎక్సయిజ్‌చెక్‌పోస్ట్ ముందు ఆగిన ఇంకో బస్‌లోకి ఎక్కుతున్న ఆ ఇద్దరూ కన్పించారు.

**—మల్లాది వెంకటకృష్ణమూర్తి**

---

## దాహం

అది ఈజిప్ట్‌లోని విశాలమైన ఎడారి. పైలట్‌గా శిక్షణలో వున్న అబ్దుల్ నడిపే సింగిల్ ఇంజన్ విమానం ఒకటి ఆ ఎడారిలో కూలిపోయింది. అదృష్టవశాత్తు అబ్దుల్ ప్రాణాలతో బయటపడ్డాడు.

విమానంలోని వైర్‌లెస్ సెట్ పనిచే యడం మానేసిందని గ్రహించాడు అబ్దుల్.

క్రమంగా మిట్టమధ్యాహ్నం అయింది. ఎండ మండిపోసాగింది. కాలికింద ఇసు కంతా వేడి... చుట్టుపక్కల గాలంతా వేడి. క్రమంగా అబ్దుల్‌కి దాహం వేయసాగింది. నీటి ఊటకోసం వెదుకుతూ అతను చాలా దూరం నడిచాడు. ఎక్కడా నీరన్నదే కనప



డలేదు.

నాలిక దాహంతో పిడచకట్టుకుపో యింది. ఇక నడిచే ఓపిక లేక నేలమీద వాలిపోయాడు. ఉన్న కాస్త ఓపికని కూడగ ట్టుకుని ఆవేడి ఇసుకలో పాకసాగాడు.

క్రమంగా సూర్యాస్తమయం అయి చీకటి పడింది. మళ్ళీ తెల్లవారింది. సూర్యుడు నడినెత్తిమీదకి వచ్చేకొద్దీ మళ్ళీ ఎండ. దాంతోపాటు వేడితోకూడిన వడగాల్పులు.

అబ్దుల్ పరిస్థితి నిన్నటికన్నా ఘోరంగా తయారైంది. నాలికమీద తడి ఆరిపో యింది. పెదవులమీద చర్మం ఆ వేడికి పొరలుపొరలుగా లేవసాగింది.

ఆ మధ్యాహ్నం దూరంగా ఇటే వస్తున్న ఎవరో అబ్దుల్ కంటపడ్డాడు. ఆశగా చూశాడు.

ఆ వచ్చినతను టిప్‌టాప్‌గా వున్నాడు. దాదాపు చావుబతుకుల మధ్యవున్న అబ్దుల్ వంక అతను సానుభూతిగా చూశాడు.

"దాహం... వాటర్" చెప్పాడు అబ్దుల్

"నీ అదృష్టం నేను నీకు తారసపడడం" అని అతను తన చేతిలోని సంచీలోంచి రక రకాల టైలని చూపించి చెప్పాడు...

"అదృష్టవంతుడివి. ఇవి నూరుశాతం సిల్క్‌తో చేసిన టైలు. వీటి ఖరీదు ఒక్కోటి పాతిక దీనార్లు. నీకు మాత్రం పది దీనా ర్లకే అమ్ముతాను"

"దాహం... వాటర్... ఎఫెండి" చెప్పాడు అబ్దుల్.

"ముందే చెప్తున్నా. నీకు టైలు అమ్మేవా ళ్ళెవరూ మళ్ళీ తారసపడరు పది దీనార్లుంటే టై కొను. లేదా ఎవరి దారి వాళ్ళది"

"ఎఫెండి, వాటర్" ఈజిప్షియన్, ఇంగ్లీష్ భాషల్లో మళ్ళీ అర్థించాడు అబ్దుల్ దీనంగా.

"చూడ్డానికి నువ్వు మంచివాడిలా వున్నావు. అందుకని నీకు ఎనిమిది దీనార్ల చొప్పున అమ్ముతాను. ఓ టై చాలా? " అడి గాడు అతను ఆలోచించి.



"ఎఫెండి... వాటర్... ఎఫెండి.."

"నీకు బేరం ఆడటం బాగా వచ్చు సరే ఒక్కో టై ఆరు దీనార్లు" చెప్పాడతను.

"ఎఫెండి... ఎఫెండి... ఎఫెండి... వాటర్" నీరసంతో అరిచాడు అబ్దుల్ మళ్ళీ.

"ఆఖరి మాట అయిదు దీనార్లు. నాకు వేరే పనులున్నాయి"

అతను టై కొనకపోవటంతో అతగాడు అబ్దుల్‌ని అలాగే వదిలి ఇంకో దిక్కుకి వెళ్ళిపోయాడు. అబ్దుల్ ఆ రాత్రంతా ఇసుకలో పాకుతూనే ఉన్నాడు. తెల్లారుఝామున దూరంగా ఓ నియోన్ సైన్ వెలుగుతూ కనబడింది. 'లి హోటల్ గాజా' అన్న పేరు కనబడింది. అబ్దుల్‌కి ప్రాణం లేచొచ్చింది. గబగబ పాకుతూ శరీరంలోని ఆఖరి శక్తితో సూర్యోదయం అయ్యే సమయానికి ఆ హోటల్ గేట్ దగ్గరికి చేరుకున్నాడు. వాచ్‌మన్‌తో "ఎఫెండి... వాటర్.. ఎఫెండి" అని లోగొంతుతో చెప్పాడు.

"ఓ! నీకు మంచినీళ్ళు కావాలి? మా హోటల్‌లో అన్ని రకాల నీళ్ళున్నాయి. ఫిల్టర్ వాటర్, మినరల్ వాటర్, సోడావాటర్, కూల్డ్ వాటర్, హాట్ వాటర్... కాని చిన్న చిక్కుంది. మా హోటల్‌లోకి సూట్ వేసుకుని, నీట్‌గా టై కట్టుకున్న వాళ్ళకే ప్రవేశం" చెప్పాడు ఆ వాచ్‌మన్ సానుభూతిగా చూస్తూ!

**–డి. పద్మజ**

---

## కుర్చీపవర్

"**అ**రె! ఇదేంట్రా ఇలా చిక్కిపోయావు?" ఆశ్చర్యంగా అడిగాడు రవి.

"ఏమోరా అదేం చిత్రమోగానీ రాత్రిళ్లు అస్సలు నిద్రపట్టడం లేదురా" చెప్పాడు చంద్రం.

"అప్పుడే నిద్రపట్టకపోవడానికి నీ వయసెంతని? ఇరవైఏడేళ్లు లేవు"

"ఏమోరా అదే నాకూ అర్థం కావడం లేదు. ఎంత ప్రయత్నించినా నిద్ర రావడం లేదు"

"ఆయనకు నిద్రపట్టకపోవడం కాదుకానీ మధ్యలో నా ప్రాణాలు తీస్తున్నారు. నిద్ర రావటంలేదని సెకెండ్‌షో సినిమాలకి వెళతారు. నా పని జాగరణే. నువ్వే ఏదన్నా దారి చూపాలన్నయ్యా" కాఫీ గ్లాసులతో వస్తూ అంది చంద్రం భార్య ప్రభ.

"ఏం ఏమిట్రా నీ బాధ? అప్పులేమన్నా ఉన్నాయా?" కాఫీగ్లాస్ అందుకొని సిప్ చేస్తూ అడిగాడు రవి.

"ఛ!ఛ! అలాంటివేం లేవురా"

"పోనీ ఈ ప్రైవేట్ కంపెనీలో చేయలేకపోతున్నావా?"

"అబ్బే అలాంటిదేం లేదురా"

"పోనీ ఎవరితోనన్నా లవ్‌లో పడ్డావా?" ప్రభకు వినిపించకుండా గొంతు తగ్గించి అడిగాడు.

"ఛ!ఛ! నా గురించి నీకు తెలియదటరా"

"మరింకేమి నీ ప్రాబ్లమ్? నీకెందుకు నిద్రపట్టదు. పోనీ డాక్టర్‌ని కలవకపోయావా?"

"డాక్టర్ నిద్రమాత్రలు రాసిచ్చారు. రోజూ రాత్రిళ్ళు ఒకటి వేసుకొమ్మని. పది మాత్రలు వేసుకొన్నా కనీసం ఆవులింతలన్నా రావటంలేదు"

"పోనీ ఏ మానసిక చికిత్స చేసే డాక్టర్నైనా కలిస్తే?"

"ఆ ముచ్చటా అయ్యిందిరా. నాకేవిధమైన మానసిక టెన్షన్స్, బాధలు, భయాలు లేవని చెప్పాడాయన"

"ఓ పనిచేద్దాం. నాకు తెలిసిన ఒక హిప్నాటిస్ట్ ఫ్రెండ్ ఉన్నాడు. అతడి దగ్గరకు వెళితే ఏమన్నా ప్రయోజనం ఉండచ్చేమో ప్రయత్నిద్దామా?"

"ఊహు! ఆ అవసరం లేదురా ఆ





ప్రయత్నం కూడా విఫలమైంది. పాపం ఆ హిప్నాటిస్ట్ నువ్వు నిద్రపోతావ్, నువ్వు నిద్రపోతావ్ అని గంటసేపు అరిచినా నేను ఒక్క సెకన్ కూడా నిద్రపోలేదు"

"ఛ! ఛ! మరీ అంత డీలా పడిపోకురా! ప్రతీ సమస్యకూ ఓ పరిష్కారం ఉన్నట్లే ప్రతీ జబ్బుకు ఓ మందు ఉంటుంది"

"ఏమిటన్నయ్యా ఆ మందు? " ఆతృతగా అడిగింది ప్రభ.

"ఏమోనమ్మా ఏదో మాటవరసకు అన్నానుకానీ నాకెందుకో నమ్మకం మనవాడి సమస్యకు పరిష్కారం దొరుకుతుందని"

చేస్తావా? " అనడిగాడు చంద్రం ఆవులిస్తూ.

"కాదురా ఈ దెబ్బతో నీ రోగం కుదురుతుంది"

"ఎలా? కుదురు...తు...ం..." అంటూ గాఢనిద్రలోకి జారిపోయాడు చంద్రం.

దాదాపు ఎనిమిదిగంటల తర్వాత కళ్ళు నులుముకొంటూ, బద్ధకంగా ఆవులిస్తూ ఆ కుర్చీలోనుండి లేచాడు చంద్రం.

"ఏం మంత్రం వేశావో, ఏం చేశావోగానీ చాలారోజుల తర్వాత హాయిగా, ప్రశాంతంగా నిద్రపట్టింది. చాలా థాంక్స్. నీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను" అన్నాడు



ధీమాగా చెప్పాడు రవి.

వారం తర్వాత "చంద్రం చంద్రం" అంటూ హడావుడిగా వచ్చాడు రవి.

"ఏంట్రా" అంటూ వచ్చాడు చంద్రం, వెనుకే భార్య.

"ఏంలేదుకానీ ఒకసారి నువ్వీ కుర్చీలో కూర్చో" అన్నాడు తను తీసుకువచ్చిన కుర్చీ వైపు చూపుతూ.

"ఈ కుర్చీ ఏంట్రా? దీంట్లో కూర్చుంటే ఏం జరుగుతుంది" అంటూ ఆ కుర్చీలో కూర్చున్నాడు చంద్రం.

"ఏం జరుగుతుందో నువ్వే చూద్దూగాని"

"ఏం నువ్వుగానీ నన్ను హిప్నటైజ్

చంద్రం.

"థాంక్స్ నాక్కాదు చెప్పాల్సింది. ఈ కుర్చీకి! అవును. ఈ కుర్చీకే"

"కుర్చీకా...? "

"అవును ఇది గవర్నమెంట్ కుర్చీ ఇందులో కూర్చున్న ఎవర్కైనా సరే వెంటనే నిద్ర రావాల్సిందే. చూశావుగా, దెబ్బకు నీకు నిద్రపట్టింది. మా ఆఫీసులో భయంకరంగా గుర్రు పెడుతూ నిద్రపోయే ఓ ఆఫీసర్‌గారి కుర్చీ ఇది. కాస్త కుక్కి అయిందని గోడౌన్‌లో పారేస్తే పట్టుకొచ్చా, పది రూపాయలిచ్చి" వివరించాడు రవి.

**–కలపర్తి సత్యం**

# చతుర

సంపుటి : 21
సంచిక : 9
అక్టోబర్ 1998

పిచ్చిమొక్కలు, అడవిపూలు, మోడువారుతున్న వృక్షాలమయంగా, సదా దహనమవుతుండే శవాలతో ఊరి చివరనున్న ఆ కాటికి... కాపరిగా జీవిస్తోంది ఆ అమ్మాయి. ప్రేమ, పెళ్లి వగైరా మధురానుభూతులేవీ తనకి లేకపోయినా, మూర్తీభవించిన ధైర్యసాహసాలకు ప్రతీకలా... జీవిత చరమాంకమైన జీవుల మహాప్రస్థానాన్ని కళ్లారా చూస్తూ, విధినిర్వహణ చేస్తున్న ఆ యువతి... అక్కడ శ్మశానంలో ఎదుర్కొన్న వింతలు, భీభత్స దృశ్యాలు, భయానక సంఘటనలు ఎలాంటివి?

మరికొద్ది రోజుల్లో జరగవలసిన ఆమె పెళ్లి... ఆగిపోయి హటాత్తుగా జీవితమే ఓ భయంకరమైన మలుపు తిరిగిపోయిన పరిస్థితులేమిటి?

తన ఒంటరి జీవితానికి తోడు-నీడ కోరుకున్న ఆ అమ్మాయికి అవి దక్కాయా? మహిళగా ఎవరూ ఊహించలేని కాటికాపరి బాధ్యతను ఆమె ఎలా నిర్వహించగలిగింది?

అడుగడుగునా ఉత్కంఠతో ఆపకుండా చదివించే......



ఐ.కవిత

# కాటిచిలక

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

సాయంత్రం నాలుగు దాటుతుంటే శివాని మంచం దిగింది.

టీ కాచుకుని తాగి, కుటీరం బయటకు వచ్చింది.

సాధారణంగా అది శవాలొచ్చేవేళ.

ఆమె శ్మశానం ఆవరణంతా కలయజూసింది,

కొన్ని నిముషాల తర్వాత అక్కడే పచార్లు చేయసాగింది.

ఎండలో వేడిలేదు. గాలిలో చల్లదనం.

"వాతావరణం ఎంత బాగుందీ..." అనుకుందామె. సరిగ్గా అప్పుడే

గేటు తోసుకుని ఎవరో యువకుడు ఇటే వస్తున్నాడు. లాల్చీ షరాయీ కళ్లజోడూ... ఎవరబ్బా? శవం తాలూకువాడిలా కనిపించడంలేదే. అనుకుందామె.

అతను ఆమెని చూస్తూ తిన్నగా ఆమె వద్దకే వచ్చాడు.

కొంచెం మొహమాటపడుతూనే- "కాటికాపరి కావాలి" అన్నాడు.

"శవదహనమా? " అడిగిందామె.

"కాదు"

"మరి? " ఆశ్చర్యంగా చూసింది.

శవదహనానికి కాకుండా కాటికాపరితో ఎవరికైనా పనేమిటీ? ...

అతను కొంచెం సందేహిస్తూనే ఆమె ముఖంలోకి చూశాడు, కొంచెం తీక్షణంగా "పని చెబితేకాని అతని ఆచూకీ చెప్పరా? " సూటిగా అడిగాడు.

ఆమె కంగారుపడుతూ "ఎందుకు చెప్పనూ? ఊరికే తెలుసుకుందామని అడిగా. ఆc నేనే కాటికాపరిని" అంది.

అతను నవ్వేశాడు. "ఆడవాళ్లు అబద్ధమాడితే గోడకట్టినట్లుంటుందంటారు. కాని మీ అబద్ధం కనీసం దడి కట్టినట్లు కూడా లేదు. నోజోక్స్ చెప్పండి, కాటికాపరెక్కడ? "

"నాతోరండి" అంటూ ఆమె అతన్ని కుటీరంలోకి తీసుకెళ్ళింది.

అతన్ని కూర్చోమనయినా అనకుండా గదిలో మూలగా ఉన్న ట్రంకుపెట్టె తెరచి దానిలోంచి ఒక వార్తాపత్రిక మడతతీసి అందించింది.

"మీకభ్యంతరం లేకపోతే బయటకు వెళ్దాం. అక్కడ కాస్త గాలి, వెలుగూ" అన్నాడతను.

"పదండి"

ఇద్దరూ బయటకొచ్చి శ్మశానంలో ఒక మూల గడ్డిలో కూర్చున్నారు. అప్పుడతను ఆ వార్తాపత్రిక విప్పి సాకల్యంగా చూడసాగాడు. అలా చూస్తూ ఓచోట ఆగిపోయాడు. ఒక్కసారిగా అతను తుళ్లిపడ్డాడు. కళ్లజోడు తుడుచుకుని ఆత్రంగా చదవసాగాడు.

ఓ ఫోటో, దానికింద అరకాలమ్ వివరాలు.

అదంతా చదివాక... "నేను నమ్మలేకపోతున్నాను" అన్నాడు ఆశ్చర్యంగా ఆమెనే చూస్తూ.

"హరిశ్చంద్రుడంతటి మహరాజునే కాటికాపరిని చేసింది విధి. నాలాంటిది చేస్తే ఆశ్చర్యమేముంది? అయినా నిజాన్ని నమ్మలేనివారిని ఎవరేం చేయగలరు? చూడండి. నేనిక్కడ చేరి ఆరు సంవత్సరాలు పూర్తయి ఏడో సంవత్సరం నడుస్తోంది" అందామె నవ్వుతూనూ, ఇంకా నమ్మలేకపోతే మీ కర్మ అన్నట్లు చూస్తూనూ.

కాటికాపరిగా ఒక స్త్రీ?

అందులోనూ ఏ వృద్ధురాలో కాదు. యౌవనవతి అయిన స్త్రీ!

"ఇది ఎలా సంభవం? " సందేహం మనసులో ఇముడ్చుకోలేక బయటకు కక్కేశాడ




తను.

"మీ ప్రశ్నకు జవాబు అంత సులభమూ కాదు, టూకీగా చెప్పగలిగేదీ కాదు. మీ సందేహానికి నా సమాధానం. ఇన్నేళ్ల నా జీవితచరిత్ర"

అతని కళ్లలో ఒక్కసారిగా మెరుపు. "మేడమ్ నా పేరు వినయ్. ఈమధ్యనే ఈ వూరొచ్చాను. నేను పత్రికా రచయితని. కవిత్వం కూడా రాస్తుంటాను" ఆమె పరిశీల నగా చూసిందతన్ని. దుబ్బులా పెంచిన జుత్తు. చేతిలో స్క్రిబ్లింగ్ ప్యాడ్. జేబులో కలం. లాల్చీ, పైజామా, కాళ్లకు ఆకుజోడు.

"చలువ కళ్లజోడు
జులపాలు గిరజాలు
భావకవికి లేనివేవి లేవు
కవితయందు తప్ప గట్టివాడన్నింట"

అన్న పద్యం గుర్తుకొచ్చిందామెకు.

"నా పేరు శివాని. ఒక్క నిముషం. ఇప్పుడే వస్తాను" అని ఆమె లేచివెళ్ళింది. అతను కొంచెం అవమానించబడినట్లు భావించాడు. మాట్లాడుతుంటే మధ్యలో వెళ్లిపోయిందేం?

పది నిముషాలలో ఆమె తిరిగి వచ్చి రెండు కప్పులలోనూ ఒకటి తనకంది స్తూంటే తప్ప అతనికి తెలియలేదు ఆమె అలా వెళ్ళిన కారణం.

"అనవసరంగా శ్రమ తీసుకున్నారు" అన్నాడతను టీ కప్ తీసుకుంటూనే.

"ఎలాగూ నాకిది టీ టైమే. మీవంటి రచ యితల కీపాటి అతిథి సత్కారమయినా చేయకపోతే సాహితీలోకానికే అవమానక రంకదా? "

టీ తాగడం అయ్యాక అతను హటాత్తుగా అడిగాడు. "మిస్ శివానీ! ఆడవాళ్ళనెందుకు శ్మశానానికి రానివ్వరు? "

"సంప్రదాయం"

"ఆ సంప్రదాయానికి అర్థమూ మూలమూ ఏమిటని? "

ఆమె ఆలోచనలో పడింది.

"మీరు శ్మశానంలోనే ఉంటున్నట్లున్నారు. మీకు తెలుసేమోనని" ఒకక్షణం ఆగి "ఆ సంప్రదాయం గురించి చెప్పగలిగితే ఓ స్త్రీవాద నవలో, కథో తయారవుతుంది. ఇప్పుడు గిరాకీ అంతా వాటికే" అన్నాడ తను.

ఆలోచననుంచి తేరుకున్నట్లు ఆమె మెల్లగా అంది. "మీకు కావాలంటే నేను నాకు తెలిసినవి చెబుతాను. కాని వీటికి చారిత్రక ఆధారాలవంటివేవీ లేవు"

"దానికేం? చెప్పండి. వినదగునెవ్వరు చెప్పిన అనికదా సుమతీ శతకకారుడి ఉవాచ?! చెప్పినంతలో మీకూ, విన్నంతలో నాకూ ఏమీపోదు. ఏ పుట్టలో ఏ పాముందో? ఏ బుర్రలో ఏ ఊహుందో? చెప్పండి చెప్పండి" ఉత్సాహంగా చూశాడు.

**"మీకు పిల్లుల విషయం తెలుసా? "**
**"పిల్లుల విషయమా...? ఏమిటది? "**

"మగపిల్లి- ఆడపిల్లి ప్రసవించిన పిల్లికూన లను తన సంతానమే అయినా సరే చంపే సేందుకు ప్రయత్నిస్తుందట"

"పులి కూడా అంతేనట. తన పిల్లల్ని తానే తినేస్తుందట"

"అలా తినేది ఆడపులి. ఆకలికొద్దీని అని విన్నాను. పిల్లి విషయం వేరు. మగపిల్లి పిల్లల్ని చంపేది ఆకలికొద్దీ కాదు"

"ఓహో! ఎందుకూ? "

శివాని కొంచెం సిగ్గుపడుతున్నట్లు కళ్లని ఎటో మరల్చి "సంతానం ఉంటే ఆడపిల్లి తన కోర్కెను తీర్చదని. ఆ పిల్లలను చంపేస్తే సంతానం కోసం చచ్చినట్లు తన కామం తీరుస్తుందనీ... అంటారు.

"మనుషులలో మాత్రం మృత్యువు వైరాగ్యభావాన్ని కలగజేస్తుంది. శ్మశానవైరాగ్యమనే మాట మీకు తెలియంది కాదు. శవం, చితిమీద కాలడంలాంటివి చూస్తే తాత్కాలికంగా అయినా వైరాగ్యం కలగకమానదు. స్త్రీలు శ్మశానానికి వచ్చి మృత్యువు అనంతరం శరీరానికి జరిగే సంస్కారం చూస్తే జీవితంమీద, సృష్టిమీదా విరక్తి ఏర్పడి సృష్టి వాంఛమీద అనురక్తి తొలగి శారీరక వాంఛలపట్ల ఆసక్తిపోయే ప్రమాదం ఏర్పడవచ్చు.

అసలే స్త్రీ పాలిట ప్రసవమనే గండం ఉంది. ఆ యమయాతన పడలేక విపరీతమయిన ఆ బాధాపూరిత సమయంలో మరెప్పుడూ మగవాడిని చేరనివ్వకూడదనుకుంటారు. అయితే ఈ ప్రసూతి వైరాగ్యమూ తాత్కాలికమే. సృష్టించిన స్త్రీయే తన సృష్టి అంతాన్ని కూడా చూస్తే ఆమెకు సృష్టివాంఛే నశించిపోతుందన్న భయంతో ప్రసూతినెలాగూ శాసించలేరు కనుక శ్మశాన ప్రవేశాన్ని మాత్రం నిషేధించారేమో మగవాళ్లు. పురుషాధిక్య సమాజం ఆ సంప్రదాయానికి పైకి మాత్రం స్త్రీలు సున్నిత హృదయులు కనుక చితిమీద శవం కాలడమనే జుగుప్స, భీభత్సం కలిగించే దృశ్యం చూడలేరని, అలాటి నిషేధం విధించామని చెప్పవచ్చు"

ఆమె ఉద్దేశం అతని కర్థమయింది. కాని అంతగా నచ్చినట్లు లేదు.

"మీరు రచయిత్రులా? "

"కాను. కేవలం ఓ పాఠకురాలిని. మంచి పాఠకురాలినని కూడా అనుకోవచ్చు"

"మీరు చెప్పింది బాగానే ఉంది. సరేగానీ, నా రచనలకూ మీరు పాఠకురాలెందుకు కాగూడదు. మీ అభిప్రాయాలూ, సలహాలూ నాకెంతో ఉపకరించవచ్చు"

"మీరిస్తున్నది నా అర్హతకు మించిన అవకాశం. కాని అంత్యనిష్ఠూరంకంటె ఆది నిష్ఠూరమే మేలంటారని ముందే చెబుతున్నాను. నేను విమర్శకురాలిని కాను. శైలి, శిల్పం, ఇజాలు ఇలాంటివేవీ నాకు తెలియవు. ఏ రచననైనా చదవడం నాకేమనిపించిందో చెప్పడంవరకూ చేయగలను"

"అదేమీ తక్కువ కాదు. వ్రాతప్రతి చదవడం కొంతవరకూ శ్రమ, చికాకులతో కూడినదే. సరే నేను మళ్ళీ కలుస్తాను. ఈలోగా నేను అడిగినదానిమీద మీకు మరిన్ని ఊహలు రావొచ్చేమో. ఆలోచించి చూడండి"

అతని కళ్ళజోడు అద్దాలమీద సాయంత్రపు ఎండపడుతూ చిత్రంగా మెరుస్తూంటే శివాని అటే చూస్తూ ఉండిపోయింది.

ఎందుకో వాళ్ళిద్దరిమధ్యా కొన్ని నిముషాలపాటు నిశ్శబ్దం ఏర్పడింది. ఆ నిశ్శబ్దం శివానికి విసుగు తెప్పించేంతగా ఎదురౌతూంటుంది. అందుచేత మరో మనిషి ఉండగా సాధ్యమైనంతవరకూ ఆమె నిశ్శబ్దానికి గెలుపునివ్వదు.

"మీరింతవరకూ ఎన్ని రచనలు చేశారు? ఎన్ని అచ్చయ్యాయి? "అడిగిందామె.

"పాతికవరకూ ముద్రణకు నోచుకున్నాయి. మీరు చదువుతానంటే ఆ కటింగ్స్ తెస్తాను"

"తప్పకుండా తెండి"

అదే క్షణంలో ఓ ప్రశ్న అతని నాలిక చివరివరకూ వచ్చేసింది. స్త్రీ అయి కొంచెం చదువుకున్నట్లు కూడా కనిపిస్తున్న ఈమె కాటికాపరి పని ఎందుకు చేస్తున్నట్లు? ఈమె సంబంధీకులు ఎలా ఒప్పుకున్నారిందుకు?

ఇలా ఇంకెన్నో సందేహాలు.

కాని అన్నప్రాశననాడే ఆవకాయముక్కా అన్నట్లు పరిచయం అయీ అవకుండానే స్వవిషయాలు అడిగితే ఆవిడేమనుకుంటుందో అని తన అనుమానాలనీ,




కుతూహలాన్ని వాయిదా వేశాడు.

"చూడండి. స్త్రీలను శ్మశానానికెందుకు రానివ్వరనే అంశంమీద మీకేమయినా తెలిస్తే నాకూ చెప్పాలి సుమండి"

"అంత అద్భుతం జరగాలేకాని మీకు చెప్పకుండా ఉంటానా? " నవ్వేశాడతను. ఇక వెళ్తానన్నట్లు లేస్తూ.

మళ్ళీ అంతలోనే ఏదో గుర్తుకొచ్చి సంచి తెరిచి కొన్ని కాగితాలు బయటకు తీసి పరిశీలించాడు.

"అదృష్టం. నా కథ వ్రాతప్రతి ఇక్కడే ఉంది" అన్నాడు సంతోషంగా.

"ఓ...!"

అతను విడివిడిగా ఉన్న కొన్ని కాగితాలను అక్కడక్కడా చదువుతూ ఒక వరసలో పెట్టి, పేజీలకు నంబరువేసి సంచీలోంచి ఒక పిన్ వెదికితీసి వాటిని గుచ్చాడు.

అతనామెకి కాగితాల బొత్తిని అందించాడు. "మేడమ్! మీరు పాఠకురాలినని మీరే చెప్పారు. వ్రాతప్రతి చదివి మీ అమూల్యాభిప్రాయం చెప్పగలిగితే మీ సూచనలూ సలహాలూ విని నా కథ అవసరమైన మార్పులుచేసి పత్రికకి పంపుతాను"

ఆమె ముఖంలో భయసందేహాలు. "ఒక రచనను విమర్శించగలిగేంత గొప్పదాన్నేమీ కాను నేను"

"నేను కోరుతున్నది విమర్శ కాదు. అభిప్రాయం. కథ చదివి ఏమనిపించిందో చెబితే చాలు. విమర్శ కూడా అందిస్తే మరీ మంచిది. శివానిగారూ! మీ మాటలలో మంచి భాష తొంగిచూసింది. మీరు చక్కగా ఆలోచించగలరని కూడా అనిపించింది. అవి చాలు ఒక రచన నిగ్గు తేల్చడానికి. కథ చదివితే మీకేమనిపించిందో నిర్మొహమాటంగా చెబితే అదే పదివేలు. నాకీపాటి ఉపకారం చేసిపెట్టరూ? ప్లీజ్"

"భలేవారే. రచయితలయిన మీరు ఏమీ కాని నన్ను ప్రాధేయపడడమా? నావల్ల ఎవరికేనా, ఏమయినా ఉపకారం జరుగుతుందంటే అంతకంటె ఏం కావాలి? తప్పకుండా మీ కథ చదువుతాను" అందా కథ వ్రాతప్రతిని జాగ్రత్తగా పట్టుకుని.

"థాంక్స్. రేపటి కొచ్చేదా? " ఆత్రంగా అడిగాడు.

అలాగే అన్నట్లు తలూపిందామె.

చెప్పినట్లే మర్నాడే వచ్చాడు వినయ్.

"నమస్తే శివానీ మేడమ్!"

"నమస్తే"

"నా ముద్రిత రచనలు మూడూ, అముద్రితం ఒకటీ తెచ్చాను. ముందు ఇది చదివి ఇక్కడికిక్కడ, ఇప్పటికిప్పుడు మీ అభిప్రాయం చెప్పెయ్యగలిగితే చాలా సంతోషం. మీ రుణం ఈ జన్మలో తీర్చుకోలేను. నా చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా మీ రుణం తీరదు వంటి బరువయిన డైలాగులు కూడా చెబుతాను. మా రచయితల బలహీనతే ఇదనుకుంటాను"

"ఏమిటి? " అడిగింది శివానీ టీ అందిస్తూ.

మిగిలినదెలా ఉన్నా తనకోసం కూడా ఒకమనిషి వస్తూండడం ఆమెకు చాలా బాగుంది.

పైగా ఆ రావడం తను ఒంటరిగా ఉండే ఆడపిల్ల అన్న ఆశతో గింజలు జల్లడానికీ, వల విసరడానికీ కాదు. మాట్లాడడానికి!

తననొక పాఠకురాలిగా గుర్తించి, తన అభిప్రాయం కోరుతూ మరీ రావడం! అంటే నిజంగా తనకి కొంచెం గర్వం కూడా వేస్తోంది.

ఒక రచయిత, యువరచయితే అయినా తన రచనమీద అభిప్రాయం, పోనీ ఉద్దేశం కోరుతున్నాడంటే తనని గౌరవించినట్లే మరి.

తన ఉద్దేశానికి విలువిస్తాడు కనుక సహ




జంగానే అతని కోసం ఎదురుచూపు. తను ఆ రచయితకి తొలి పాఠకురాలు!

తను జీవితచరిత్రలూ, ఉపన్యాసాలతో పాటు తటస్థపడాలే కాని కాల్పనిక సాహిత్యమూ చదువుతుంది. అక్షరాలంటే అదో వెర్రే. అచ్చయినదేది కనపడినా ఆఖరికి వైజ్ఞానిక వ్యాసమయినా చదివెయ్యవలసిందే అర్థం కావడం సంగతెలా ఉన్నా. అందుకనే చదవగానే అతని కథమీద తనకి తోచిన అభిప్రాయం చెప్పింది. వంట చేయడం కష్టంకాని, వండిన వంట రుచి చెప్పడానికేం కష్టపడాలి? తినడమూ ఎలా అనిపించిందో చెప్పడమూ. కాకపోతే కొంచెం మనసుండాలి.

తను చేసినదీ అంతే. అతని రచనను ఏకాగ్రతతో, మనసు పెట్టి చదివింది. "వినయ్‌గారూ! నిన్న ఇచ్చారే వ్రాతప్రతి అదే... మీ కథ బాగుంది. భాష... శైలి... శిల్పం వీటి సంగతి చెప్పేందుకు నేనేమీ విమర్శకురాలిని కాను. మీ రచన చదివాక నాకేమనిపించిందంటే దానినుంచి చాలామంది నేర్చుకోదగిన, తెలుసుకోదగిన అంశాలున్నాయి. ఆద్యంతమూ ఏకబిగిన చదివించిందీ కథ. సంఘటనలు కృతకంగా కాక సహజంగానే తోచాయి. కల్పన కూడా నేల విడిచిన సాము కాదు. పాత్రలు బలమూ, బలహీనతా రెండూ కలిగివుండి సజీవంగానే తోస్తాయి పాఠకులకి. కాకపోతే మీకు మనుషులమీద, మానవ సమాజంమీద ఆగ్రహమో, అసంతృప్తో ఉందేమోననిపించింది. ఎందుకని? "

"భగవంతుని సృష్టిలో ప్రాణికోటిలోకెల్లా తానే గొప్పవాడినని విర్రవీగుతాడు మానవుడు. ఎందుకంటే తనకి మెదడుందిగదా అని. అయితే... దానినెందరు సవ్యంగా వినియోగిస్తున్నారనేది సందేహమే. ఎక్కువ మంది సామాజిక స్పృహతో వ్యవహరించగలిగితే నేటి సమాజం ఇలా ఇన్ని చిక్కుముడులు పడి ఉండేది కాదేమో" అన్నాడు వినయ్.

శివాని సీరియస్‌గా వింటోంది. అయినా అతని ఉద్దేశ్యంతో సహకరించినట్లు తెలియజేయాలని, "మీరన్నది నిజమే. ఒక కోణంలోంచి చూస్తే మనిషంత వ్యర్థజీవి సృష్టిలోనే లేదేమో! మానవులారా! సుఖపడండి. మీకోసం ప్రకృతినీ, అందాలనీ, ఆనందాలనీ సృష్టించానని దేముడు వరమిచ్చినా డబ్బు, అధికారం వంటి వాటిని కనిపెట్టి వీటికోసం మనిషికీ మనిషికీ మధ్య దూరాన్ని రోజురోజుకీ పెంచుకుంటూ వాటికోసం కొట్టుకుచస్తూ రాగాలు వెల్లివిరియవలసిన భూమి మీద రక్తాలు చిందిస్తున్నాడు. వినయ్ మీకొకటి తెలుసా? " టీ కప్పు కింద పెట్టేస్తూ అడిగింది.

ఏమిటన్నట్లు చూశాడతను.

బయట కూర్చుని మాట్లాడుకుందాం పద మన్నట్లు చూసి, తనే లేస్తూ, "బతికుండగానే కాదు, చనిపోయాక కూడా మనిషి ఎందుకూ పనికిరానివాడే. జంతువులు చనిపోయినా వాటి చర్మమో, కొమ్ములో, బొచ్చో పనికొస్తుంది. ఆవిధంగా పరోపకారం చేసుకుంటుంది జంతువు చనిపోయాక కూడా. మరి మనిషి? "

"బాగా చెప్పారు. అందులోనూ మన దిక్కుమాలిన సంప్రదాయాలొకటి. జైనులో, పార్శీలో కాని శవాన్ని ఊరిచివర ఎత్తయిన ప్రదేశంలో ఉండే జవరాయిమీద పెట్టి వచ్చేస్తారట. ఆ శవాన్ని గెద్దలూ, రాబందులూ, కాకులూ అవీ తింటాయనీ, తినాలని. ఆ ఆచారానికి అర్థమూ, ప్రయోజనమూ కూడా కనిపిస్తుంది. మరి మనవాళ్లో.

పోస్టుమార్టమ్ చేయవలసి వస్తే అదే అనుమానాస్పద, ప్రమాదపరిస్థితుల్లో సంభవించే మృతులకి శవాన్ని కొయ్యొద్దని ఏడుపులు!

"వెధవది శవాన్ని కోస్తే ఏమిటి, నరికితే

# ఐస్‌క్రీం తినడం అతని ఉద్యోగం

సచిత్ర విచిత్రం




కాలిఫోర్నియాలోని ఓక్‌లాండ్‌లో నివశించే జాన్‌హేరిసన్ రోజూ ఐస్‌క్రీమ్ తింటూ ఏటా 10 లక్షల డాలర్లు సంపాదిస్తాడు. ఎడిస్‌గ్రాండ్ ఐస్‌క్రీమ్ అనే కంపెనీలో ఇతను ఐస్‌క్రీమ్ బావుందో లేదో రుచి చూసి నిర్ణయించే ఐస్‌క్రీమ్ టేస్టర్. అతని నాలుక రుచి గ్రంథులు ఎంతశక్తివంతమయినవంటే చిన్న తేడాని కూడా గుర్తించగలవు. అందుకే ఆ కంపెనీ అతని నాలుకని 10 లక్షల డాలర్లకి ఇన్సూర్ చేసింది కూడా. క్రితంరోజు తయారైన ఐస్‌క్రీమ్‌ని ఇతను రుచి చూడడం ఉదయం 7.30 నుంచి మొదలు పెడతాడు. రుచి చూశాక ఉమ్మేస్తాడుగానీ ఐస్‌క్రీమ్ తినడు లావు అవుతాడని. రుచి గ్రంథులు తాజాగావుండాలని ఇతను ఆల్కహాల్, వెల్లుల్లి, ఉల్లిపాయ, మసాలాదినుసులు తీసుకోడు.

ఏమిటి, ఈఢ్చితంతే ఏమిటి?

"వైద్య పరిశోధనలకు శవాన్నిస్తే ఆ శవం గాడికి ఉత్తర గతులుండవని ఓ ప్రచారం.

"బతికున్నవాళ్ళకి కళ్ళిచ్చి కూడా పుణ్యం చేసుకోదు శవం

"అంతటి పరోపకార పారీణత మనవాళ్లకి

"శవాన్ని నక్కలు పీక్కుతిని ఆకలి తీర్చేసుకుని సుఖపడిపోతాయేమో అని వాటికా అవకాశం లేకుండా శవాన్ని కాల్చేస్తారు బూడిదైతే ఇంకెవరికీ పనికిరాదనే తృప్తితో. శవాన్ని కాల్చేందుకు కట్టెలు!

"అంటే ఓ చెట్టుని లిటరల్‌గా చంపడమేగదా!

"ఒకవేపు వనమహోత్సవాలూ, మరోవేపు శవదహనాలకి కట్టెలకోసం చెట్లు నరకడమూ ఇదీ మన తెలివి"

అలా మాట్లాడుతూ ఎర్రబడిన అతని ముఖం చూస్తే శివానికి ముచ్చటేసింది. "మీలో ఎంత ఆవేశం. ఎంత ఉద్రేకం! అందుకే రచయితయ్యారేమో మీరు. మీ రచనలోనూ ఇదే కచ్చితమూ సూటిదనమూను. నిజానికి సమాజానికివాళ మీలాటి రచయితలే కావాలి. మీ రచనలవంటివే సమాజానికి షాకివ్వగలవు. లేకపోతే ఎంతసేపూ- లవ్వూ, సెక్సూ, హారరూ సస్పెన్సూ, థ్రిల్లర్లూ, క్రయిమే. అనకూడదుకాని పాఠకులని ఈ నవలలూ, సినిమాలూ పెడతోవలు పట్టించొదిలేస్తున్నాయి. సత్యమూ, వాస్తవికతా, సామాజిక స్పృహ కలిగిన ప్రయోజనాత్మక నవలలు అరుదుగా మాత్రమే వస్తున్నాయి. సాహిత్యం సమాజానికి అద్దమే అన్నారెవరో"

"ఇవాళ సామాజిక స్పృహ అనేపదం వెటకారమూ, వేళాకోళమూ అయిపోయింది. వాస్తవికత ప్రతిబింబించే నవలలను ప్రచురించే పత్రికలే కరువయ్యాయి" నిట్టూర్చాడతను.

"మరిమీరు అలాంటి రచనలే చేశారేం? "

"ఇంకోలా రాయలేక! మీరు మనస్ఫూర్తిగా ఆ మాటంటున్నారా మేడమ్? "

"ఏమాట? "

"నా రచన సామాజిక విలువలకు రూపకల్పన అని"

"ఓం... అది నేను నిర్మొహమాటంగానూ, మనస్ఫూర్తిగానూ అన్నదే. నేను వీలయినంతవరకూ ఒకరిని వంచించను. ఆత్మవంచన చేసుకోను"

"నా రచనా సంవిధానం మీకు నచ్చిందా? "

"ఇందాకే చెప్పానుగా. చక్కగా పాఠకుడి మనసుకి హత్తుకునేటట్లు రాశారు, నిన్న చదివినదీ, ఇప్పుడు చదివినదీ రెండూ కూడా చక్కగానే రాశారు"

"నేను విషయానికి న్యాయం చేకూర్చానా? "

"నిస్సందేహంగా. మీ భాషా, భావప్రకటనా కూడా అందరికీ అందేలాగా ఉన్నాయి"

"అయితే మీరు నాకో ఉపకారం చేయగలరా? " చాలా ప్రాధేయపూర్వకంగా.. అడిగాడు.

"ఏమిటి? "

"మంచి కథావస్తువుల కొరతతో అంతగా రచనలు చేయలేకపోతున్నాను. మీరు ఓ మంచి కథావస్తువే. కాటికాపరిగా కోమలి. నాకు మీరిక్కడ ఈ పనిలో చేరాక ఎదురయిన రకరకాల సంఘటనలూ అనుభవాలూ చెబితే వాటిలోంచి సమాజానికి పనికొచ్చేవి ఏరుకుని రచన చేస్తాను. మీ పేరు అలాగే ఉంచమంటే సరే. లేదా పేరుమార్చమన్నా నాకభ్యంతరంలేదు. పేరుదేముంది, విషయం ప్రధానం కాని. ఆ రచన అచ్చ

య్యాక పారితోషికం వస్తే దానిలో సగం మీదే. నాకు నిజాలు కావాలి. అప్పుడే నేను నిప్పులు చెరిగే రచనలు చేయగలుగుతాను. సమాజాన్ని కమ్చీపెట్టి మేల్కొలపగలుగుతాను. ప్లీజ్.... శివానీ నాకు మీ అనుభవాలు చెప్పరూ? ప్లీజ్..." అర్థించాడు వినయ్.

"కొంచెం వ్యవధివ్వండి ఆలోచించుకుందుకు. మీరు మళ్ళీ వచ్చినప్పుడు చెబుతాను. మీ అచ్చయిన రచనలమీద అభిప్రాయం కూడా చెబుతాను"

అతను వెళ్ళిపోయాక తీవ్రంగా ఆలోచించింది శివాని.

వినయ్ తన కథ రాస్తానంటున్నాడు. తన అనుభవాలు రాస్తానంటున్నాడు. తన కథవల్ల సమాజానికేమయినా ఉపయోగముంటుందా? తన కథ చదివి ఎవరేనా, ఏమయినా నేర్చుకోగలుగుతారా? తెలుసుకోగలుగుతారా? కాటికాపరిగా తన అనుభవాలు ఎవరికయినా వినియోగపడతాయా?

ఎంత ఆలోచించినా ఆమె ఓ నిర్ణయానికి రాలేకపోయింది. ఎవరూ తనకి తాను మంచి న్యాయనిర్ణేత కాజాలరనుకుంటూ వినయ్ ఇచ్చివెళ్లిన అతని అచ్చు రచనలు తీసింది. అవి చదువుతూ తన సమస్యను మరచిపోయింది తాత్కాలికంగా.

మర్నాడు వినయ్ వచ్చాడు. అచ్చయిన కథలమీద ఆమె అభిప్రాయం చెప్పాక సూటిగానే అడిగేశాడు. "మేడమ్! మీ కథ గురించి ఏంనిర్ణయం తీసుకున్నారు?"

"అది... అది ఎటూ తేల్చుకోలేకపోతున్నాను" అంటూనే క్షమించమన్నట్లుగా తల వంచుకుంది. ఆమెనప్పటికే రెండు మూడు సార్లు కలుసుకుని ఉండడమూ, కలుసుకున్న ప్రతిసారీ ఎక్కువసేపు, ఎక్కువ విషయాలూ మాట్లాడుకోవడమూ వల్ల ఏర్పడిన కొద్దిపాటి చనువుతో "దీనినంత అంతర్జాతీయ సమస్యగా భావించి భయపడవలసిన అవసరముందంటారా? మీరు కాటికాపరి కావడానికి దారితీసిన పరిస్థితులేమిటో చెబుతారు. ఒక స్త్రీ కాటికాపరిగా పనిచేయడమన్నది సాధారణ పరిస్థితి కాదు. కొంత సంచలనాత్మకంగా ఉంటుంది. మీ కథ పాఠకులచేత ఉత్కంఠతో చదివించేదిగానే ఉంటుందని నా విశ్వాసం"

శివానీ ఏమీ అనలేదు.

"మీ అనుభవాలు సాధారణమైనవయి ఉండవనే నా నమ్మకం"

"అది మాత్రం నిజమే. స్త్రీని కావడంవలన అనే కాదుకానీ కాటికాపరిగా నేను ఎదుర్కొన్న అనుభవాలు తక్కువేం కాదు ఆరేడేళ్లలోనూ. నా కథ చెబుతాను. పనికొస్తుందంటే రాసుకోండి. అలాగే నా అనుభవాలూ వివరిస్తాను. అయితే వీటిని రాసేటప్పుడు ఏది ఎంతవరకూ ఎలా రాయాలో నిర్ణయించుకోవలసింది మీరే.

"ఓ దానికేం. నాకు కావలసింది రచనకు ముడిసరుకు మాత్రమే. దానికే రూపమివ్వాలి అనేది నాకు చేతనయిన పని. నా రచనా విధానం మీకూ నచ్చిందికదా? ఆ... మీ కథ ప్రారంభించండి శివానీగారూ!" అని అతను కాగితమూ, కలమూ అందుకున్నాడు.

★ ★ ★

"మా ఆవరణలో నవ్వులు నిషిద్ధం. ఏడుపులకే అనుమతి.

"ఇక్కడ ఆనందం అసభ్యత, దుఃఖమే సభ్యత.

"ఇది మందహాసాల కెంతమాత్రమూ చోటుకాదు. దుఃఖాశ్రువులకే నిలయం.

"ఇక్కడ ఎప్పుడూ ఏడుపులూ, పెడబొబ్బలూ, శోకాలూ, రాగాలూ లేదా కరడుకట్టిన నిశ్శబ్దం. మరో శబ్దానికి స్థానముండదు.





"ఇక్కడ పొగత్రాగరాదు అనే హెచ్చరిక వేలాడదీసి ఉంచం.

"అయినా ఇక్కడెవరూ పొగతాగరు... మాతో పనిపడి వచ్చినవారైతే తప్ప.

"అదేమిటో ఈ ఆవరణలు ఎక్కడయినా ఊరికి ఉత్తరాన్నే ఉంటాయి. అలా ఉండడానికేమాత్రం వీలున్నా ఈ ఆనవాయితీ తప్పదు. వాస్తు అలా నిర్దేశించింది. వేయి గడపలు దాటిన పట్నానికి మాత్రం వాస్తు అన్వయించనక్కరలేదని శాస్త్రం. కనుక పట్నాలలో... మరీ పెద్ద పట్నాలలో స్థలం దొరికిందే చాలని ఉత్తర దక్షిణాల ఊసెత్తకుండా పనసకాయ దొరికనప్పుడే తద్దినమన్న చందాన ఎక్కడ చోటుంటే అక్కడ నెలకొల్పుతున్నారుకానీ శాస్త్రం మాత్రం మా ఆవరణలు ఊరికి ఉత్తరానే ఉండాలంటుంది.

"మీకు తెలుసుగా... ఉత్తరం దిక్కు ఎప్పుడూ కష్ట కథలకు ఆలవాలమే. ఉత్తరం దిక్కున తలపెట్టుకుని పడుకున్నందుకే గదా ఆ గజరాజు శిరసు ఖండించబడింది? ఆ ఖండిత శిరస్సే గణపతికి తల అవడం వేరే కథ.

"చందమామ కథలు మాత్రం

"ఏ గదినయినా తెరువుకాని ఉత్తరంవేపు గది తలుపులు మాత్రం తెరవకూ అని రాజకుమారుడికి చిలకకి చెప్పినట్లు పదేపదే చెప్పడమూ, తీరా అతను అదే తెరచి చిక్కుల్లో పడడమూ, బోలెడంత కథ నడవడమూ మీకు తెలియంది కాదుగా?

"ఇవి పురాణాల రోజులూ కావు. ఇది చందమామ కథల కాలమూకాదు. శాస్త్ర విజ్ఞాన శతాబ్దంకదా?

"ఎలక్ట్రిసిటీ రోజులు, ఎలక్ట్రానిక్స్ రోజులు, కంప్యూటర్ కాలం.

"మేమూ ఏమీ వెనుకబడి ఉండిపోలేదు సుమండీ.

"కాలంతో పాటు కదులుతూనే ఉన్నాం. మారుతూనే వస్తున్నాం.

"ఒకప్పుడు శవాలని కట్టెలతో కాల్చేవారు. అన్నట్లు ఇక్కడ మన భారతీయ నాగరికత గురించి ఘనమైన విషయం ఒకటి చెప్పాలనిపిస్తుంది. మనకెప్పుడూ ఫారిన్ అంటే గొప్ప. స్మగుల్డ్ అని కానీ... ఇంపోర్టెడ్ అని కానీ చెబితే ఆ సరుకుమీద విపరీతమయిన విశ్వాసంతోను, పిచ్చితోనూ, ముందు వెనుకలూ, మంచిచెడ్డలూ చూడకుండా కొనేస్తాం. గర్వపడిపోతాం. అందుకే మన విదేశీ బలహీనతను సొమ్ముచేసుకుందుకే భారతదేశంలోనే బోలెడన్ని మేడిన్ జపాన్‌లూ, మేడిన్ అమెరికాలూను.

"అదలా ఉంచండి... నాగరికత విషయంలో ఒకప్పుడు మనమే పాశ్చాత్యులకంటెముందుండే వాళ్లం. వాళ్లకి శవాలని పాతిపెట్టడం తప్ప మరో విధం తెలియని రోజుల్లోనే మనదేశంలో శవదహనం సాధారణమైపోయింది. వాళ్లు ఉక్రోషంతో శవాన్ని ఖననం చెయ్యడమా? దహనం చెయ్యడమా? ఏది మంచిది? అనే అంశం మీద పరిశోధనలు చేసి చివరకు విధిలేక మన పద్ధతిని చచ్చినట్లొప్పుకున్నారు. శాస్త్రీయంగా కూడా ఖననంకంటే శవదహనమే మంచిదన్నారు. అంటే మనదేశమే ముందున్నదనేగా?

"ఆర్థికంగా కూడా దహనమే ఎంచుకోదగినది. పాశ్చాత్యులు శవానికి పేటికను తయారుచేయిస్తారు. ఈ శవపేటిక (కాఫిన్) కయ్యే ఖర్చు శవదహనానికి పట్టే కట్టెల ఖర్చుకన్నా తక్కువే, పైగా ముల్లును ముల్లుతోనే తీయాలనే పూర్వోక్తిని గౌరవించినట్లూ ఉంటుంది... కట్టెను (శవాన్ని) కట్టె (కర్ర)లతోనే కాలిస్తే. అంతేకాదు ఒక శవాన్ని ఖననం చేసిన చోట మరో శవాన్ని ఖననం చేయడం వీలుపడదు పక్కగా తప్ప. అదే దహనమయితే అదే స్థలంలో

ఒకదాని వెంట మరొకటిగా ఎన్ని శవాలన యినా కాల్చొచ్చు స్థలం కూడా ఖరీదయిపో యిన కరువు రోజులుకదా ఇవి.

"మరో విషయంలో కూడా మనం విదేశీ యుల కంటే గొప్పవాళ్లం. మనకి గంగానది ఉంది. విదేశీయుల చిన్నచూపువలన మన గంగను సెవెన్ వండర్స్ ఆఫ్ ద వరల్డ్ లో చేర్చలేదుగానీ గంగ అంత ఘనమైనదే. తాజ్ మహల్ నో పీసాటవర్ నో అయితే ఏ దేశంలో అయినా కట్టొచ్చు గట్టిగా పూను కుంటే. కానీ గంగ ప్రకృతి ప్రసాదం. దానిని భారత దేశంనుంచి ఎవరూ ఎత్తుకు పోనూ లేరు, మరోచోట నిర్మించుకోనూ లేరు.

"గంగానది పవిత్రమైనది మాత్రమేకాదు. విచిత్రమయినది, విశేష గుణసంపన్నమయి నది కూడా. కాశీకి వందమైళ్ల పరిధిలో ఎవరు చనిపోయినా ఆ శవాన్ని కాశీకే తెచ్చి గంగలో తోసేస్తారు. అదే శవ సంస్కారం. పూలుకప్పిన శవాన్ని తెప్ప మీద వేసి 'రామ్‌నామ్ సత్యహై' అని పాడుతూ పడవ నీటిమధ్యకు చేరాక శవాన్ని తోసేసి చేతులు కడుక్కు వచ్చే స్తారు. ఇలా నిత్యం పదుల సంఖ్యలో గంగానదిలో శవాలు పడుతున్నా గంగ నీరు ఏమాత్రమూ చెడదు. కంపుకొట్టదు. స్వచ్ఛంగానే ఉంటుంది. ఇదొక విచిత్రం.

"కాగా గంగానది విశేషాలింకా ఉన్నాయి. ఏ నీరయినా నిలవ ఉంచితే కొంచెం రోజు లకే కుళ్లి కంపుకొడుతుంది. కానీ గంగనీరు పాత్రలలోతీసి సీలుచేసి ఎన్ని సంవత్సరాల తరువాత వాడినా తాజాగానే ఉంటుంది. అందుకే కాశీలో గంగ చెంబులు పెద్ద వ్యాపారం కాగలిగాయి. ఇత్తడి చెంబుల లోనో సీసాలలోనో గంగనీరుపట్టి సీలువేసి అమ్ముతుంటారు. సీలు తీశాక కూడా చాలా కాలం స్వచ్ఛంగా ఉంటుందా గంగ. దక్షిణ దేశంలోని వారెందరో చనిపోయేవారి నోట్లో తులసిదళం వేసిన గంగపోస్తారు.

"ఇంకో విశేషమేమిటంటే మిగిలిన నీళ్లలో మనవేపు నదుల నీళ్లల్లో తలవెంట్రుకలు తేలతాయి తప్ప ఎంతమాత్రమూ మున గవు. కాని గంగ నీటిలో పువ్వులూ తల వెంట్రుకలూ కలిపివేస్తే పువ్వులేమో తేలిపో తాయి. కేశాలేమో మునిగిపోతాయి.

"ఇన్ని విశేషాలుండబట్టే గంగానది విదేశీ యుల నాకర్షించింది. వారు దానిమీద పరి శోధనలు చేశారుకానీ గంగనీటి ప్రత్యేకతకు ఇదమిద్ధమని కారణం తేల్చలేకపోయారు. హిమాలయాలమీంచి, అడవులలోంచీ వొస్తుంది కనుక ఔషధులు కలిసి ఈ గంగానది నీటికి విశేష గుణాలబ్బి ఉండవ చ్చుననేశారింకేమీ చెప్పలేక. శవాలని కూడా సంస్కరించగల ప్రపంచంలోని ఏకైక నది గంగానది మనదే! దీనిని మించిన ప్రపంచ వింత ఇంకేముంటుంది?

"అంతమాత్రాన కాశీ పరిసరాలలో అన్ని శవాలనూ గంగలోనే తోసేస్తారని కాదు. అనాథ ప్రేతాలకూ, అట్టే ఖర్చు భరించలేని వారికీ మాత్రమే గంగ తల్లి కనపడుతుంది, సులభంగా శవాన్ని వదుల్చుకుందుకు. ఆమాత్రం ఈమాత్రం కలవారు, వారి తాలూకు వారి శవాలని దహనమే చేస్తారు కాశీకి తీసుకువొచ్చి! చుట్టుపక్కల వూళ్ల శవాలు కూడా కాశీకే తీసుకు రావడానికి మరో కారణం గంగ వద్దునే ఉన్న ఘాట్ లు. రేవుల లాంటివి. వాటిలో హరి శ్చంద్ర ఘాట్ ప్రత్యేకమైనది. నిజానికిది శ్మశానం. ఎప్పుడూ అక్కడ శవదహనం జరుగుతూనే ఉంటుంది. ఏ నిమిషంలో అయినా ఏదో ఒక శవం కాలుతూనే ఉంటుంది. అక్కడ చితి ఆరడమనేదే ఉండదు. ఆ హరిశ్చంద్ర ఘాట్ లో చితి మండుతూండగా శవం నుంచి వచ్చే ధూమం విశ్వనాధుడికి సోకుతూంటుందట. ఆ ధూమం కాశీ విశ్వనాధుడికి అత్యంత ప్రీతిపాత్రమట. ఆ హరిశ్చంద్రఘాట్ లో




చితి ఆరినా ధూమం ఎగసి విశ్వనాధుడికి సోకకపోయినా ఆ క్షణంలో ప్రళయమేనంటారు. ప్రపంచానికది అంతమేనంటారు. అందుచేత హరిశ్చంద్ర ఘాట్‌లో అర్ధరాత్రీ అపరాహ్నమూ అని లేకుండా నిరంతరమూ, అనుక్షణమూ నిరవధికంగా శవదహనం సాగుతూనే ఉంటుంది. విశ్వాసాలు విశేషశక్తివంతాలు కదా?

"గంగాజలంతో అభిషేకమూ, హరిశ్చంద్ర ఘాట్ నుంచి శవధూమమూ ఇదే విశ్వనాధుడికి ప్రపంచంపట్ల అనుగ్రహానికి కారణాలని ప్రజల నమ్మకం. హరిశ్చంద్ర మహారాజు కాటికాపరిగా చేసినదిక్కడేనేమో! అందుకే దీనికాపేరు వచ్చిందేమో పరిశోధకుల బాధ్యత తవ్వితీయడం. హరిశ్చంద్ర ఘాట్... దశాశ్వమేధ ఘాట్‌లు గంగవొడ్డున ఉండే అనేక ఘాట్‌లలో ప్రసిద్ధమైనవి.

"సోది చెపుతున్నానని విసుక్కుంటున్నారా? పోన్లెండి... మనందరికీ ఎంతో ఇష్టమైన ఓ సంగీత విశేషం గురించి గుర్తు చేస్తాను. కాశీ అంటే సంస్కృతమూ సంగీతమూకదా? బెనారస్‌లో సుప్రసిద్ధ సరోద్ వాద్యవిద్వాంసుడు ఉస్తాద్ అలీఖాన్ పేరు విననివారుండరు. ఆ సంగీత విద్వాంసుడు, ఆ మహానుభావుడు కాశీలోనే... గంగవొడ్డునే ఉండేవారు. గంగంటే నేను ఇంతగా పొంగిపోడానికి ఒకటీ రెండూకావు... ఎన్ని కారణాలో! సామాన్యురాలినైన నేనేకాదు మహామహా వారికి కూడా గంగంటే ఎంత ఇష్టమో. అందుకే కద గంగ ఒడ్డునే ఎందరో రాజులు భవనాలు కట్టించుకున్నారు. ఇప్పుడు అవి శిథిలాలయి మిగిలాయి. అది వేరే విషయమనుకోండి. ఆ సంగీత కళానిధి నివాసం, గాననిలయం గంగ ఒడ్డునే. దానిలో వారు తాము సంగీత సాధన చేయడమేకాక శిష్యులకీ సంగీతం నేర్పేవారు. అటు గంగ... ఇటు రసగంగ. ఆయన తరచుగా గంగాతీరాన తమ సంగీత ఝురులను ప్రవహింపజేసేవారు.

"ఒకసారి... అమెరికానుంచి ఒక బృందం వచ్చింది. సంగీత ప్రియులు వారందరూ. తాజ్‌మహలు చూశాక ఉస్తాద్ అలీఖాన్‌వద్దకు వచ్చారు, దర్శనమూ వారి సంగీత శ్రవణమూ చేసుకుని తరించి పోదామని. వీరు అనుగ్రహించారు. కచేరి చేశారు. ఆ సంగీతానికి ఆ విదేశీయులెంత మురిసి ముగ్ధులైపోయారంటే గాన తుంబురులు కచేరీ ఆపిన అనంతరం వారి పాదాలకు ప్రణమిల్లి "మూర్తీభవించిన అద్భుత సంగీతమా! మేము అసలు సిసలయిన సంగీతాన్ని వినగలిగాం. సంగీతం రూపుదాల్చితే ఎలా ఉంటుందో కళ్లారా చూడగలిగాం. మా అంత అదృష్టవంతులింకెవరూ ఉండరు. మా జన్మ ధన్యమయింది. మహానుభావా! మీరు మా దేశం వచ్చి మా వారికి సంగీతమంటే ఏమిటో ఎరుకజెప్పరూ? మీరు శాశ్వతంగా మా దేశంలో నివాసం ఉండిపొండి. మీకక్కడ మీరు మెచ్చే భవనం నిర్మించియిస్తాం. కావలసినంత ధనమిస్తాం" అని ప్రార్థించారు.

"ఆయన మందహాసం చిందించారు. "చూశారుగా ఇక్కడ నాకెంత పటాలముందో! ఈ శిష్యుల్నెలా వదిలి రాగలను" అన్నారు అలా వెళ్లడం ఏమాత్రం ఇష్టంలేని గాన గంధర్వుడు.

"మీతోపాటే మీ శిష్యులకీ సకల సదుపాయాలూ కల్పిస్తాం. ఎంత ఖర్చయినా ఫరవాలేదు. మీవంటి కళాకారులుంటే మా దేశానికెంత గర్వ కారణమని! మీరేంకోరితే అవన్నీ అమెరికాలో ఏర్పరచుతాం" అని వాగ్దానం చేశారా విదేశీబృందం.

"అప్పుడాయన మళ్లీ చిరునవ్వు చిందిస్తూ "నాకు భోగభాగ్యాలూ వద్దు, సిరిసంపదలూ వద్దు. కొంచెం సంగీతమూ, గంగా ఉంటే చాలు. గంగానదిని కూడా తీసుకు రాగల

మంటే ప్రపంచంలో ఎక్కడుండడానికైనా నాకభ్యంతరముండదు" అన్నారు మాతృ దేశం వదిలి వెళ్లడానికెంత మాత్రమూ ఇష్టంలేని బిస్మిల్లాఖాన్!

"అంతటి సంగీత విద్వాంసులనే అలా ఆకట్టుకోగలిగిన గంగ మనదేశంలో ప్రవహించడం ఎంత అదృష్టం! ఆ గంగలో శవ సంస్కారం పొందిన వారెంత ధన్యజీవులు!

"ఇదేమిటి... మాటిమాటికీ శవాలూ... సంస్కారాలూ... శ్మశానాలూ.. అంటుందీ విడ? అనుకుంటున్నారా?

"ఏంచేసేది? ఏ గూటి చిలక ఆ గూటి పలుకే పలకగలదు. అలాగే పలుకుతుంది. కాటికాపరులు శ్మశానాల గురించికాక మరేం చెప్పగలరూ! కాటిచిలుక కాటిపలుకులే కదా పలుక గలిగేది?

"అన్నట్లు... సరయిన మాట స్మశానమా? 'శ్మ'శానమా? "

"అది పండితులే తేల్చి చెప్పాలి. నాకు మాత్రం శ్మశానమే సరయిన రూపమనిపిస్తుంది. నొక్కివక్కాణించడం కోసం ఉద్దేశం అనే సాధురూపాన్ని కొందరు ఉద్దేశ్యంగా మార్చుస్తున్నట్లే శ్మశానాన్ని స్మశానంచేసి ఉంటారేమో అని నా అనుమానం. పోన్లెండి గుల్ాబిని గులాబి అన్నా, రోజ్ అన్నా, గులాబ్ అన్నా అది అదే కాని మరేదో అవదుగదా! అలాగే స్మశానమన్నా, శ్మశానమన్నా, వల్లకాడన్నా, కాడన్నా, మరుభూమన్నా, పితృవనమన్నా...

"సరేగానీ, కాటికాపరికి కథేమిటి? కట్టెను కాల్చేవాళ్లకి కూడా కథలేనా? అని తేలిగ్గా చూడమాకండి.

"మాకూ ఉంటాయి కథలు!

"ఆ మాటకొస్తే మా వ్యధలే నిజమైన కథలూ గాథలూ అనిపించుకోగలవేమో. ఒక సహృదయుడు ఏమన్నాడు? 'ప్రతి మనిషీ ఒక హామ్లెట్ రాయగలడు. అది షేక్స్పియర్ రాసిన హామ్లెట్‌లా ఉండకపోయినా' అనలేదూ? చెప్పడానికి విషయం ఉండాలి. అది కొత్తగా ఉండాలి. అంతే తప్ప ఎవరు చెబితే ఏం? ఎలా చెబితే ఏం? భావం మనసుకి హత్తుకునేటట్లు చేయడానికే కద భాష, శైలి, శిల్పం, పాత్ర చిత్రణ వగైరా హంగులూ? ప్రాణంలాంటి భావం, విషయం ఉంటే మిగిలిన అలంకారాలెలా ఉన్నా పెద్ద ప్రమాదమేమీ ఉత్పన్నమవదని నా ఉద్దేశం. పాటకి పల్లవి ప్రాణమవునోకాదో కాని కథకి మాత్రం విషయమే ప్రాణమని నా విశ్వాసం. అది పుష్కలంగా ఉందన్న విశ్వాసంతోనే నా కథ చెపుతాను" అని, ఆగి ఊపిరి పీల్చుకుని తన కథను చెప్పనారంభించింది.

★ ★ ★

ఇల్లు చూసి ఇల్లాలిని చూడమని సామెత.

అందులో చాలా సత్యమూ ఉంది. అర్థమూ ఉంది.

మనిషి చరించే పరిసరాలు ఆ మనిషి గురించి చాలా విషయాలే చెప్పగలవు. కాకపోతే వాటివి మూగ భాషలు.

అందుకే నా గురించి నేను పరిచయం చేసుకునే ముందు నా పరిసరాలను పరిచయం చేస్తాను. కొంతమేరకు ఇదివరకే చెప్పానుకదా?

నా కార్యాలయం పేరు శ్మశానం.

స్థలం సమస్యకాని చిన్న ఊళ్లలో అయితే ఇది విశాలంగా ఉంటుంది. పెద్ద పట్నాలలో అయితే చిన్నదిగా ఉంటుంది. మరీ పల్లెలలో అయితే ప్రత్యేకంగా శ్మశానమంటూ ఉండదు. ఏటిగట్టు... బంజరు బీడు... ఊరి చివర అలాటి చోట్ల శవాల్ని కాల్చేస్తారంతే.





పెద్ద సిటీల్లో అయితే ఫోన్ చేస్తే శవాల్ని తీసుకెళ్లేందుకు అంబులెన్స్ వస్తుంది. శవాన్ని విద్యుద్దహనం చేయగా మిగిలిన బూడిదను చితాభస్మంగా ప్లాస్టిక్ కవరులో వేసి పంపిస్తారు, ఆ శవం తాలూకు యజ మానుల ఇంటికే.

మహా నగరాలలో శవదహనం మేడీజీ యేగానీ దీనిలో ఓ చిన్న చిక్కుంది. విద్యు చ్ఛక్తికి సంప్రదాయం, ఆచార వ్యవహారాల పట్ల విచక్షణ ఉండదు. తనకి తగిలిన దాన్ని తగలెట్టడమే. భస్మం చేసేయడమే. అంచేత శవాన్ని ఎముకలు మిగిలేలా సున్ని తంగా కాల్చదు. మొత్తం అంతా బుగ్గి బూడిదా చేసేసి తప్ప ఊరుకోదు.

మరి అస్తినిమజ్జనం ఎలా? అలాటివి పట్టించుకునే సంప్రదాయవాదులుంటారు కదా? వారి మాటేమిటి? అందుకని విద్యు ద్దహన వాటికతోపాటే పేరుకి ఓ మామూలు శ్మశానమూ ఉంచుతారు.

మనదేశంలోకి ఇంకా యంత్రాలన్నీ వచ్చే యలేదుగా? గ్రైండర్లున్నా మనం కొన్ని పచ్చళ్లు రాతి రుబ్బురోలులోనే రుబ్బుతాం... గ్రైయిండర్‌లో అయితే రుచి సరిగా రాదని.

ఎలక్ట్రిక్ ఓవెన్‌లో తయారయిన అన్నం కంటే పొయ్యిమీద ఉడికిన అన్నమే మనకి రుచి.

అప్పడాలు గ్యాస్‌స్టవ్ ఉన్నా కుంపటి మీదే కాలుస్తాం. సిటీల్లో కూడా ఒక కాలు ఆధునికతలోనూ మరో కాలు సంప్రదాయం లోనూ ఉంచే ఇలాటి వాళ్లుంటారు. అదుగో అలాటి వాళ్ల కోసమే కట్టెలతో కట్టెను కాల్చే శ్మశానాలు. అవిలేకపోతే అలాటి వాళ్లు ప్రభుత్వాన్ని దుయ్యబడతారు. ఉద్యమి స్తారు. ప్రభుత్వాలకేమో ఓట్ల భయం. అందుచేత ఇలాటి శ్మశానాలనీ నిర్వహిస్తుం టాయవి. విద్యుచ్ఛక్తి చవక అని కాదుకానీ ఎలా చూసినా కట్టెలకంటె విద్యుచ్ఛక్తి విలువే తక్కువ. చెట్లు ప్రకృతివలన పెరి గేవి. వాటిని నిముషంలో నరికెయ్యగలమే కాని కావలసినంత సరుకూ తొందర తొంద, రగా పెంచగలగడం మాత్రం మనిషి అధీ నంలోలేదు. కాలంమీద ఆధారపడవల సిందే. అడవులు నరికేసి వాతావరణ కాలుష్యం పెంచేస్తున్నారు. వర్షపాతం తగ్గి పోతుంది. ఉష్ణోగ్రత ఉద్ధృతమైపోతుంది.

ఒకపక్క వృక్షసంపద అలా నాశనమౌ తుంటే మరోపక్క శవాలని కాల్చడానికి కూడా కట్టెలే అయితే ఎలా? విద్యుచ్ఛక్త యితే మనిషి ఉత్పత్తి చేయగలిగినదే. ఈ దేశంలో వన మహోత్సవాల పేరిట కోట్ల కొద్దీ రూపాయలు ఖర్చుపెడతాం. కాని శవాలను దహనంచేయడానికి మాత్రం ప్రత్యామ్నాయం ఉన్నా కట్టెలేవాడతాం! భోగిపండగ పేరిట కట్టెలు తగలేసు కుంటాం! మన వివేకమూ సామాజిక స్పృహా ఈపాటివి.

మా శ్మశానంలో ఒక మర్రి చెట్టుంది. ఊడలు దింపుకున్న ఆ చెట్టు చాలా పెద్దది. దానిని మొట్టమొదట చూసినప్పుడు నాకు చందమామ పత్రికలోని 'మంత్రాల మర్రి' సీరియలూ.. దానికి వేసిన బొమ్మా జ్ఞాపకం వచ్చాయి. భేతాళుడి కథలలో విక్ర మార్కుడి మౌనం భంగపడగానే అతని భుజంమీది శవం వెళ్లి మళ్లీ మర్రిచెట్టుకి వేలాడుతుందే సరిగ్గా ఆ మర్రి చెట్టులాగే ఉంది యిదీను అనిపించింది, ఈ మర్రి చెట్టుని మొదట చూసినప్పుడు. ఒక మూలగా నుయ్యి, నూతి చుట్టూ చెప్టా. నూతికొక గిలక. శవాలను దహనం చేసేం దుకు తెచ్చిన వాహకులూ, శవం బంధు వులూ అక్కడ ఆ నూతి దగ్గరే స్నానాలు చేసి వెళ్లిపోతారు.

మరొకవేపు చిన్న షెడ్. నిజానికి అదే నా కార్యాలయం. దాంట్లో ఒక బల్ల. దాని మీద రిజిష్టరు. శవం వివరాలు నేనా పుస్త

కంలో రాస్తాను. అది నా డ్యూటీ. తరువాత ఈ రిజిస్టరునిబట్టే మునిసిపల్ ఆఫీసులో డెత్ ఎక్స్ట్రాక్ట్లు తీసి ఇస్తారు.

మా వూరి మునిపాలిటీ పేదది. అయినా ప్రజలేముందుకొచ్చి చందాలు వేసుకుని వర్షాకాలంలో కూడా శవం నిరాటంకంగా దహనమయ్యేందుకు వర్షంనుంచి రక్షణగా రేకుల గొడుగు లాంటి షెడ్డు వేసి మరో చితిని కూడా ఏర్పరిచారు. వర్షం వస్తున్నా, రాబోతున్నా శవానికి చితిని ఆ షెడ్కిందే ఏర్పాటు చేస్తారు.

ఒకవేపు పూలు పూయని ముళ్ల చెట్టు. దాని పేరేమిటో నాకు తెలియదు. తొలిసారి దానిని చూసినప్పుడు కొందరు మనుషల్లా ఎంత నిష్ప్రయోజనకరం ఈ ముళ్ల చెట్టు! అనిపించింది. చిత్రమేమిటంటే దానికి పూజలు! ఔను ఒకవిధంగా అవీ పూజలే. శవంమీద పూలదండలూ, కొత్త గుడ్డలూ వేస్తారు ఇక్కడికి తెచ్చే ముందు. కానీ పోయే క్షణాన వెంబడిరా (కూడ)దు పూచిక పుల్లయినా. మనిషి చితిమీద నగ్నంగా నిదురించవలసిందే. పుట్టినప్పుడెలాగో అలాగే సహజంగా ఉండవలసిందే.

అంచేత ఆ పూలమాలలూ అవీ తీసి పారేస్తూ ఆ పూలమాలల్ని ఈ ముళ్లమొక్క మీదకే విసురుతారు... చితికి చేరువలో ఉందని. అంచేత దీనినిండా ఎప్పుడూ పూల మాలలే. తాజావో, ఎండినవో... పరాకుగా చూస్తే ఇదేమిటీ ఈ చెట్టు పూలని కాక ఏకంగా దండలనే పూచిందేమిటి అనిపి స్తుంది.

కొంచెం అవతల తులసి కోటలు. అదే సమాధులు.. కొందరు వీటినే గోరీలని కూడా అంటారనుకుంటాను. ఆ తులసి కోటలలో చాలావరకూ శిథిలమైపోతున్నవే. చచ్చిపోయిన మనిషి గురించి, అతని తులసి కోట గురించి ఎన్నాళ్లని పట్టించు కుంటారెవరయినా? బతుకుతున్న మనుష లకి చావడానికే టైము లేనంత బిజీగా ఉంటూంటే చచ్చిన మనుషుల గురించి పట్టించుకుందుకు కూడా తీరికెక్కడ చస్తుంది? కనుక ఆ కూలిన తులసికోటల గతి అంతే.

ఇవన్నీ ప్రహారీగోడ లోపలి దృశ్యాలు.

అన్నట్లు మా కార్యాలయానికి కాంపౌం డుంది. ఆ గోడ ఇటుకలు బయటపడి గాయాలు తగిలి రక్తం చిమ్ముతున్నట్లు అక్కడక్కడ ఎర్రెర్రగా ఉంటుంది. ఆ గోడ కొక కర్రగేటు. అదీ ముసిలిదైపోయింది. అక్కడక్కడ కర్రలూడిపోయి నామమాత్రం గానే మిగిలివుంది. మిగిలిన నాలుగు కర్రలూ కూడా నేడో రేపో ఓ శుభరాత్రి ఎవరో ఒకరు పట్టుకుపోయి పొయ్యిలో పెట్టుకుంటారు. పిట్టని కొట్టి, పొయ్యిలో పెట్టి అనే బాపతు మనుషులేకదా మనదే శంలో చాలామంది?

పేదరికానికి మంచి చెడులూ స్వపరభే దాలూ ఏముంటాయి?

నవ్వొచ్చే సంగతేమిటంటే ఆ విరిగిన గేటుకి కూడా ఒక తాళం కప్పు! గుర్రం గుడ్డిదైనా దాణా తప్పదనే సామెత ఎంత నిజమో తెలుపుతున్నట్లుగా!

ఆ గేటుకీ ప్రహారీకీ అవతల ఎత్తయిన గట్టు. ఆ గట్టుకి ఇటు శ్మశానం. అటు శారద.

శారద అంటే అమ్మాయనుకునేరు? ఊహుం నది. వర్షాకాలంలోనే అది ఏరు. మిగిలిన కాలాల్లో ఇసుకపర్ర. అయినా దాని పేరు శారదా నదే!

మా ఇంటిని అదే... మా కార్యాలయాన్ని పరిచయం చేశానుగా. ఇక నన్ను నేను పరి చయం చేసుకుంటాను.

నా పేరు శివాని.

నేను స్త్రీని.

నా వయస్సిరవై ఎనిమిది.

ఈ కార్యాలయంలో ఉండేది నేనొక్కతినే.

నా ఉద్యోగం కాటికాపరి.

వ్యాకరణ దోషముంటే క్షమించండి. 'కాపరి' అనేది ఉభయలింగమో కాదో నాకు తెలియదు. 'కాపరిణి' అనేమాట ఉచ్చారణకి బాగుండదనిపించి కాపరి అని వాడేస్తు న్నాను.

మీకు ఆశ్చర్యంగా ఉందా, ఆడదేమిటి, కాటి కాపరేమిటి? అని.

ఔనా? ఆడదాన్నయిన నన్ను కాటికాప రిని చేసిన పరిస్థితులు నిజంగా ఆశ్చర్యకర మైనవే.

మా అమ్మా నాన్నలది ప్రేమ వివాహమ నుకుంటాను. బహుశా వారిది విప్లవవి వాహం కూడా అయివుండవచ్చు అంటే- వర్ణాంతరమో అలాటిదన్నమాట.

ఇలాగని వాళ్ళు నాతో చెప్పకపోయినా అటు అమ్మ తరపున కాని, ఇటు నాన్న తర పున కాని చుట్టాలెవరూ మా ఇంటికెప్పుడూ రాకపోవడంతో నాకే అలాంటి అనుమానం కలిగింది. వాళ్లకి చెప్పుకోదగ్గ స్నేహితులు




కూడా లేరు. ఎందుకంటే మా ఇంటికి అలా టివాళ్లు కూడా వచ్చేవారు కాదు.

వచ్చేపోయేవారు లేక మా ఇల్లు నిశ్శబ్దంగా, నీరసంగా, ఒంటరిగా ఉండేది.

మా నాన్న లారీడ్రయివరైనా బాగానే సంపాదించేవాడు. ఆయన తాగేవాడు కానీ మేమేమీ ఆర్థిక ఇబ్బందులు మాత్రం పడేవాళ్ళం కాము. తిండికీ బట్టకీ లోటు పడడం నాకు తెలియదు.

నాన్నది భారీ విగ్రహం. లారీ నడపడం వల్లేమో మోటుగా కనిపించేవాడు. అమ్మ పెద్ద అందగత్తేమీ కాదుగానీ తెలివైనదను కుంటాను.

ఇవి ఎందుకు చెబుతున్నానంటే నాకు మా అమ్మ పోలికలే వచ్చాయనేవారు నాన్న. అంటే ఇదంతా నాకు తెలివితేటలూ, అందమూ కూడా మోతాదులోనే ఉన్నాయని చెప్పడానికే.

నాన్నకి నేనంటే చాలా ముద్దు. ఆయన లైనుమీదకి వెళ్ళాడంటే ఒక్కొక్కప్పుడు వారంరోజులు కూడా పట్టేది తిరిగి వచ్చేసరికి. ఆయన ఎప్పుడొచ్చినా సరే వట్టి చేతులతో మాత్రం వచ్చేవారు కారు.

మిఠాయో... బొమ్మలో... బట్టలో ఏదో ఒకటి తెచ్చి అర్ధరాత్రయి నేను నిద్రలో ఉన్నాసరే లేపి కూర్చోబెట్టి అవి నాకిచ్చి నన్ను ముద్దు పెట్టుకుని నవ్వేవారు.

నాన్న లారీమీద ఊళ్లు పట్టి తిరిగినా ఆయన లేనంతమాత్రాన ఇంటి నిర్వహణకేమీ లోటు కలగకుండా అన్నిపనులూ చక్కబెట్టేది అమ్మ. మగవారిలాగే బజారుపనులూ అవీ నిర్వహించేది. తనతోపాటు నన్నూ వెంటబెట్టుకెళ్లేది, బయటకు వెళ్ళినప్పుడల్లా.

అలాగ నాకు చిన్నప్పటినుంచే ప్రపంచం అలవాటవడం మొదలయింది. ఎందుకనో నన్ను బడిలో వెయ్యలేదు. అమ్మ ఇంటి దగ్గరే నాకు చదవడమూ వ్రాయడమూ నేర్పింది. ఆవిడకు ఇంగ్లీషు కూడా వచ్చునని తెలిసి ఎంత ఆశ్చర్యపడ్డానో "అమ్మా! నువ్వేం చదువుకున్నావ్?" అని నేను అడిగితే ఇంటర్ చదువుకున్నానని చెప్పింది.

నాకు మాత్రం బడికెళ్ళాలనుండేది అందరు పిల్లలలాగ. నాన్ననడిగాను కూడా. "నేను బడికి వెళ్ళొద్దా?" అని.

ఆయన నవ్వేసి "ఎందుకమ్మా అనవసరపు యాతన. ఆడపిల్లవి సుఖంగా ఇంటిపట్టునుండక చదువు పేరిట శ్రమపడడమెందుకు? ఎలాగూ పెళ్ళి చేసుకుని ఇల్లు చూసుకోవలసినదానివే తప్ప ఉద్యోగం చేసి ఊళ్లేలవలసినదానివి కావు. పెళ్ళయ్యేవరకూ హాయిగా ఉండు" అనేశాడు.

ఆయన మాటలు వింటున్న అమ్మ నా పక్షం వహించి ఏమీ అనకపోవడం నాకు ఆశ్చర్యాన్ని బాధనీ, కూడా కలిగించింది.

"సంసారం చేసుకుందుకవసరమయ్యే పాటి చదువు నీకు మీ అమ్మే చెప్పగలదు. అంతకంటే ఎక్కువ ఏ బడిలోనూ చెప్పరు" అన్న నాన్న మాటలలోని పొగడ్తకి అమ్మ పొంగి బోర్లాపడిపోయిందా?

అలాటి అమాయకురాలు కాదే.

అసలు అమ్మా నాన్నల దాంపత్యపుతీరే ఓ వింతా విచిత్రమూను.

అమ్మ మాంసాహారి. నాన్న శాకాహారి.

ఒకసారి నేను నాకొచ్చిన సందేహం తీర్చుకుందామని "అమ్మా! నువ్వు మాంసాహారం మానేయొచ్చుగా నాన్న కోసమయినా? మాంసం వండడం ఒక శ్రమ. పైగా ఆరోగ్యం కూడా కాదట" అని అడిగాను.

అందులో స్వార్థం కొంచెం లేకపోలేదు. పచ్చిమాంసం చూడడానికి బాగుండదు నాకు. ఎర్రగా అదోలా అనిపిస్తుంది. ఇక చేపలున్నాయ్. అవయితే పచ్చివీ కంపే.

వండుతూంటేనూ చుట్టుపక్కలంతా గుప్పుమంటూ భరించ శక్యంకాని వాసనే.

ఆ వాసన నాకెంత అయిష్టమంటే ఎందరో ఎంతగానో మెచ్చుకుంటూ, లొట్టలేసుకుంటూ తినే చేపల పులుసు నేను తినలేను. ఆ వాసనే మనసులో మెదులుతూండేది.

కోడిగుడ్లు అయితే ఉడికాక, పెంకుతీశాక మాత్రం నాకు చాలా ఇష్టం. అప్పుడది చూడడానికి కోహినూరు వజ్రంలాగే కనిపిస్తుంది నా కంటికి. నిజం నాకెందుకో కోడిగుడ్డు కోహినూర్ వజ్రంలా అనిపిస్తూ అలా చూస్తూ ఉండిపోతాను.

"ఉడికేటప్పుడు వాసన మాంసాహారానికే కాదు. కాబేజీ, పొట్ల లాటి కూరగాయలకీ వస్తుంది. బీట్‌రూట్ తరిగాక రక్తం వోడుతున్నట్లుండదూ?

ఆరోగ్యం విషయానికొస్తే తినేదేదయినా ఆరోగ్యమే. ఏదయినా అనారోగ్యమే.

"నేను మాంసమెందుకు మానేయాలి? కావాలంటే నువ్వూ తిను. మీ నాన్నని తినమను" అనేసేది, అమ్మ!

ఏమిటో వాళ్ళిద్దరూ ఉత్తర దక్షిణ ధ్రువాల్లా ఉండడం బాగులేదనిపించి నాన్న నడిగాను. "నాన్నా! నువ్వు మాంసం తినొచ్చుగా అమ్మలాగే? " అని.

"నాకిష్టముండదమ్మా. చూడడానికే మనస్కరించదు. మాంసం తింటే నాలుకా, మెదడూ మొద్దుబారిపోతాయి. మనిషికి బండతనమొచ్చేస్తుంది. అందుకే దానిని కొందరు నీచు అంటారు. నీచంటే నీచమైనదని"

నాకు నవ్వొచ్చింది.

లేలాండ్ లాంటి భారీ లారీ నాన్న నడిపేది. ఆ లారీలాగే భారీ విగ్రహం నాన్నది. లారీల మనిషి కావడంవల్ల కాబోలు మనిషీ, మాటా కూడా మోటుగా అనిపిస్తాయి. అయితే ఆయనలో ఆశ్చర్యకరమైన వైరుధ్యాలున్నాయి.

అప్పుడప్పుడు ఆయన ఇంట్లోనే తాగుతాడని చెప్పానుకదూ? ఆ తాగడం ఒక తమాషా. పైవాళ్ళకి ప్రహసనమే అనిపిస్తుంది.

ముందుగా స్నానం చేస్తారు. ఇస్త్రీ పంచె కట్టుకుంటారు. నుదుటికి విబూదిరేకలూ, బొట్టూ పెట్టుకుంటారు. తాను కూర్చునే చోట శివుడి బొమ్మ పెట్టుకుంటారు.

మా ఇంటినిండా శివుడి బొమ్మలూ విగ్రహాలే. నాన్న శివభక్తులు. అందుకే ఏమో నా పేరు శివాని అని పెట్టారు.

గ్లాసులో విస్కీ పోసేముందు శివుడికి దణ్ణం పెట్టి సీసాను నైవేద్యం పెట్టినట్లు శివుడికి చూపుతారు. విస్కీ, తప్పితే రమ్... మరోటి ఏదీ తాగరు. రమ్‌లో నీళ్ళు పోసుకుని ఐసు వేసుకున్నాక మళ్ళీ దణ్ణం పెడతారు శివుడికి. ఆ రమ్‌తోనే పరేషం (పరిషం అంటారు వాడుకలో. భోజనం చేసేముందు చేతిలో నీళ్ళు వేసుకుని విస్తరి చుట్టూ చిలకరించి కొంచెం ఆ నీళ్ళు తాగుతారుగా? అదీ) పట్టి అప్పుడు మామూలుగా తీసుకుని ఇహ రంగంలోకి దూకుతారు.

తాగుడుని కొందరు వేళాకోళంగా 'పూజ' అనే నిక్‌నేమ్‌తో ఉదహరిస్తారట. మా నాన్న విషయంలో మధుపానం నిజంగా పూజలాగే ఉంటుంది.

కొంత తాగాక శివుడి ఫొటోలకి నమస్కారాలు చేస్తాడు. చెంపలు వేసుకుంటాడు.

"క్షమించు శివా! ప్లీజ్..." అని వేడుకుంటాడు.

ఆయన శివభక్తి అచంచలం.

మనవాళ్ళు చాలామంది కొత్త హీరోలు కాని, హీరోయిన్‌లు కాని వచ్చేసరికి అంతవరకూ అభిమానించిన వారిని మార్చేసుకుని సినీప్రేక్షకులు కొత్తవారిని అభిమానులుగా





చేసేసుకుంటారు.

సినీప్రేక్షకులే కాదు, భక్తులు కూడా కొత్త బాబాలు వెలిసేసరికి పాత అభిమానాలు చెరిపేసుకుని కొత్త బాబాని పట్టుకుంటారు. అందుకే చాలాకాలం కిందట కొన్నాళ్లు షిర్డీ శాయిబాబా, ఆ తరవాత అవతార్ మెహర్ బాబా, పుట్టపర్తి శాయిబాబా... జిల్లెళ్ళ మూడి అమ్మ, మళ్ళీ ఇప్పుడు పుట్టపర్తి శాయిబాబా, షిర్డీ శాయిబాబా!

ఈ రొటేషను దేవుళ్ళ ఏజంట్లయిన బాబాలకే కాదు దేముళ్ళకీ తప్పలేదు మన దేశంలో. రాముడు, కృష్ణుడు, శివుడు. అయ్యప్ప, వెంకటేశ్వరుడు, ఆంజనేయుడు. అఫ్‌కోర్స్ వెంకటేశ్వరుడిది ఎవర్‌గ్రీన్ గ్లామర్!

ఇలాటి వేవ్‌లన్నింటినీ తట్టుకుని అచం చలంగా నిలిచింది మా నాన్న శివభక్తి. ఈవిధంగా ఆయన దేవవ్రతుడు. అనగా పతివ్రత భర్తను తప్ప అన్యులను కాంచ నట్లు తన దేముడిని ఒక్కడినే తప్ప ఇతర దేవుళ్లని తలచనివాడు.

తాగేదేదో రెండు మూడు రౌండ్లయ్యాక నన్ను పిలిచేవాడు నాన్న. "శివానీ! అమ్మా! ఏదీ ఆ శివదీక్షాపరురాలనురా. పాట పాడవూ? " అని.

అది త్యాగరాజు కృతిట. నాన్నే నేర్పాడు నాకు.

తనే పాడుకోవచ్చు కానీ- నాన్నకి చాలా మంది సంగీత విద్వాంసులలాగే కంఠం కఠోరంగా ఉంటుంది సంగీత జ్ఞానం ఉన్నా.

ఎంత కఠోరమంటే తన కంఠం తనకే నచ్చనంత.

ఆడపిల్లనీ... చిన్నపిల్లనీ అవడాన నా కంఠం నయంగానే ఉండేది. అందుకని నాకు కొన్ని శివుడి భక్తిపాటలు నేర్పాడు. నాచేత పాడించుకునేవాడు.

నాకు సంగీతం రాదు. కాని అనుకరించ గల శక్తి ఉంది. విన్నట్లు పాడడం బ్రహ్మ విద్యేమీ కాదుగా? బాగానే పాడేదాన్ని. సూర్యుడిలా స్వయం ప్రకాశం లేకపోయినా చందమామ కూడా వెలుగివ్వగలగడం లేదూ?

తాగినప్పుడు మానాన్న శివభక్తి మరింత ఎక్కువయ్యేది.

మా నాన్న, అమ్మ చాలామంది దంపతు లకంటె విభిన్నంగా ఉండేవారు.

వీళ్లిద్దరూ ప్రేమగా మాట్లాడుకోవడం ఒక్కసారీ చూడలేదు నేను.

అలాగే వాళ్ళిద్దరూ కీచులాడుకోవడమూ ఒక్కసారీ నాకంట పడలేదు.

ప్రేమించుకోలేని వీళ్లు దెబ్బలాడుకోనూ లేరనుకొంటాను. విచిత్రమయిన త్రిభుజ శీర్షాలం ఆ చిన్న ఇంట్లోని మేం ముగ్గు రమూ. నేనూ, అమ్మా. నేనూ నాన్నా సన్ని హితులమే. కాని అమ్మా, నాన్నా కనీసం బాహ్యంగా బహుదూరం.

నాన్న లారీ డ్రయివర్ కావడం, బాగానే సంపాదిస్తున్నా వెనకెయ్యకపోవడం, కనీసం స్వంతంగా ఇల్లయినా కట్టుకోకపోవడం, ఇలాటి అసంతృప్తులుండేవనుకుంటాను అమ్మ అంతరంగంలో.

కాని ఎప్పుడూ బయటపడేది కాదు.

అమ్మా నాన్నల మధ్య సాధారణంగా ఒకటే భాష. అదే మౌనం. వాళ్ళవన్నీ మౌనరాగాలే. విధిలేక ఒక కప్పుకింద ఉండ వలసివచ్చినవాళ్ళలా ఉండేవారు. అలాగని మళ్ళీ అయిష్టతా కనిపించేది కాదు. వివా హానికి అర్థం రాజీ అని నమ్మి అనుసరిస్తు న్నట్లుండేవారు.

బడిలో వేయకపోయినా అమ్మ నాకు బాగానే చదువు నేర్పించింది. ముఖ్యంగా తెలుగూ, ఇంగ్లీషూ. అమ్మకి లెక్కలంత ఇష్ట

ముండేవి కావేమో. బాగా చెప్పేది కాదు. అసలు ఆడవాళ్లు చాలామందికి లెక్కలు బాగా రావనీ అందుచేతే వాళ్లకాసబ్జక్టంటే అయిష్టమేమో అనీ నా అనుమానం. అమ్మకి రావు కనుక నాకూ బాగా వచ్చేవి కావు లెక్కలు.

పదిహేడోఏట అమ్మతో పోట్లాడి నాన్నతో మాట్లాడి ఎలాగైతేనేం సాధించి మెట్రిక్ పరీక్షకి కూర్చున్నాను.

అయితే అంత కష్టమూ పడగా ఇంగ్లీషు, తెలుగు సబ్జెక్టులలో డెబ్బైశాతం చొప్పున మార్కులు వచ్చినా లెక్కల్లో ఫెయిల య్యాను.

ఏడుపొచ్చింది. "ఇదీ మంచిదే. మగాళ్లు చాలామంది చదువుకున్న ఆడవాళ్లన్నా తెలివైన అమ్మాయి అన్నా లోలోపల బెదిరి పోతూంటారు పెళ్ళి చేసుకుందుకు. నీకు పెళ్ళయ్యే యోగముండే పరీక్ష తప్పావు" అని ఓదార్చాడు నాన్న.

ఆ మాటలకి నాకాశ్చర్యమేసింది. నేను టీవీలో చూసే సినిమాలు, నాటకాలు, సీరి యల్స్ చెప్పే విషయానికి విభిన్నంగానూ, విడ్డూరంగానూ లేవూ నాన్న మాటలు?

వాళ్ళంతా ఆడవాళ్లు చదువు లే(కో)కనే అన్యాయమైపోతున్నారని నెత్తీ నోరూ మొత్తుకుంటూంటే నాన్న మాత్రం ఇలా ఆడవాళ్లకి విద్యే అనర్థం అంటాడేమిటి?

ఆయన అలా అంటే ఆడదయిన అమ్మ చదువుకున్నదయివుండీ కాదనకుండా మౌనంగా ఎలా ఊరుకోగలుగుతోందీ?

ఏమిటో వింత మనుషులు.

నాకు పద్దెనిమిది నిండాయి. ఆవేళ నాన్న రమ్‌బాటిల్ పెట్టుకుని అమ్మనీ, నన్నూ కూడా పిలిచాడు.

రమ్ పూజకి నాన్న అమ్మని పిలిచాడంటే ఏదో ముఖ్యమైన విషయం ఉందన్నమాటే. ఉత్కంఠతో కూర్చున్నాం మేము.

ఆయన రెండో రౌండులోకి వచ్చాక చెప్ప సాగాడు. "అష్ట వర్షే భవేత్ కన్య... అన్నారు. ఎనిమిది కాకపోయినా కనీసం పద్ధెనిమిదేళ్లకయినా ఆడపిల్ల పెళ్లి జరిపిం చాలి, ఎంత కాలం మారినా. శివానీ! నిన్ను పెళ్లి చేసుకుందుకు ఒక వరుడు అంగీకరిం చాడు. పెళ్లిచూపులూ వగైరాలేమీ ఉండవు. రెండు నెలల్లో నీ పెళ్లి. కుర్రాడు మంచి వాడే. బాగానూ ఉంటాడు. సంపాదనాప రుడు కూడా"

అలా అని గ్లాసులో మిగిలింది గొంతులో పోసుకున్నాడు నాన్న!

"మరో విషయం మనం మకాం మార్చె య్యబోతున్నాం ఈ వూరినుంచి. తేదీ ఇప్పుడే చెప్పలేను. లారీ ట్రిప్ బట్టి చెబు తాను, రెండు మూడురోజులముందు. వారం కావొచ్చు నెల కావచ్చు ఏరోజు వెళ్లి పోడానికైనా వీలుండేటట్లు పరిస్థితులను సిద్ధం చేసుకో. ఏర్పాట్లు చూసుకో" అన్నాడు అమ్మనుద్దేశించినట్టు.

అమ్మ ఎప్పటిలాగే మౌనంతో తన అంగీ కారాన్ని తెలిపింది.

చెప్పడానికింకేమీ లేదన్నట్లు నాన్న మళ్ళీ పూజలో మునిగిపోయాడు. నాకు కుతూహ లంగా ఉంది. వరుడెవరో, అతని వివరాలే మిటో తెలుసుకోవాలని. అమ్మ అడిగితే బాగుండుననుకుంటూంటే ఆవిడ లేచివెళ్ళి పోయింది.

నాకు అమ్మమీద బలే కోపమూ, చిరాకూ వేశాయి. రాబోయే, కాబోయే అల్లుడి గురించి తెలుసుకోవాలని ఆమెకి కొంచెమ యినా ఆత్రుత లేదూ? తనకి లేకపోతే పోయె. అమ్మాయి కోసమయినా అడగొ చ్చుగా? ఏమిటో ఆ నిర్లిప్తత! ఎక్కడైనా ఉంటుందా ఇలాటి అమ్మ?

నాన్న దగ్గర నాకు చనువులేదని కాదు. కాని ఆడపిల్లని. నా కాబోయే మొగుడు ఎలా ఉంటాడూ? ఏం చేస్తాడూ? ఏం




# ఏరిన ముత్యాలు

★ పదివేల పౌనుల విదేశబంగారంకన్నా పిడికెడు మాతృదేశపు మన్ను గొప్పది.

—డా॥రాజేంద్రప్రసాద్

★ అనర్గళ వాక్సరళి విజ్ఞానానికి నిదర్శనం కాదు.

—నెపోలియన్

★ మన శత్రువులే మన మనస్సాక్షికి నిదర్శనం.

— షేక్స్‌పియర్

★ ఆత్మవంచన చేసుకునేవారు అందరిలోకీ అధికంగా మోసపోతారు.

—బోనీ

★ జీవితం నాకు ఆలోచించడం నేర్పిందిగానీ, ఆలోచన నాకు జీవించడం నేర్ప లేదు.

— హెర్బన్

★ ఎవరి జీవితాన్నీ నాశనం చేసే అధికారం మనకు లేదు. ఎందుకంటే ఎవరి జీవితాన్నీ నిర్మించే శక్తి లేదు కాబట్టి.

—గాంధీ

★ భగవంతుని కూడా తప్పించుకొని తిరగగలవాడే రాజకీయవాది.

— షేక్స్‌పియర్

★ ఎన్నడూ ఆలోచించడం చేతగానివాడు, ఎపుడూ వాగుతూనే వుంటాడు.

—ప్రియర్

★ అధికంగా ఆసక్తి కనబరచేవారు అధిక మేధావంతులుకారు.

—మాసింగర్

★ కవి చెప్పేది కవిత్వం, విప్పి చెప్పేది విమర్శ.

—డా॥ సి.నా.రె.

★ యౌవనం ఒక ప్రవాహంలాంటిది. దానికి సరియైన ఆనకట్ట కట్టి ఆ నీటిని మళ్ళిస్తేనే జీవితం సార్ధకమగును.

—పరమహంస

★ ఆవేశపరులకు జీవితమొక ట్రాజడీ, ఆలోచించేవారికి అది ఒక కామెడీ.

—వాల్‌పోల్

★ జీవితంలో కొత్తను సాధించడం ఎంత కష్టమో గతాన్ని మరవడం కూడా అంతే కష్టం.

—మాలతీచందూర్

సేకరణ : శ్రీగిరి శ్రీకాంత్




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన ఆయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**అక్టోబర్ చతుర నవల కాటిచిలక**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

చదువుకున్నాడూ? అంటూ ఎలా అడిగేది సిగ్గువిడిచి?

చూడబోతే నాన్న అన్ని నిశ్చయించేసే వచ్చినట్లున్నాడు. ఆయన పద్ధతే అంత. ఎంత ముఖ్య విషయంలో అయినా ఎవరి సలహానూ తీసుకోడు. కనీసం చెప్పనయినా చెప్పడు సంగతి. అంతా గోప్యం. ఆయనేం చేస్తున్నాడో, చేస్తాడో ఎవరికీ చెప్పడు ముందుగా. పురుషాధిక్యత నిండిన తత్వం. ఇంకా నయమే. మకాం మార్పు సంగతేనా చూచాయగా చెప్పాడు.

నాకు నాన్నమీద కోపమొచ్చింది మొట్ట మొదటిసారిగా.

'ఏ ఊరనయినా అడగలేదు. పేరేమిటన యినా అడగలేదు' అని పాడిందే ఓ హీరో యిన్ ఏదో సినిమాలో నా పరిస్థితి అలాగే ఉంది. పెళ్ళవుతుందని తప్ప ఇంకేమీ తెలియదు.

నేనూ మనిషినే. ఆడపిల్లనయినా నాకూ ఓ మనసుంటుందనీ, దానికీ యిష్టాయిష్టా లుంటాయనీ ఎందుకు గమనించరు అమ్మా నాన్నా?

సిగ్గు వదిలేసి అడిగేశాను. "నీ కాబోయే అల్లుడి వివరాలు చెప్పు నాన్నా" అని.

"శివానీ! నీకు మంచి సంబంధమే చూశాను. ఈ నాన్నమీద నీకు నమ్మకం లేదూ? " అన్నాడాయన.

ఇంకేం మాట్లాడేదీ?

★ ★ ★

"రేపే ప్రయాణం. సామానంతా సర్ది సిద్ధంగా ఉంచండి" హుకుం జారీ చేశాడు నాన్న. మా ఇంట్లో సర్దుకోలేనంత పెద్ద సామానేమీ లేదు. ఓ టీవీ, చిన్న బీరువా తప్పిస్తే చెప్పుకోదగ్గవీ, ఖరీదైనవీ వస్తువు లేమీ లేవు. మా అమ్మ అసంతృప్తికీ నిర్లిప్త తకీ ఇదీ ఒక కారణమై ఉండవచ్చునేమో. లారీలోనే కనుక సామాను ప్యాకింగ్ చేయ నవసరం లేకపోయింది. వర్షాకాలమైనా టార్పాలిన్ ఉంది కనుక సామాన్లని అలాగే వేసేశాం లారీలో

డ్రయివింగ్ సీటులో నాన్న, పక్కన అమ్మ. కిటికీవేపు నేను.

"ఆ తలుపు లూజు. జాగ్రత్తగా కూర్చో" హెచ్చరించాడు నాన్న.

లారీ కదిలింది. బాల్యం గడిచిన వూరు. ఎన్నో ఏళ్ళుగా ఉన్న వూరు. విడిచిపో తూంటే నాకు హృదయం బరువెక్కింది. కళ్లు చెమర్చాయి. అమ్మ కూడా నా అంత కాకపోయినా కొంచెం బాధపడుతున్నట్లే ఉంది.

నాన్న మాత్రం నిశ్చలంగా, నిబ్బరంగా లారీ స్టార్టు చేసేశాడు. ఎప్పుడూ వూళ్లు తిరి గేవాళ్లకి ఉన్న ఊరుతో ఎక్కువ అను బంధం పెరగదేమో. ఊరు దాటామో లేదో వర్షం. అటూ ఇటూ పచ్చని పొలాలూ, దూరంగా కొండలూ ఏవీ కనపడకుండా ఏక ధాటిగా వర్షం. బ్రిడ్జిలమీంచి వెళ్తూంటే పొంగిపొరలుతున్న ఏరులు మాత్రం బాగానే కనబడ్డాయి.

చీకటిపడిపోయింది. వర్షంవల్ల మరింత తొందరగానూ ఉంది. అసౌకర్యంగానూ ఉంది.

ప్రయాణం ఆపితే బాగుండుననిపిస్తోంది. తోవ నాన్నకి సరిగా కనపడుతుందో లేదో? వైపర్స్ సరిగా పనిచేస్తున్నట్లు లేదు. రోడ్డు నిండా గోతులు తెలియకుండా నీళ్లు. జల్లులు లారీలోకి కూడా కొడుతున్నాయి.

ఎక్కడికో ఎంతసేపో తెలియని ప్రయాణం. నాన్న వినడని తెలిసి కూడా అంతకీ అన్నాను. "రాత్రికి ఆగి... పొద్దున్నే వెళితే మంచిదేమో నాన్నా"

నా మాటలు వినిపించనట్లే మామూ లుగా తన ధోరణిలో లారీని పోనివ్వసాగా డాయన.



రాబోతున్నది బ్రిడ్జి. దానికింద ప్రవాహం ఉధృతంగా పారుతోంది. నీటిమట్టం దాదాపు బ్రిడ్జిని తాకుతోంది అడుగున. అంతే తెలుసు నాకు. ఒక్కసారి పెద్ద శబ్దం. లారీ అంతా అతలా కుతలమయింది. ఆపైన...



"**నే**నెక్కడున్నాను? ఏమైంది?"

చేతిమీద సూదితో పొడిచినట్లు చురుక్కుమని మెలకువచ్చింది నాకు. కళ్లు విప్పి చూస్తే నేనెక్కడో ఉన్నాను నాకు తెలియని చోట.

"నీకేమీ కాలేదు. హాస్పిటల్‌లో ఉన్నావు. భయంలేదు. ఈ గ్లూకోస్ తాగు. తేరుకుంటావు"

"మీరు..."

"డాక్టర్ని. ఇది గవర్నమెంట్ హాస్పిటల్"

"మా అమ్మా నాన్నా ఏరీ?" గ్లూకోస్ తాగేసరికి బాగా ఓపికొచ్చేసింది.

"వాళ్లు మీ అమ్మా, నాన్నలా?"

"ఊc..."

"వీరి గురించి... ఉండు... వీరి గురించి తెలిసినవారిని పంపిస్తాను" అని వెళ్ళిపోయాడు డాక్టరు. నేను మంచంమీద లేచి కూర్చున్నాను. మోచేతులకీ, మోకాళ్లకీ చిన్న చిన్న ప్లాస్టర్లు వేసివున్నాయి.

నాకు కొంచెం అర్థమవుతోంది జరిగినదేమిటో లారీ బ్రిడ్జి రెయిలింగ్‌ని (బానిస్టర్) గుద్దేసింది. అదే నేను విన్న శబ్దం. నేను లారీ డోరు ఊడి...

"ఏయ్..."

అసభ్యకరమయిన ఆ సంబోధనకు తుళ్లిపడి చూశాను.

కాకీబట్టలు. పోలీస్ ఇన్‌స్పెక్టరేమో. ఎంత అగౌరవంగా పిలిచాడూ! 'గౌరవమనేది మనిషిలోనే ఉంటుంది తప్ప ఎదుటివారిలో కాదు. ఎవరి గౌరవానికయినా కొలబద్దలు వారి మాట, ప్రవర్తన, సభ్యత, సంస్కారాలే. ఎదుటివారిని నువ్వు మర్యాదగా ట్రీట్ చేసేంతమేరకూ ఆ గౌరవం నీదే. ఎదుటివారు నిన్ను తిడితే ఆ అగౌరవమూ, అసభ్యతా అవతలివాడిదే తప్ప నీవి కావు. అంటే అగౌరవం తిట్టినవాడికే కాని తిట్టు పడినవాడిది కాదు, అని తెలియదు. అందుకే ఎదుటివారిని తక్కువచేసి తాము గొప్ప అయినట్లనుకుంటారు. నిజానికి తక్కువయ్యేది తామే!

"నా పేరు శివాని" అన్నాను నమస్కరించి.

"ఓహో! చచ్చిపోయిన వాళ్లెవరు?"

"చనిపోవడమేమిటి?" తుళ్లిపడ్డాను. నాకు చాలా భయమేసిందొక్కసారి.

"లారీలో నీతో ప్రయాణం చేశారే. ఆ మనిషీ ఆడమనిషీ డ్రైవరూ..."

"ఆ! వాళ్లు చనిపోయారా! వాళ్లు నా అమ్మా, నాన్నా. దేముడా! అమ్మా నాన్నా చనిపోయారా" నాకు స్పృహ తప్పుతోంది. కూర్చున్నదాన్ని కూర్చున్నట్లే కూలిపోయాను. నాకు వీరి మాటలు మాత్రం తెలుస్తున్నాయి. వినపడుతున్నాయి.

"ఇది మళ్లీ పడిపోయింది స్పృహ తప్పి.





డాక్టర్ బాగా తెలివొచ్చాక పిలవండి నన్ను. ఎఫ్.ఐ.ఆర్. రాసుకుంటాను"

"మెడికో లీగల్ కేసులు కాదుకాని తల నొప్పి. పైసా కిట్టదు కాని అరవచాకిరీ, కంచిగరుడ సేవాచెయ్యాలి" విసుక్కున్నాడు డాక్టర్.

"ఆ శవాల పోస్టుమార్టం ఎంతవరకూ వచ్చింది? "

"సాయంత్రానికదీ ఔతుంది. దీనికి తెలివి వచ్చేసరికి పూర్తి చేయిస్తా. తాడూ బొంగరం లేని వాళ్లలా ఉన్నారు. తూతూ పెళ్లి చేసేసేదా? "

"ఏదో ఒకలా. వీళ్లకోసం ఎవరూ రాలే దంటే ఏమీ రాలదనేగా" అలా సాగింది వాళ్ల సంభాషణ.

ఇదీ ఈ దేశంలో ఒక నిస్సహాయురాలికి అధికారులందించే సేవలు! శారీరకంగా నిస్స త్తువ ఆవరించినా మానసికంగా నేను బాగానే ఉన్నాను. అమ్మా నాన్నల మరణం నన్ను దుఃఖితురాలిని చేస్తోంది నాకు భయమేస్తోంది. నేను అనుభవించవలసిన ఒంటరి జీవితమూ ఎదుర్కోవలసిన ప్రపం చమూ వద్దన్నా ఊహలలోకి వచ్చేస్తూ. ఒక మనిషికి ముఖ్యంగా చిన్నవాళ్లకి అమ్మా, నాన్నలు లేకపోవడం ఎంత భయంకరమైన పరిస్థితో నేను చదివాను. అందులోనూ ఆడపిల్లకి! పెళ్లికాని పిల్లకి! హాస్పిటల్ వారు నా ముఖాన ఇంత బ్రెడ్డూ, ఇన్ని పాలూ పోశారు. ఆకలి మీదున్నానేమో

అవే అమృతోపమానాలయ్యాయి. మూడున్నరవుతూంటే ఎవరో వచ్చారు.

"శివానీ అంటే నువ్వేనా? "

"ఊ..."

"నీకు శ్మశానానికొచ్చే ఓపికుందా? మీ అమ్మా నాన్నల కట్టెలను కాల్చాలిగా? కొరివి పెట్టడానికెవరేనా ఉంటే సరే... లేదా మమ్మల్ని చేసేయమన్నా చేసేస్తాం... మేము మునిసిపాలిటివాళ్ళం"

"ఎవరూలేరు... నేనే కొరివి పెడతాను. శ్మశానానికి రాగలను. రానిస్తారా? అహ... ఆడపిల్లని కదా? ఆడవాళ్ళని అక్కడికి రాని వ్వరట కదా? "

"గాడిదగుడ్డు. రానివ్వకపోడానికాళ్లెవరు? మేం చూసుకుంటాం... పద..." నన్ను నిముషంలో హాస్పిటల్‌నుంచి డిశ్చార్జి చేసే శారు. మునిసిపాలిటీ వాళ్ళు నన్ను శ్మశానా నికి బయలుదేరదీశారు.

ఏడుస్తున్నాను.

నా కాళ్ళు వొణుకుతున్నయ్.

గుండెలో ఏదో అయిపోతోంది.

అయినా నడుస్తున్నాను. విధి నడిపించే వేపు... శ్మశానంవేపు.

నేనక్కడికి వెళ్ళేసరికి చితి ఏర్పరచబడే ఉంది.

రెండు చితుల్లా కనిపించేలా... ఒకటే చితి కర్రలూ, దుంగలూ, దుక్కలూ పేర్చ బడి. శయ్యలా అమర్చబడి.

దానికి దగ్గరలో రెండు చాపచుట్టలు.

"ఈవిడొచ్చింది దహనం మొదలెట్టు" అన్నారు మునిసిపాలిటివాళ్ళు ఎవరితోనో అతనే కాబోలు కాటికాపరి. అలా అంటూనే వాళ్ళు తాళ్ళు తెంపి చాపచుట్టలు విప్పారు. పోస్టమార్టంలో ఖండాలయిన భాగాలు అస్త వ్యస్తంగా కలిపికుట్టగా ఏర్పడిన శరీరాకృ తులు అవి! ఒకటి మా అమ్మ... రెండోది మానాన్న... అని అనుకోవాలి వాటిచుట్టూ బ్యాండేజి గుడ్డలాటిది.

"ఆ గుడ్డ తీస్తే చూడలేవు. భయంతో మూర్ఛపోతావ్. మమ్మల్నడిగితే యీ పళానే కాల్చడం మంచిది" అన్నారు సారా కంపు కొడుతున్న మాటలతో.

అమ్మని చూస్తే భయమా! నాన్నని

చూడడానికి జంకా! వాళ్లేమయినా కొత్త వాళ్ళా? ఎందుకు భయపడతానూ?

నేను నా ఆలోచనలో ఉండగానే వాళ్ళు **శవాన్ని** చితికెక్కించేసి 'అగ్గెట్టు' అంటూ అగ్గిపెట్టె అందించారు.

నేను కట్టెలమీదున్న కర్పూరానికి అగ్గిపుల్ల మంట అంటించాను.

ఇదే అన్నమాట అగ్ని సంస్కారం!

ఆడపిల్లనయిన నేనంటించినా అంటు కుంది కదా? మరి తలకొరివి పెట్టేందు కంటూ కొడుకునే కోరుకుంటారేం?

నిజానికి వాళ్ళు కొడుకుని కోరుకునేది కట్నం వగైరాలకోసమే కాని కొరివిపెట్టడా నికి కాదేమో. ఇప్పుడు ఆ కొడుకులే తల్లి తండ్రులు చనిపోయాక కాక బతికుండగానే కొరివిపెట్టేస్తున్నారు, కొంపమీదకి ఆ తగ వులూ ఈ తగవులూ తెస్తూనూ, తమ ప్రవ ర్తనతోనూ.

చితి రగులుకుంటూంది. ఆ మంటలు నాలుకలు సాచుతున్నాయి పైపైకి. నాకు ఆశ్చర్యంగానూ ఉంది. భయంగానూ ఉంది. జరుగుతున్నది కలలా ఉంది తప్ప నిజంలా అనిపించడమేలేదు. అలా కాకపోతే నేనెలా ఉండగలనూ అలా నిబ్బరంగానూ నిమ్మకి నీరెత్తినట్లూనూ!

మేమెక్కిన లారీకి ప్రమాదం జరిగింది. బ్రిడ్జి రెయిలింగ్‌ని గుద్దేసింది. లారీతోపాటే అమ్మానాన్న దిగువకు పడిపోయి చచ్చిపో యారు. నేను మాత్రం విచిత్రంగా కిటికీలోంచి యివతలకి రోడ్డుమీదకుపడి స్వల్ప గాయాలతొ బతికేశాను. లారీ తుక్కు తుక్కయి పోయింది అమ్మానాన్నల శరీరా లలాగే.

అదిట జరిగింది. పోలీసాఫీసరు చెప్పాడు. చెప్పి "ఏవూరు వెళ్తున్నారు?" అని అడిగాడు.

నేను తెల్లమొహంవేశాను. 'తెలియదు' అన్నాను సిగ్గుతో చితికిపోతూ. అతను నన్ను వెర్రిమొహాన్ని చూసినట్లు చూశాడు. మానాన్న అదోతరహా మనిషనీ, తానేం చేయదలుచుకున్నదీ ముందు చెప్పే తత్వం కాదనీ ఎలా చెప్పేదీ?

గతంగురించి ఆయన అడిగిన వాటికి నాకు తెలిసినమేరకు చెప్పాను.

"అయితే నీకెవరూ లేరన్నమాట, అయిన వాళ్లు"

"ఉహు"

"శవాల్ని నువ్వే దహనంచేస్తావా? మేమే ఏర్పాటు చేద్దుమా?"

"నాకేం తెలుసు? మీరే చేయండి, దయ చేసి"

"సరే... నీమీద జాలికొద్దీ ఆ ఏర్పాట్లు చేయిస్తాను. కొరివి..."

"నేనే పెడతాను" అనేశాను... నాకు తెలి యకుండానే, మా అమ్మా నాన్నలకు సంబం ధించిన పనులు నేను తప్ప మరెవరో చేయడమేమిటన్నట్లు.

"అమ్మాయ్..."

ఆలోచనలలోంచి... తేరుకుని... అటు చూశాను.

ఏవరో ఆవిడ నలభయ్యా నలభైఐదూ మధ్య ఉంటుంది వయసు. ముడివేసిన జుత్తు. గుండ్రంగా ముఖం. గుండ్రపు బొట్టు. పూర్వకాలపు సినిమాలో తల్లి వేషంలోలా శాంత స్వరూపిణిలా ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఎవరికయినా అమ్మే అనిపించేలా ఉంది.

"ఊ"

"ఆడపిల్లవి నువ్వొచ్చావేం? కొరివి పెట్టేం దుకు?"

"ఇంకెవరూ లేక. మీరెవరూ?" అలాటి చోట నన్ను పనికట్టుకు పలకరించడం ఆశ్చ





ర్యమనిపించింది.

"నా పేరు గోమతి. ఈవూళ్ళో అనాథశరణాలయం నడుపుతున్నాను. ఇదుగో నా అడ్రసు. అవసరమైతే వొచ్చెయ్... నేను నీ బాగోగులు చూస్తాను. నాకు ఎవరూ లేని వారంటే జాలి" అంటూ ఒక్కసారటు చూసి, "కాటికాపరి వొస్తున్నాడు. వాడిని నమ్మకు. వాడు మంచివాడు కాదుసుమా. నేను వస్తాను. నా అడ్రస్ జాగ్రత్త" అని వేగంగా వెళ్ళిపోయిందక్కడినుంచి. అప్పటికే ఆ మునిసిపాలిటి వాళ్ళు వెళ్ళిపోయారు. శ్మశానంలో నేనూ, కాటికాపరీ, చితిలో కాలుతున్న అమ్మానాన్నలూ.

సాయంత్రం రాత్రిగా ముదురుతూ... వెలుగుతగ్గుతూ... చీకటి చిక్కబడుతూ వుంది. చుట్టూ చూశాను. అంత శ్మశానానికీ అతనూ నేనే ఉన్నాం. చితి- మంటలు మండడంలేదు. నిప్పులు కురిపిస్తూ కణకణలాడుతూంది. ఆ చితి వెలుగుపడుతూ అతను మరింత భయంగొల్పుతున్నాడు.

"మీరు కాటికాపరా? " భయాన్ని తగ్గించుకుందుకు అడిగాను. అక్కడ మరింత బెదరగొడుతున్న నిశ్శబ్దాన్ని ఛేదించడానికడిగాను.

"ఔను మీరెందుకున్నారూ ఇక్కడ యింకా? "

నలభయ్యయిదు పైన, ఏభైకి లోపు. అతని వయసెంతయినా ఉండొచ్చు మనిషి నల్లగా ఉన్నాడు. మరీ లావుగా కాకపోయినా దృఢంగా ఉన్నాడు. పంచె మోకాళ్ళ మీదకి కట్టుకున్నాడు. పైన తువ్వాలు మాత్రం ఉంది గుండెలని కప్పుతూ. నల్లని శరీరంమీద ఎర్రని వెలుగు పడుతూ అతని రూపం భయపెడుతోంది నన్ను.

మనిషి అవలంబించే వృత్తి, అతని ఆకృతిని ప్రభావితం చేస్తుంది కాబోలు. లారీ డ్రయివర్లు లావుగా ఉంటారు. పోలీసులు మొరటుగా ఉంటారు. టీచర్లు ప్రసన్నంగా కనిపిస్తారు. అడుక్కుతినేవాళ్ళు అసహ్యంగా కనిపిస్తారు. అందుకే ఏమో... యీ కాటికాపరి కఠినంగా కనిపిస్తున్నాడు. మృత్యువుకి కూడా భయపడకుండా చేయవలసింది కదా ఇతని పని? శవాలతోనే కదా ఇతని డ్యూటీ?

"శవదహనం పూర్తి కాలేదని... 'గొణిగాను' చితి ఆరలేదని"

"ఆ చితి ఆరడానికి మూడురోజులు పడుతుంది. అంతవరకూ అంతర్గతంగా అగ్గి ఉండనే ఉంటుంది. ఎముకలు అంటుకోడమే కాదు ఆరడమూ ఆలస్యమే. కనుక వెళ్ళిపోండి. చితి ఆరినట్లే. మీకిప్పటికే చాలా ఆలస్యమైంది"

"ఎక్కడికి వెళ్ళేది? " చటుక్కున నోరుజారిపోయింది. అంతేకాదు, నాకళ్లలోంచి నీళ్ళూ గొంతులోంచి దుఃఖమూ కూడా జారినట్లున్నాయి.

"మీ యింటికి మీవాళ్ళ దగ్గరికి"

"నాకు ఇల్లులేదు. నావాళ్ళనేవాళ్లెవరూ లేరు. నేను నిరాశ్రయురాలిని. ఒంటరిని. అనాథని. ఎవరూ, ఏమీ లేనిదాన్ని" ఎందుకో తెలియదు, ఒక్కసారి ఉవ్వెత్తున దుఃఖం వొచ్చేసింది. చితిమీదకూడా అమ్మానాన్నలు లేక ఒక్కసారిగా ఒంటరినైపోయాననే భావం మనసుని ముంచెత్తిందేమో.

"ఔనౌను. మునిసిపాలిటీనుంచి వొచ్చిన వాళ్ళు చెప్పారు. మరిచిపోయాను. మామూలుగా అనేశాను. బాధ పెట్టాను మనసుని. ఏడవకమ్మా ఏడవకు ఊరుకో"

అతని నోటినుంచి సారాకంపు! కాని మాటలనిండా మృదుత్వమే. సారా తాగినంత మాత్రాన ప్రతివాళ్ళూ పేలాలని లేదు. ఆ మాటకొస్తే నాన్న కూడా తాగేవాడు కదా? కాని ఎప్పుడూ తాగి అమ్మని



కొట్టలేదు సరికదా పల్లెత్తు మాటకూడా అనేవాడు కాదు. ఎప్పటిలాగే ఉండేవాడు. నిజానికి తాగనప్పటికంటే తాగినప్పుడే మరింత గౌరవంగా మర్యాదగా మంచిగా అభిమానంగా ఉండేవాడు.

వ్యసనాలు కొంతమందిని భౌతికంగానే తప్ప మానసికంగా బలహీనులని చెయ్యజాలవేమో! మనసునంటవేమో.

"లారీ నడపడం కనిపించని శ్రమ శివానీ. ఎంతో ఏకాగ్రత అవసరం. కళ్ళు సూదులు చేసుకుని తీక్షణంగా చూస్తూండాలి.

స్టీరింగ్ పట్టుకునే చేతులూ, బ్రేకు, ఆక్సిలరేటరుమీద ఉంచే కాళ్ళూ పెద్దగా ఏమీ చేస్తున్నట్లు కనిపించవు పైకి. కాని వాటిలో ఎంత బలం కేంద్రీకరించాలనీ! భారీ లారీని కంట్రోల్ చేయడానికి మనిషి నాడీమండల వ్యవస్థ ఎంత వొత్తిడికి లోనవుతూ ఉంటుందో అతనికే తెలుస్తుంది.

లారీ దిగాక నిస్సత్తువా నరాల పీకూ బయట పడుతూంటే అప్పుడు కనిపిస్తుంది నిజంగా నరకం.

ఆ నరకం నుంచి, నరాల బాధ నుంచీ బయట పడేందుకే లారీ డ్రయివర్లు తాగుతారు.

నేనూ తాగుతాను.

ఇది మీ అమ్మకు అర్థం కాదు. తన భర్త లారీడ్రయివింగ్ చేయడం అసంతృప్తికీ అవమానానికీ హేతువయితే, అతగాడు తాగడం ఆమె ఆగ్రహానికి కారణం. అంధుకే ఆవిడలో నాపట్ల ఆ మౌనమూ, నిర్లిప్తతా.

నన్నడిగితే మనుషులలో నిజమయిన చెడ్డతనం ఎదుటివారి నర్థంచేసుకోలేకపోడమే అంటాను. మనిషన్నాక క్షమించే గుణం ఉండాలమ్మా. ఏమంటావ్? "

"ఏమీ అనుకోనంటే ఒకటడుగుతాను నాన్నా... డ్రైవర్లూ, క్లీనర్లూ వగైరా మోటార్ స్టాఫ్ అంటే మోటుమనుషులంటారే అందరూ మరి నీలో యింత చక్కని భాషా. సంస్కారమూ"

ఆయన నవ్వేసి "జీవనభృతికోసం ఆ డ్రయివింగు. నేను చిన్నప్పుడు సంస్కృతం చదువుకున్నాను. సంస్కారుల పెంపకంలోనే పెరిగాను. సరేలే. ఏదీ. శివదీక్షా పరురాలనురా. పాడు తల్లీ" అని తొందరచేసేవాడు.

త్యాగరాజకీర్తనలూ అన్నమయ్య కృతులూ అంటే ఆయనకెంత యిష్టమో. నాలాటిది పాడుతున్నా ఆయన ఆనందంతో కనులు అరమోడ్పులు చేసుకునేవాడు. రమ్ కంటే శివదీక్షా పరురాలనే ఆయన కెక్కువ శాంతినిచ్చేదేమో.

తాగితే ఏం? చాలా మంచివాడు నాన్న.

సంస్కృతం చదివీ లారీడ్రయివరైన నాన్న వెనుక ఏదో కథ ఉండే ఉంటుంది. కాని ఎప్పుడూ చెప్పలేదు మరి.

ఓదార్పు- నా దుఃఖాన్ని శతగుణితం చేసివదలితే నాన్న జ్ఞాపకం దాన్ని సహస్రగుణితం చేసింది. భోరున ఏడిచేశాను.

నా దుఃఖం వరదలా పొంగింది కాటికాపరి ఓదార్పు లభించడంతో.

అతను నన్ను స్వేచ్ఛగా ఏడవనిస్తూ మాటాడకుండా నిలుచున్నాడు నావైపే చూస్తూ.

కొన్ని నిముషాలపాటు అలాగ... అతను మౌనంగా... నేను రోదిస్తూ.

నా దుఃఖానికి అలుపే వొచ్చిందో, విసుగే వొచ్చిందో, తన నిష్ప్రయోజకత్వమే తెలిసొచ్చిందో, జ్ఞానోదయమే అయిందోగానీ దానంతట అదే ఆగిపోయింది చిన్నపిల్లవాడు అమ్మచేత దెబ్బలు తినకుండానే





మారాము ఆపేసినట్లు.

అప్పుడడిగాడతను "ఇప్పుడేం చేస్తావమ్మా? "

నేనేడవలేదు "ఏం చేసేదీ? " ఎదురు ప్రశ్న వేశాను.

గడుసుతనంకొద్దీకాదు, నిజంగా తెలియకనే.

కొంచెం ఆగి "నాకేమీ పాలుపోవడం లేదు... ఆc... అన్నట్లు... ఆవిడవద్దకు వెళ్తాను. గోమతిగారి దగ్గరకి"

ఒక్కసారిగా అతను కంగారుపడిపోయాడు.

"గోమతి దగ్గరకా! వొద్దుద్దు. అంత కంటే... ఊ... తరవాత ఆలోచిద్దాం. ఎప్పుడు తిన్నావో ఏమో... నువ్వు నూతిదగ్గర స్నానంచెయ్యి. ఉండు. ముందు నాతో రా... ఇంతకీ నీకు అది తప్ప... ఆ గోమతి తప్ప యింకెవరూ లేరా? " అంటూనే నడవ సాగాడు.

"లేరు" అన్నాను అతనివెనుక కదులుతూ.

అతను శ్మశానంలో ఒక మూలగా ఉన్న చిన్న గుడిసెలోకి తీసుకువెళ్ళాడు నన్ను. నడుస్తున్నానే కాని నాలో ఎన్ని ఆలోచనలు! ఎన్ని సంధేహాలు! ఎన్ని భయాలు!

'అతను మంచివాడు కాదు... అతని మాటలు నమ్మకు... ఆ మనిషిని నమ్మకు' అనిగదా గోమతిగారి హెచ్చరిక.

ఇతను నన్ను తన గుడిసెలోకెందుకు తీసుకెడుతున్నాడు? ఏం చేద్దామని?

వొంటికి దెబ్బలు తగిలీ... విపరీతమయిన దుఃఖంలో నలిగీ, అసలే అందగత్తెనేమీకాని నాలో ఈ పరిస్థితిలో కూడా ఈ వృద్ధుడు 'స్త్రీ'ని చూడగలుగుతున్నాడా!

నా తండ్రి వయసువాడు. ఇతను నాలో కూతురిని కాక స్త్రీని ఎలా చూడగలుగుతున్నాడు? అన్యాయమనీ అక్రమమనీ అని పించడంలేదా?

'తలలు బోడులయిన తలపులు బోడులగునా? '

'తాతా! పెళ్ళాడతావా? '

'నాకెవరిస్తార్రా పిల్లని? '

'మగవాడి కామానికి ఫుల్‌స్టాప్ చచ్చాకనే. అంతవరకూ అతని కామానికి పరిస్థితులు పెట్టే కామాలే ఉంటాయి'

అలాటివన్నీ మెదడులో మెదులుతూ... దాన్ని కందిరీగల పుట్టనిచేసి వొదుల్తున్నాయి.

అయినా నేనక్కడినుంచీ, అతనినుంచీ పారిపోలేదంటే కారణం- నాకాళ్ళు పరిగెత్తగలిగేంతగా స్వాధీనంలోకి రాకపోడం, మోకాలిమీద గాయం బాధిస్తూండడమూను.

అలాగ నన్ను శారీరకబలహీనత బంధిస్తూంది. నీరసం... నిస్త్రాణ... నన్ను ముంచెత్తుతున్నాయి. అందుకే నేనేమీ చేయలేకపోతున్నాను. చివరికి ఆత్మరక్షణ కూడా.

అదో చిన్నగుడిసె... అదీ రెండు భాగాలుగా. ఒకటి వంట, తిండికీ. రెండోది ఉండడానికీ పడుకోడానికీ. అక్కడొక మంచం. ట్రంకుపెట్టె, బట్టలదండెం.

అతను రెండు చీరెలు తీశాడు ట్రంకుపెట్టెలోంచి "స్నానం చేశాక నీకు నచ్చింది కట్టుకో"

"ఇక్కడ ఆడవాళ్ళు కనపడరేం? " మెల్లగా అడిగాను.

"ఉంటే కదా? నేను ఒంటరివాడిని. ఆ కబుర్లన్నీ తరవాత చెప్పుకోవచ్చు ముందు స్నానానికి వెళ్లు. భోంచేద్దువుగాని"

"ఈ చీరెలు... కొత్తవిలా..." నా అను

మానం నాది. ఆడవాళ్ళు లేనప్పుడు చీరెలెం దుకున్నాయి?

"శవంమీద కప్పిన కొత్తగుడ్డలు చాకలీ, కాటికాపరీ పంచుకుంటారు. శవంమీద కొత్తబట్టలే కప్పుతారు. ఫరవాలేదు. అవి చాకలి ముట్టుకునీ, పసుపు నీళ్ళు జల్లబడీ శుద్ధి అయినవే. నీకేమో కట్టుబట్టలు తప్ప మారు బట్టలున్నట్లులేదు. తడి చీరెతో ఎలా ఉంటావ్? తడి చీరకంటే శవంమీద కప్పినదయినా పొడిబట్టే నయం. వేగం వెళ్లు"

ఆ చీర అందుకుంటూంటే ప్రేమ్‌చంద్ రాసిన కఫన్ కథ జ్ఞాపకమొచ్చింది. కఫన్ అంటే శవంమీద కప్పేగుడ్డ... కొత్తగుడ్డ! అది నేనిప్పుడు కట్టుకోబోతున్నాను!

ఒక్కసారి వేడి ఓహ్! నేను చితికి మరీ దగ్గరగా వొచ్చాను పరధ్యానంలో ఇంకా అమ్మానాన్నల చితులు ఆరనేలేదు. అప్పుడే అతినికృష్టమైన అనాథజీవితం ప్రారంభమై పోయింది నాకు! ఇందుకే కాబోలంటారు మనిషికన్నింటికంటే అదృష్టం అమ్మా నాన్న లుండడం అని.

కాటికాపరి నాకెందుకు ఆశ్రయం కల్పిస్తు న్నాడు? అన్నం పెడతానంటున్నాడూ? కొత్త చీర యిచ్చాడూ!

బలికి తీసుకెళ్ళే మేకపిల్లకి కూడా పసుపూ అవీ పూసి అలంకారాలు చేస్తారు. నా శీలం బలి తీసుకునేముందు ఇతను నన్నలంకరించబోతున్నాడన్నమాట. నేను స్నానం చేసి శుభ్రంగా ఉంటే అతని ఆనందం మరింత పెరుగుతుందిగా?

ప్లాస్టిక్ బకెట్‌తో చేది నెత్తిమీద వొంపు కున్నాను. బకెట్‌కి చిల్లుండి కొన్ని నీళ్ళు కారిపోయినా- బాగానే వొచ్చాయి. వల్లకా టిలో బకెట్టు... హాస్పిటల్‌లో మంచినీటి గ్లాసులు... ప్రజోపయోగంకోసం పెట్టే సామానులేవీ సవ్యంగా ఉండవు కాబోలు.

చల్లని నీళ్ళు ఒక్కసారి నెత్తిమీద పడేస రికి శరీరం ఒక్కసారి షాక్ కొట్టినట్ల యింది. నరాలలో జివ్వుమంటూ చైత న్యమూ, కొత్త బలమూ.

చల్లదనంలో సుఖమూ శక్తీ ఉంటాయి. మనదేశంలాటి ఉష్ణదేశాలలో ఎంత అలసి పోయినా చల్లని నీళ్లతో ముఖమూ కళ్లూ కడుక్కునేసరికి ఎంతో సేదతీరినట్లుండడం నాకు లోగడ కూడా అనుభవమే. రెండో బకెట్ కూడా చేది వొంటిమీద పోసుకు న్నాను. జ్వరమొచ్చినట్లు గుబగుబలాడిపో తూన్న నా వొంటికి ఆ చన్నీళ్ళు ఎంతో స్వాంతన కలిగించాయి. చుట్టూ చూశాను.

దట్టంగా చీకటి దూరంగా గుడిసె లోనూ... చితిలోనూ తప్ప వెలుగేలేదు. ఈ చీకటిలో శ్మశానానికి పైవాళ్లెవరూ రారు. నూతిగట్టు ఎలాగూ అడ్డంగా ఉండనే ఉంది. బట్టలతో సచేల స్నానం అనవసరమనిపించింది. బాత్‌రూ మ్‌లోలాగ... బట్టలు లేకుండా విచేల స్వేచ్ఛా స్నానం చేయసాగాను. వొంటిమీద నేరుగా చన్నీళ్ళు తాకేలా. ఎంత హాయిగా ఉందీ ప్రాణానికి! శరీరాన్నీ మనసునీ కూడా సుఖంగా నిర్మలినం చేస్తున్న చన్నీటి స్నానం. ఎంతసేపు చేశానో! అప్పుడైనా...

"ఎంతసేపు నానతావ్? తొరగారా" అని కాపరి కేకలు వేయబట్టి స్నానమాపేను. కొత్త చీర కఫన్... శవంమీద కప్పిన చీర... కట్టుకుంటూంటే చేతులు వొణి కాయి. శరీరం జలదరించింది. వెన్నులో చలేసినట్లయింది. కాని గత్యంతరం లేదు కదా! గబగబ చుట్టబెట్టుకుని గుడిసెవేపు నడవసాగాను.

ఈసారి నా ఆలోచనల తీరే మారిపో యింది.

అన్నం తిన్నాక- అతను నన్ను బలాత్క రిస్తాడు.

ముందు మర్యాదగా... "నువ్వు నా





తండ్రివంటివాడివి. నేను నీకూతురిలాటి దాన్ని. మనమధ్యనున్న వయోతారతమ్యం నీలో నాపట్ల వాత్సల్యాన్నే తప్ప వలపునీ వాంఛనీ ప్రేరేపించకూడదు. అది అన్యాయమూ అధర్మమూ అక్రమమూ అనుచితమూ కూడా. నాలో నీ పుత్రికని చూసుకో' అని బతిమాలుతాను.

విన్నాడా, సరే... నామాట వినకుండా మీదకి వొచ్చాడో... నేనేమీ తెలుగు సినిమాలో నాయికలా చవటలా మిగిలిపోను, చింపుకోమని చీరా జాకెట్లూ, చెరుచుకోమని శరీరమూ అతనికి వొదిలేయను. అదేమిటో, మన హీరోయిన్లు వస్తాదుల్లా అంతంత లావుంటారు. మామూలు ఫైటింగ్‌లలో మగ విలన్లని చావబాదేస్తారు. కాని అదేం విచిత్రమో ఒక్కడి చేతిలో అతిసులభంగా రేప్ అయిపోతారు. సినిమాటిక్ అరుపులరవడం తప్ప నిజంగానూ సజీవంగానూ ప్రతిఘటించరు.

అనారోగ్యంతో లేని స్త్రీని... ఆమె అంగీకారంలేకుండా... మగాడు ఒంటరిగా మానభంగం చెయ్యలేడు. స్త్రీ నిజంగా అబలేమీ కాదు. అండాలతో ఎసర్లుదింపే అతిశక్తివంతురాలు. బండతో ఎలాటి దాన్నయినా పచ్చడి చెయ్యగలదు. మగాడిని మోసే బలమున్నది. ప్రసవ వేదననే తట్టుకోగలది. ఆమెను ఒక మగాడు మానభంగం చెయ్యగలగడమా! అసంభవం. అసాధ్యం. అందులోనూ ఈ కాపరి వృద్ధుడు. తనేమో యౌవనంలోకి ఇప్పుడే ప్రవేశించింది. అన్నం తినేసరికి మళ్ళీ బలమొచ్చేస్తుంది తనలోకి. ఈడ్చి పెట్టి ఒక లెంపకాయ ఇచ్చిందంటే అతనీజన్మలోనే కాదు మరో జన్మలో కూడా ఏ మహిళనూ మానభంగం చెయ్యడానికి సాహసించడు.

శివానీ దెబ్బ- దుర్మార్గం అబ్బ

అమ్మ తనకి ధైర్యం నేర్పింది, చదువుతో పాటు.

అదే తనకిపుడు శ్రీరామరక్ష.

అతను రెండు విస్తళ్ళలో అన్నం వొడ్డించేసి ఉంచాడు, నేను గుడిసెలోకి అడుగుపెట్టేటప్పటికే. నాకోసమే ఎదురుచూస్తున్నట్లున్నాడు. నన్నొక్కసారి దీపకాంతిలో ఎగాదిగా చూసి, “కూర్చో నువ్వు నీచు తింటావో తినవో నాకు తెలవదు. తింటానంటే పొద్దుటొండిన చేపల పులుసుంది. తిననంటే ఉల్లిపాయా మిరపకాయా ఉప్పేసి రుబ్బిన పచ్చడుంది” అన్నాడు.

రుచి సంగతేమో కాని చేపలంటే నాకు వాటి వాసనే గుర్తొస్తుంది. చేపలేకాదు, జలజీవాలయిన రొయ్యలు, పీతలూ అన్నా కూడా అయిష్టమే. అందుకు ఆ కారం ముద్దే వేయించుకున్నాను. అంతవరకూ లేని ఆకలి- బలిని చూసిన పులిలా ఒక్కసారి విరుచుకుపడింది. రుచిని కూడా పట్టించుకోనివ్వనంత ఆకలి. శవంలేచినింటి ఆకలి అధికమంటారు. నిజమేనేమో! భోజనమయ్యాక నాకోసం మానభంగమనే ఆపద పొంచి ఉంది. అయినా నేను ఈ అన్నం, కూరా ఎలా కబళించగలుగుతున్నాను? కుండెడన్నమూ నాకే చాలేట్లు లేదు. నాలోనేనా యింత ఆకలి?

“మజ్జిగ అలవాటేమో... లేదు మరి” అన్నంయింక లేదని అన్యాపదేశమేమో అది. మాంసాహారులు చాలామంది మజ్జిగ వేసుకోరు. కాని నేను మా నాన్నకి కూడా కూతురినే కదా? అందుకే కాబోలు నాకు మజ్జిగా అన్నమూతో ముక్తాయింపు చెప్పకపోతే భోజనం పూర్తయినట్లు అనిపించక ఏదో వెల్తిగా ఉంటుంది. సరే... శతకోటి దరిద్రాలకనంతకోటి ఉపాయాలని ఊరికే చెప్పలేదు కదా? హిరణ్యార్థం అక్షతాం సమర్పయామి (బంగారం బదులు అక్షతలు సమర్పిస్తున్నాను) అన్నట్లే... మజ్జిగార్థం మంచినీళ్ళు సమర్పయామి- అను

కుంటూ అన్నంలో నీళ్లుపోసుకుని... ఉప్పే సుకుని... అదే మజ్జిగన్నం అని తినేశాను. నాకు చల్లన్నం కొత్తేమీకాదు.

కాపరి చుట్ట తీసుకుని బయటకు వెళ్ళాడు. నిప్పు, అగ్గిపెట్టె పట్టుకెళ్ళలేదేం? ఓహో! చితిలో అంటించుకుంటాడు కాబోలు చుట్టని... దేముడి దీపానికి సిగరెట్ వెలిగించుకోడం మహాపాపముట. మరీ చితాగ్నికి చుట్ట వెలిగించుకుంటే దాని ఫలితమేమిటి?

పగలంతా చాలా అలసిపోయిన అనంతరం కడుపునిండా తినడంతో అన్నసారం ధమనులలోకి వెళ్తూ మత్తుగా బరువుగా ఉంది. కళ్ళు మూతలుపడిపోతున్నాయి. కాని నిద్రపోడానికి వీలులేదే! నిద్రపోతే అతను అతిసులభంగా అత్యాచారం చేసేయగలుగుతాడు.

కాని... పులిలా అంత ప్రమాదం పొంచి ఉన్నా... నిద్రవొచ్చిపడిపోతూందే! నిద్ర సుఖమెరుగదని సామెత. నిద్ర ప్రమాదం కూడా ఎరగదా? ఆకలినయినా అణచవొచ్చు గాని నిద్ర నాపుకోవడం మనిషి తరంకాదేమో.



మెలకువ వచ్చేసరికి గుడిసెలో నేనొక్కర్తినే ఉన్నాను. ముందు ఓ నిముషం అంతా అయోమయంగా అనిపించినా త్వరగానే పరిస్థితిని అర్ధమూ చేసుకున్నాను, సర్దుకోనూ సర్దుకున్నాను. చైతన్యమూ స్పృహా రాగానే నేను చేసిన మొట్టమొదటి పని నా శరీరాన్ని పరీక్షించుకోడం.

దేముడి... అహ... ఆ మానవుడు... కాపరి దయవల్ల నా శీలానికీ, శరీరానికి ఏ మలినమూ అంటలేదు. శుభ్రంగానే ఉంది. గోమతి అతనెంతో దుర్మార్గుడని చెప్పిందే. మరి... అవకాశం లభించినా అతనెందుకూరుకున్నాడు? నేనెంత మొద్దు నిద్రపోయానూ! ఆ నిద్రలో నిజంగా ఏమైనా జరిగినా తెలిసే స్థితిలో లేకుండా వొళ్ళు మరిచి అతిగాఢంగా నిద్రపోయాను.

నేను ముఖం కడుక్కుని స్నానం చేసి వొచ్చేసరికతను టీ తెచ్చాడు.

"నువ్వు టీ తాగాక అలా బయటికెళ్దాం" అన్నాడు. నేను సిద్ధమయ్యాను. టీ తాగి రెండో కఫన్ కట్టుకున్నాను.

"నువ్వు నడవలేవని... రిక్షా పిలిచాను. కాలికి దెబ్బలు తగిలాయిగా? "

ఇద్దరమూ రిక్షాలో కూర్చున్నాం. అది పావుగంట పరుగెత్తి ఒక చోట ఆగింది. పాతబడిన ఇల్లు. ముందు ఆవరణ. దానిలో పది పదిహేనేళ్ల మధ్య అమ్మాయిలు... గేటుకి అనాధశరణాలయం అనే బోర్డు.

నాకర్థమయిందతని ఉద్దేశం.

అనాధ శరణాలయంలో పనిచేసే ఆవిడ కాబోలు అతని ప్రతిపాదన విని అంది,

"పద్దెనిమిది దాటిన అమ్మాయిలను చేర్చుకుందుకు రూల్సు అంగీకరించవు. అదీ కాక..." గొంతు తగ్గించి... "కమిటీ మెంబర్లు మగవాళ్లు. ముసలివాళ్లేకాని ఇక్కడ కాస్త పెద్ద అమ్మాయిల శీలానికి భద్రత తక్కువ" అంది.

దాంతో అతనింకేమీ అనకుండా నన్ను తీసుకుని బయటకు వచ్చేశాడు. నేనావిడతో

"నేనేమీ అందగత్తెను కానుగా? " అన్నాను.

"యవ్వనంలో ఉన్నావు చాలు. యవ్వనంలో ఆడగాడిదకూడా అందంగానే కనిపిస్తుంది. మగవాళ్లు... నడివయసు మగవాళ్లంత ప్రమాదకరమైన వాళ్లో నీకు తెలియదు. ఈ రొంపిలోకి దిగాలనుకోకు" అంది.

ఆవిడ నన్ను వదిలించుకోడానికని అబద్ధం చెప్పిందనిపించలేదు. నిజంగా నా శ్రేయస్సుకోరే హెచ్చరించినట్లు అనిపించింది.

ఇవతలకు వచ్చాక అన్నాను, "నేను మీకు భారంగా ఉండను. నాకు గోమతి ఆశ్రయం ఇస్తానన్నారు. ఆవిడ దగ్గర వదిలెయ్యండి"

అతనొక్కసారి నన్ను చూసి నవ్వాడు, "అలాగే వెళ్దాం. కానీ నిన్న ఆవిడ నీతో ఏం మాట్లాడిందీ? "

అబద్ధం చెప్పడానికి నోరురాలేదు. కాని అప్రియమైన నిజం ఎలా చెప్పగలను? అతన్నెలా బాధించగలను? అది సంస్కారం కాదే.

నేను తటపటాయిస్తుంటే అతను భరోసా ఇచ్చాడు, "నేనేమీ అనుకోను. నిజం చెప్పు... మీరేం మాట్లాడుకున్నారూ? "

నాకాశ్రయమిస్తానన్న సంగతితోపాటు, "మీరు మంచి వారు కాదనికూడా అంది" అని చెప్పేశాను. అతను నన్ను మళ్లీ రిక్షా ఎక్కించాడు. ఈసారి రిక్షా ఇరుకు వీధిలోకి వచ్చింది. ఆ ఇళ్లు చైతన్యంలేక నిద్రపోతున్నట్లున్నాయి. ఆ వీధిని చూస్తుంటే నాకేమిటో అనిపించింది.

"ఇది ఏ వీధో, దీనినేమంటారో అమ్మాయికి చెప్పు" అన్నాడతను రిక్షావాలాతో

"దీని పేరు మెరికవీధి. సానివాడ" చెప్పాడు రిక్షా అబ్బి. నేను తుళ్లిపడ్డాను.

"ఇదే గోమతి కంపెనీ" అని ఆపేశాడు రిక్షా ఆ ఇంటిముందు.

"ఆడపిల్లవి... అమాయకురాలివి... అనాధవి. బహుశా నీకివేవీ తెలిసుండవు. ఇలాటివేవీ ఎరుగుండి ఉండవు. కంపెనీ అంటే మరేటో అనుకోమాకు. ఏ అగ్గిపెట్టెల కంపెనీయో, బిస్కత్తుల కంపెనీయో అని భ్రమ పడకు.

అవికావు. కాని ఇదీ ఒక కంపెనీయే.

ముండలకంపెనీ అంటారు మోటువాళ్లూ, నాటువాళ్లూ.

కొందరు సున్నితమయిన వాళ్లూ, సుకుమారమైన వాళ్లూ, సదువుకున్నోళ్లూ దీనిని సానీధి అంటారు.

"ఇంకా ఎన్నో రకాల పేర్లున్నాయి కానీ నీకర్ధమయిపోయిందిగా సాలు.

"గోమతి అలాటి పడుపుకత్తెలను తన అజమాయిషీలో ఉంచుకుని యాపారంచేస్తుంది. వచ్చిందాన్లో వాళ్లకి కొంతా తనకి కొంతా వాటా.

ఆవిడగారిచ్చే ఆశ్రయం అదే, చేరదియ్యడం! సానిని చెయ్యడం.

నువ్వు ఆవిడ ఆశ్రయంలోకి వెళ్తానంటే నాకేమీ అభ్యంతరంలేదు. నిన్ను అలా చెయ్యవద్దని చెప్పడానికి నేనెవర్ని? నీమీద నాకేటదికారముంది?

"కాని ఇదంతా ఎందుకు సెబుతున్నానంటే నేను మనిషిని. నువ్వూ మనిషివి.

నేను పెద్దోణ్ణి, నువ్వు సిన్నపిల్లవి.

గోమతి గురించి నాకు తెలుసు. నీకు తెలియదు.

పైగా నీమీద నాకు జాలి కూడా ఉంది.

"నా కళ్లముందే ఓ మంచి అమ్మాయి సెడిపోయేవేపు అడుగేస్తుంటే గోమతి అలా అడుగేయించబోతుంటే మనిషిగా చూస్తా వూరుకోలేక, మనసుండబట్టక నా ఇది కొద్దీ నేను తాపత్రయపడుతున్నానంతే.

"నువ్వు తెలిసీ కావాలనీ అటే అడుగేస్తా నంటే నేనిట్నించే పోతాను ఎనక్కి.

"లేదు అటేపు పోను... అన్నావో ఏటి సెయ్యాలో అపుడు ఆలోసిద్దాం. బలవంతం లేదు. నీ బతుకు నీ ఇష్టం. చెప్పడం వరకే నా వంతు"

నివ్వెరపోయాను నేను.

"ఇలాటి చోటుకి తెలిసీ ఎందుకు తీసుకొచ్చారు నన్నసలు? "

అతను నవ్వాడు.

"తీసుకువచ్చి చూబెట్టకపోతే నీకెలా తెలిసేదీ? నోటిమాటలతో నేను చెబితే నమ్మకం కలిగేదా? అసలే నేను చెడ్డాణ్ణి. దుర్మార్గుణ్ణి"

"ఛీఛీ... ఎంత మాత్రమూ కాదు. ఎవరన్నారలా? నేననలేదు"

"గోమతి అందిగా"

"ఔను కాని ఆవిడెందుకందీ అలా? పనికట్టుకుని అబద్ధమెందుకాడిందీ? ఒక మనిషి గురించి అవసరం లేకపోయినా మంచి మాటలు చెప్పొచ్చుకానీ, అనవసరంగా చెడ్డ మాటలు చెప్పడం సంస్కారం కాదే!"

"మా బతుకులకిలాటి పెద్ద పెద్ద మాటలూ పెద్దపెద్ద ఇసయాలూ తెలిసి చావ్వులే. ఒక్కపాలి లోపలికెళ్లి చూద్దాం పద"

నాకు లోపల కడుగుపెట్టాలనిపించడం లేదు. వ్యభిచార గృహం. కాళ్లు వణుకుతున్నాయి తప్పుచేస్తున్నట్లు.

గదులు గదులుగా ఉందా ఇల్లు. వీధిలోకి వరండా హాలూ లాగే కనిపిస్తున్నా ఆ గదుల తలుపులు బార్లా తీసే ఉన్నాయి. ఒక్కొక్క దానిలోనూ ఒక్కొక్క స్త్రీ. ఒంటి మీద గుడ్డకూడా సరిగాలేకుండా అస్తవ్యస్తంగా పడి నిద్రపోతున్నారు.

"ఈళ్లకి రాత్రి పగలూ, పగలు రేతిరీ. రాతిరంతా రంకుతనం చేసీచేసీ అలసిపోతారు. అందుకే ఇప్పుడు అలా శవాల్లా పడిపోయారు"

పగిలిన గాజుముక్కలు, నలిగిపడిన పూలు, ప్రతిగదిలోనూ ఓ మూలగా మట్టి కుండ, పక్కనే ప్లాస్టిక్ చెంబు. కొన్నిటిలో మంచం. మరికొన్నిటిలో చాప. సుమారుగా అన్ని గదులూ ఒక్కలాగే ఉన్నాయి చిరు చిరు భేదాలతో. ఆ వాతావరణం వెగటు కల్గిస్తోంది... వాంతొచ్చేటట్లుంది... అసహ్యమేస్తోంది.

మమ్మల్నెవరూ అడ్డడమే లేదు అలా లోపలికి నడుస్తుంటే. అడ్డడానికి ఎవరు మెలకువగా ఉన్నారని?

"నీ ఇష్టమొచ్చిన గదిలోని అమ్మాయినెన్నుకో"

"ఎందుకూ? "

"తరువాత చెబుతాను"

ఆశ్చర్యంగా చూశాను. సరే అని ఓ గది చూపించాను. అతనా గదిలోకి నడిచాడు.

"ఏయ్ లే" ఆమెను కుదిపాడు.

"ఎవరు? ఊఁ నిద్రేనా పోనివ్వరేటి? కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్నట్లంత పొద్దుటే సరసానికొచ్చిన ఆత్రగాడెవడు బాబూ' అంటూ లేచి కూర్చుంది.

"బేరంకాదుకానీ బాగానే కిడుతుంది. కడుపుకి తిన్నంత టిపినూ, తాగగలిగినంత కాఫీ" అతను ఆమెని ఊరిస్తున్నట్లే అన్నాడు.

"నువ్వేటీ సెయ్యక్కర్లేదు. నాలుగు మాటలు ఉన్నవే నిజాలే చెప్పి ఓ అమాయకపు ఆడపిల్లకి కళ్లు తెరిపిస్తే చాలు. బాగు చేస్తేచాలు. పది నిముషాలు మాటాడితే సాలు. నీధర్మమా అని ఒక బతుకు భగ్నమూ పాడూ అయిపోకుండా బాగుపడుద్ది దేముడు నీకు మేలు చేస్తాడు"




"కాఫీ టిఫినూ ఎట్టిస్తార్రా. సరే మంచి ఆకలిమీదున్నాను. మొకం తొలుచుకునొచ్చేత్తాను కూచో. మంచి బంగారం నాటి నిద్దర సెడకొట్టావు. నేను తిన్నంతా పెట్టించాలి సుమా. మాట తిరక్కూడదు. బిల్లెక్కువయిందని గునపకూడదు"

పావుగంటకి అతనూ, నేనూ, ఆమె ఆ వీధి చివరి హోటల్లో ఉన్నాం. ఆమెకోసం, మాకోసంకూడా అతను టిఫిన్లు చెప్పాడు.

"ఈ అమ్మాయికేమీ తెలియదు. దురదృష్టవశాత్తూ ఎవరూ లేరు. నిన్న ఆ గోమతిగారు తారసపడి 'నీకాశ్రయమిస్తానూ, చక్కగా చూసుకుంటానూ, నా దగ్గరకొచ్చెయ్' అని అడ్రసు చీటి ఇచ్చారట. మాకేమీ తెలియదావిడ గురించి. నువ్వే చెప్పాలి. నిన్నే నమ్ముతాం. నీ మాటబట్టే నడుచుకుంటాం" అని నావేపు చూశాడు ఔనా అన్నట్లు.

నేను తలపంకించాను.

ఆమె అతణ్ణీ నన్నూ ఒక్కసారి చూసి హటాత్తుగా నవ్వింది. "నవ్వుతావెందుకూ. నేనడిగింది నవ్వులాటకాదు. సీరియస్సు" చిరాకుపడ్డాడు.

"దానిని గోమతిగారు అంటూ గౌరవంగా చెబితేనూ నవ్వొచ్చింది. అదీ తార్పుడుకత్తె. ముండలకంపెనీ ఓనరు. అదిచ్చే ఆశ్రయం ఒకటే... ఆడపిల్లలని ఒంటరివాళ్లని వల వేసి పట్టడమూ ఇంటికి తీసుకురావడమూ, నాల్రోజులు బాగా తిండిపెట్టి గుడ్డఇచ్చి రంగంలోకి దింపడమూ. కొత్త పిట్ట అంటూ దానిమీద సొమ్ముచేసుకోవడమూ. దానికభిమానాలూ ప్రేమలూ కూడానా! అదే మేడిపండు. దాని ముఖంచూస్తే సాత్వికంగా ఎంతో మంచిదానిలా కనిపిస్తుంది. దానికి తోడు అది మహాచక్కగా తియ్యగా తేనెపూసి మాట్లాడగలదు. దాని వృత్తికి కావలసిన ఆ నైపుణ్యం అది బాగా సంపాదించింది. మీరు దానిమాయలో పడి పోకండి. ఎవరికేనా సరే మొదటసారిగా తీసుకొచ్చినప్పుడు మమ్మల్నందరినీ చూపించి వాళ్లయితే నా పనివాళ్లు. కాని నువ్వు మాత్రం అలాకాదు. ఎందుకో నిన్ను చూస్తుంటే చిన్నప్పుడే తప్పిపోయిన నా కూతురు మెదులుతుంది జ్ఞాపకంలో... అంటూ కహానీలు చెబుతూ కౌగలించుకుని కన్నీరు పెడుతుంది. మంచికి లొంగకపోతే తన్నించి లొంగదీస్తుంది. ఏదారయినా చివరకు గోదారికే. ఊ... మరో రెండు టిఫిను తెప్పించు. రకానికొక ప్లేటు చొప్పున.. అవి తినేలోగా ఇంకేమయినా అడిగితే చెప్తాను"

ఆమె కంఠం కొంచెం జీరగా ఉంది. నిద్రలేమితో ఆమె కళ్లు కొంచెం ఎర్రగా ఉన్నాయి.

వ్యభిచారిణులు పగటిపూట ఇంత భయంకరంగా ఉంటారా! అందుకేనా వ్యభిచారం రాత్రి వేళే జరుగుతుంది?

"అదికాదు. నా గురించి గోమతికి ఎలా తెలిసిందంత త్వరగా? " ఈసారి నేనే అడిగాను.

"ఎల్లేరమ్మ కళ్లెప్పుడూ ఎండు చేపలమీదే అన్నట్లు దానిదృష్టెప్పుడూ తన వ్యాపారానికి కొత్త సరుకెక్కడ దొరుకుతుందా అన్నదాన్ని మీదేగా! పైగా అగ్గికి వాయువులా... ఎస్సయ్‌గాడొకడు"

"ఎస్సయ్ ఏమిటి? "

"సబిన్‌స్పెక్టరు. ఏభయ్యేళ్లుంటాయి కానీ పెళ్లెగసనా బుద్ధి దిగసనారకం. ఇంత వయసొచ్చినా ఆడికి మంచి బుద్ధిరాలేదు. గుడినీ గుళ్లోని లింగాన్నీ మింగేరకం.

"...మరో పెసరట్... పెసరట్టు చాలా బాగుంది అల్లం చెట్నీతో"

"ఆ అనామీకి పోలీస్ స్టేషనులో లంచాలు చాలనట్లున్నాయి. ఆశలావూ పీక సన్నమూగాడు. వాడు దీంతో చేతులు కలి

పేడు.

"చేతులేకాదు, కాళ్లూ కలుపుతూనే ఉంటాడు వారానికో పదిరోజులకో ఓపిక చేసుకుని. మగాడికెంత వయసొచ్చినా వాంఛ చావదుకదా? దీని శరీరంలోనూ వ్యాపారంలోనూ కూడా ఎస్సయ్‌కి వాటా.

"గోమతి తిన్ననయిందేంకాదు. ఎదవ బుద్ధి.

"దానికి మొగుడున్నాడు

"సంసారముంది

"పిల్లలున్నారు.

"అయినా తనేమో పతివ్రతలా ఉండాలి. మిగిలిన ఆడాళ్లు దానిలాబం కోసం సెడి పోతూ సేటితనం చెయ్యాల.

"దాని పప్పులు ఎస్సయ్ దగ్గరుడకలేదు.

"నాకు వ్యాపారమూ కావాలి, నీపక్కా కావాలి అనేశాడు.

"ఏటలా జూస్తార్రెరి మొహాలేసుకుని?

"ఏవయసుకాకళ.

"దీనివయసు నలభయ్యాయిదూ, ఆడి వయసు ఏభయ్యా ఈడూ జోడూ.

"వారానికోసారి క్రిష్ణారామా అనుకుంటూ రాంభజనతోపాటు కాంభజనా జేసుకుంటారు.

"నూరుపీనుగులని తిన్న రాబందు ఒక్క గాలివానతో సరన్నట్లు అంతవరకూ నిలుపుకొచ్చిన పాతివ్రత్యమూ సంసారితనమూ ఒక్క ఎస్సయ్‌తో చెల్లిపోయాయి గోమతికి.

"ఆణ్ణి కాదంటే కేసులు; లంచాలు.. ఎన్ని చిక్కులు! వ్యాపారం మూసేసుకోవాలి.

అందుకే ఆడు పిలిచినప్పుడల్లా కుక్కలా పడగ్గదిలోకి పరుగెడుతుంది.

"గొర్రిగోత్రం గొర్రెలోడికి ఎరుక గోమతి గోత్రం నాకేఎరుక.

"పదేళ్ల నుంచుంటున్నాను దీని కంపెనీలో అమ్మ పుట్టిల్లు మేనమామకెరుకే.

"నన్నడిగితే పైకి దానంత మంచిదిగా కనిపించేదీ ఉండదు. లోపల అంత ఇషప్పురుగూ ఉండదు. అది తాడులా కనిపించే పాము. తేనెలా కనిపించే ఇషం.

"చాలా? ఇంకా చెప్పాలా? ఇంకోటి కావాలి?

"నన్నడిగితే ఈ అమ్మాయి ఈ రొంపిలోకి దిగకపోతేనే మంచిదంటాను. అనుబవజ్ఞుల నడిగి చూడమన్నారుగా పెద్దలు? మీరు సరయిన వాళ్లనే అడిగారు.

"ఇంక నేను టిపినూ తినలేను. కాఫీ తాగలేను. కడుపునిండిపోయింది. బిల్లిచ్చేసి వెళ్లండి" అంది లేస్తూ.

నాకూ ఇక తెలుసుకోవాల్సిందేమీ లేదని పించింది ఆమె పేరు తప్ప. నిజానికామె చెప్పిన విషయాలతోనే తప్ప ఆమె పేరు వివరాలతో నాకేం ప్రమేయమని? ప్రయోజనమని?

"నా అసలు పేరు కనకరత్నం. కంపెనీ పేరు మోహిని" అని వెళ్లిపోయిందామె.

మళ్లీ ఇద్దరమూ రోడ్డుమీదకొచ్చి నిలుచున్నాం. మెల్లగా అడిగానతన్ని చూస్తూ.

"మీకు గోమతి గురించీ ఈ కంపెనీ గురించీ ముందే తెలుసా? "

"ఓ... బాగా తెలుసు. నేనప్పుడప్పుడు ఇటు వస్తూంటాన్లే! ఏమిటలా చూస్తావ్? నా భార్య చనిపోయి పదిహేనేళ్లు. మళ్లీ పెళ్లిచేసుకునే పరిస్థితులు కావు. ఎంతయినా నేనూ మనిషినేగా! భార్య ఉండీ వ్యభిచరిస్తే తప్పేమోకాని భార్యలేనివోడికి ఈ వీధే గతి"

"మరి అన్నీ తెలిసీ నన్నెందుకు తీసుకొచ్చారిక్కడికి? "

అతను నవ్వాడు అర్థవంతంగా. "కొన్ని సందర్భాలలో కొన్ని విషయాలు ప్రత్యక్షంగానే తెలుసుకోవడం మంచిది. అప్పటికి




నిన్న సాయంత్రానికి నీకు నా గురించి, గోమతి గురించీ కూడా ఏమీ తెలీదు. కాని ఆవిడ నిన్ను ముందు కలుసుకుని ఊసులాడింది. ఓదార్చింది. అంచేతా ఆవిడ కూడా సాటి ఆడదే కావడంవల్లా నీకావిడ మాటలే నిజమనీ మంచిదనీ అనిపించడం సహజం. పైగా ఆవిడ నా గురించి చెడ్డగా చెప్పి భయపెట్టి వదిలిందికూడా కనక నీకు నేనేం చెప్పినా చేసినా అనుమానం కలిగేటట్లే ఉంటుంది, కానీ నా మీద నమ్మకం కుదరదు. నా మాటమీద గురికుదరదు. అలాటప్పుడు ఆవిడా, ఆవిడ మాటలూ ఎంతవరకూ నమ్మదగినవో నువ్వే తెల్చుకుంటే మంచిదనిపించి నీకు ప్రత్యక్షప్రాణం చూపించాను"

బాగుందనిపించిందతను చెప్పిందంతా అతని మాటలలో చాలా నిజముంది.

"కానీ నాకింకో సందేహముందిప్పుడు" అన్నాను. ఏమిటో చెప్పమన్నట్లు చూశాడతను.

"గాలికి కొట్టుకొచ్చినదాన్ని. నేను మీకు ఏమీకాను. నిన్నటివరకూ నా ముఖమైనా ఎరుగరు. అలాటి దానికోసం మీరెందుకింత శ్రమ తీసుకున్నారు? అన్నం పెట్టారు. ఆశ్రయమిచ్చారు. కట్టుకుందుకు గుడ్డలిచ్చారు"

అతనికి నవ్వడం అలవాటేమో. చిత్రమే! తరచుగా శవాలని చూస్తూంటే మనిషికి మందహాసం అలవాటుగా మిగలడం ఒక విధంగా వింతేమరి.

అతను ఆలోచనలో పడ్డాడు.

"ఎందుకంటే ఏం చెప్పనూ? ఏమో నాకే తెలవదు. నువ్వు ఒక్కర్తివే అనీ... నీకెవరూ లేరనీ... మునిసిపాలిటీ వాళ్లు చెప్పారు. ఆపైన నువ్వు గోమతితో... పోనీ అది నీతో మాట్లాడ్డం కంటపడింది. ఒంటరిగానయినా నువ్వు క్షేమంగా ఉండగలవేమో తప్ప దాని పాలబడితే నీ బతుకు కుక్కలు చింపిన విస్తరే ఔతుందనిపించి నిన్నాదుకోవాలనుకున్నాను. నువ్వూ నేనూ ఏమీకాకపోవచ్చు కాని మనిషీ మనిషీ... మనిషికి మనిషి అలా..." అతను ఆ మాట అనకపోయినా అతని మనసులో మాట మాత్రం మానవత్వమే.

"ఎంతమంచివారు మీరు! నిజమైన మనుషులు"

"సరేకాని ఇప్పుడేం చేస్తావ్. నీ వాలకం చూస్తుంటే చేతిలో పైసా కూడా ఉన్నట్లు లేదు. వంటిమీద బంగారం పిసరయినా లేనట్లుంది"

ఎలా ఉంటుంది? రాత్రి ప్రయాణమని చేతులగాజులు కూడా తీయించేసి పెట్టెలో పెట్టించేశాడు నాన్న. ఆ పెట్టెమో ఏటిపాలైంది. చేతులకు మిగిలినవి మట్టిగాజులే. గాజుగాజులే.

ఏం చెయ్యాలో నాకేమీ తెలియడంలేదు. మీరే చెప్పండి. మీరేం చెబితే అదే చేస్తాను" అన్నాను.

నాకు తెలుసు అది వోడిపోవడమే అని. కాని నేనా పరిస్థితులలో ఏం చెయ్యగలను?

"నీ గురించి కొంచెంచెప్పు"

మా కుటుంబం కథ టూకీగా చెప్పి "ఆ ప్రమాదం జరగకపోతే మేమేవూరు చేరేవారమో? ఎక్కడికనేది కూడా చెప్పలేదు నాన్న, లారీ బయలుదేరాక కూడా ఆయన తీరు అటువంటిది. ఆ ప్రయాణమే నిర్విఘ్నంగా సాగితే నాకు కొద్దికాలంలో పెళ్లయ్యేది" అన్నాను సిగ్గుపడుతూ.

"మీ అత్తవారు, కాబోయే భర్త..."

"ఏ వివరాలూ తెలియవు. చెప్పలేదు. కనుక నాకు వారి ఆశలేనట్లే. ఉండీ లేకపోవడమంటే ఇదేనేమో"

అతను బాగానే అర్థం చేసుకున్నట్లుంది.

"నా గురించి కూడా కాస్త తెలుసుకో నా పేరు రామదాసు. ఏభైదాటి మూడేళ్ల యింది. నా భార్య పదేనేళ్ల కిందట చచ్చిపో యింది. నాకో కొడుకుండేవాడు. ఇప్పుడూ ఉండే ఉంటాడు. ఎక్కడో..."

"అదేమిటి?" ఆశ్చర్యంగా చూశాను. "మీకు తెలియదా?"

"తెలియదు. నేనిప్పుడేమీ చెప్పను. వీలూ అవసరమూ అయితే అప్పుడు చెబుతాను. శవాలొచ్చే వేళయింది. వేగం పోవాలి. నీక భ్యంతరం లేకపోతే నాతోరా. నీకవసరమైన న్నాళ్లూ నాతో ఉండు. నా గురించి నువ్వేమీ సందేహాలూ, భయాలూ పడక్క ర్లేదు. నేను మగవాణ్ణే కాని మంచీచెడూ తెలిసినవాణ్ణి. నన్ను నమ్మి నువ్వు ఆ గుడి సెలో ఉండొచ్చు. నీకిష్టమైతేనే!"

"తాతా!"

అతను నవ్వి రిక్షాని పిలిచాడు.

నాకే సిగ్గేసింది. ఆయన నీలో కూతుర్నో, మనవరాల్నో చూసుకుంటాను లాటి సినిమా డైలాగులు చెప్పలేదు. ఒక మనిషి, అమ్మాయి... అంతే వరసలు పిలుపుల సులువుకేకాని నిజంగా మనసులోంచి రావా లనిలేదుగా? మాటకంటే చేతలు ప్రధానం.

రిక్షా పరుగెడుతూంటే "అయితే ఈ తాతతో ఉండడానికి నువ్విష్టపడ్డట్లే అన్న మాట. సంతోషం ఇక మనమిద్దరమూ ఒకే గుడిసెలో ఉంటాం కనుక ఇక నా కథ చెప్తాను. మా వంశానికేదో శాపమున్న ట్లుంది..." అన్నాడు.

"ఏమిటి?"

"ఐదారు తరాలనుంచి మా వంశంలో అందరికీ ఒక్కడే కొడుకు. మా ముత్తాతకి మా తాత. మా తాతకి మా నాన్న. మా నాన్నకి నేను. నాకు ఒక్కడే కొడుకు"

"మంచిదేగా... దేముడే మీ కుటుంబ నియంత్రణ సంగతి చూసిపెట్టాడు మీకేమీ శ్రమపెట్టకుండా. చిన్న కుటుంబమే చింత లులేని కుటుంబంకదా?"

"మరీ చిన్న కుటుంబం కూడా చింతే. ముఖ్యంగా ఆడవాళ్లకి. ఒక కన్ను కన్నూ కాదు, ఒక బిడ్డ బిడ్డకాదు అనేది నా భార్య. నా అనుమానం అది ఇక పిల్లలు పుట్టరన్న బెంగతోనే చచ్చిపోయిందేమో కాలం తీర కుండానే అని. ఒకవిధంగా అది అదృష్టవం తురాలే" రిక్షా మలుపు తిరుగుతోంది.

"ఎందుకనీ? చావు అదృష్టమేమిటి?"

"మా తాత గాంధీగారి శిష్యుడు. దాదాపు సమవయస్కుడే అయినా నిజానికి మా తాతకంటే గాంధీగారే కొంచెం చిన్న అట"

రిక్షా మలుపు తిరుగుతూ కుదుపు.

"మా తాత పేరు చరిత్రకెక్కిలేదులే"

"సహజమే. తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీల పేర్లు ఆ మహల్‌లో ఎక్కడా చెక్కలేదు. తాజ్‌మహలంటే షాజ హాను మాత్రమే. అలాగే స్వాతంత్ర సమర యోధులూ, గాంధీగారి అనుచరులూ ఎంత మందున్నా చరిత్రపుటలలో కెక్కినవారి సంఖ్య స్వల్పమే"

"తాతా! నువ్వొకసారి యాస, మరోసారి భాష మాట్లాడతావే! ఏం చదివావూ?"

"చెప్పుకోదగ్గ చదువేంకాదులే. అయినా నాకు భాషొచ్చు వృత్తిరీత్యా యాస. ప్రవృ త్తిరీత్యా భాష. ఆc నువ్వు చదువుకు న్నావా?" అడిగాడు.

"సర్టిఫికేట్లు లేవుకానీ.. కొంచెం చదు వొచ్చు బడి చదువుకాదు. ఇంటిచదువు. అమ్మ చదువు. ఆపైన చుట్టూ కొంచెం ప్రపంచం. నేర్చుకోవాలనే ధ్యాస ఉండాలే కాని టీవీనుంచి కూడా మంచి గ్రహించ వచ్చు అలా కూడా కొంత అబ్బింది"

"అమ్మ చదువే అన్నిటికన్నా మిన్న చదువు"





"ఓс... ఆ గాంధీగారి గురించి... మీ తాత గురించి చెబుతూ ఆపావ్"

"ఆ తాత గాంధీగారి సిద్ధాంతాలలో కొన్నింటిని అక్షరాలా అమలు చేసేంతగా జీర్ణం చేసేసుకున్నాడు. ముఖ్యంగా మానవ సేవే మాధవసేవ, పరిశుభ్రతే దైవత్వం. అవి రెండూను. చరఖా వడకడమూ గీత చదవడమూ దినకృత్యంలో భాగాలు. గాంధీగారు మా తాతని తన వూరు వెళ్లి మానవసేవ చేయమన్నాడు. తాత వచ్చేశాడు సబర్మతి ఆశ్రమం విడువలేక విడువలేక... గాంధీగారిని వదిలి రాలేక రాలేక. కాని వారి ఆజ్ఞకదా? ఇష్టాయిష్టాల సంగతి వదిలేసి వచ్చాడు. జనానికి సేవచేసేందుకు మార్గం ఆలోచించాడు. ఈ కాలపు పిల్లవి. ఆనాటి వాళ్ల ఆలోచనలూ అవీ విని నవ్వుకుంటావేమో"

రిక్షా ఆగింది. మేము శ్మశానానికొచ్చేశాం.

శవమేదీ రాలేదు. మాకోసం ఎవరూ నిరీక్షించడంలేదు. ఇద్దరమూ వెళ్లి మర్రి చెట్టు నీడలో కూర్చున్నాం.

"అప్పటికి ఓపాటి పెద్ద వూళ్లల్లో కూడా సెప్టిక్ లిట్రినులుండేవి కావు. అవి మరీ పెద్ద పట్నాలలో తప్ప మిడిమిడి వూళ్లకు వ్యాప్తి చెందలేదు. జనాభాకి మాత్రం లోటు లేదు. అక్కడ పారిశుధ్యం సమస్యగానే ఉండేది.

"గాంధీగారెంత ప్రబోధించినా శ్రమ గౌరవం చాలామందికి అర్థం చేసుకోని అంశం. వృత్తినిబట్టి కులమేర్పడినట్లే వృత్తిని బట్టి మనిషి గౌరవమూ ఆధారపడేది.

"అతి విచిత్రమూ విచారించదగినదీ ఏమిటంటే ఏ పనులూ సేవలూ మనిషి మనుగడకో ఆరోగ్యానికో అత్యవసరమో వాటినవలంబించేవారిని ఇతరులు హేయంగా చూడడం!"

"అంటే? "

"పాకీ పని, వీధులూడ్చే పని... వీటినే తీసుకుంటే ఇవి సక్రమంగా జరగకపోతే వ్యాధులు ప్రబలుతాయి. మనుషుల ఆరోగ్యం చెడుతుంది. జననష్టం సంభవించవచ్చుకదా? "

"ఊс"

"తాత నిజమయిన మానవసేవ ఈ పనులు చేయడంలోనే ఉందని భావించాడు. పాకీ పని చేసేవారు క్రమంగా తగ్గిపోతూ వస్తున్నారప్పటికే ఒకవేపు జనాభా పెరుగుతుంటే. అంత అత్యవసరమైన వృత్తి చేస్తున్నా వారికి కూలి కిట్టేదికాదు. గౌరవం మొదటే శూన్యం. మానవులు విసర్జించిన మలినాలను నెత్తినమోసి సమాజ ఆరోగ్యం కాపాడుతున్నందుకు వారికి లభించే ప్రతిఫలం చాలా అన్యాయంగా ఉండేది. అందుచేతనే వారి సంఖ్య పడిపోతుండడం. ఇది గుర్తించి తానీ వృత్తి చేపట్టాడు తాత, గాంధీగారి ఉవాచను అక్షరాలా ఆచరించాలని.

ఇంట్లోవారినుంచి కొంత ప్రతిఘటన వచ్చింది. కాని మా తాతెవరు? గాంధీగారితో కొన్నాళ్లు కలసి చరించినవాడు. అనుకున్నాడంటే సాధించాడే. ఆయన పాకీ పని చేపట్టాడు. అంతేకాదు తనంటే గౌరవమున్న, అభిమానమున్న అందరూ తననను సరించాలని కుటుంబసభ్యులకి హెచ్చరిక చేశాడు.

ఆయన పెద్దరికం... సౌజన్యం కారణంగా ఆయనంటే కుటుంబమంతటికీ అభిమానమే, గౌరవమే. ఆయనని మరో గాంధీ తాత అనిపిలిచేవారుట. అందరూ ఆయన మాటను పాటించి పాకీ పనిలోకి దూకారు. అలాగే చరఖా వడకడమూ!

మా కుటుంబం ఒక్కసారి పాకీ కుటుంబం అయిపోయింది. గాంధీగారు తలుచుకుంటే కానిదేముంటుంది?

కాని అలా ఓ అయిదారేళ్లు గడిచాక ఆ

ఊరికొక ఆపదొచ్చిపడింది

"ఏమిటి!"

"పారిశుధ్యంలో శవదహనం లేదా ఖననం కూడా అతి ప్రధానమేకదా. శవం కొన్ని గంటల తరవాత కుళ్లి కంపుకొడుతూ అనేక వ్యాధుల వ్యాప్తికి కారణమౌతుంది.

ఈ ఊరి కాటికాపరి పాము కాటుతో హఠాత్తుగా మరణించాడు.

ఆ పనికి ఎవరూ ముందుకి రాలేదు.

కొందరికి భయం... కొందరికయిష్టం...

ఏవో కుంటిసాకులు చెప్పేది కొందరు.

నిజంగానే చాలామందికి శవమంటే దడా, వణుకూ.

తామూ ఎప్పటికో ఒకప్పటికి చచ్చినట్లు చచ్చి శవమయ్యేవాళ్లమే అని మరచిపో తారు కాబోలు.

ఏదయితేనేం, కాటికాపరి పనికి ఎవరూ ముందుకు రాలేదు పెద్దలు బతిమాలినా, బెదిరించినా.

అవతలేమో అప్పుడే రెండు శవాలు ఎప్పుడు తమని బుగ్గిచేసి భూలోక విముక్తి కలిగిస్తారా అని కచ్చలో కందులేపేస్తు న్నాయి.

పంచాయితీలాంటి పురజన సమావేశం ఏం చెయ్యాలా? అని లజుగుజులు పడిపో తూంటే తాను చేస్తానని నిలబడ్డాడు తాత.

అంత పెద్దాయన ఆ పనికి పూనుకోవడం పెద్దలకు సంతోషకరంగా లేదు. కాని గత్యంతరంలేదు.

అంచేత ఈ పులుసుతో ఈ ముద్ద దిగనీ, తరవాత సంగతి తరవాత చూసుకుందాం అని అంగీకరించేశారు.

ఇంట్లో ఆడవాళ్లు పాకీపని, తాతగారు కాటికాపరి పని, నాన్న అటు తాతకీ ఇటు వీరికీ సహాయకుడు.

అన్నట్లు నాది మా తాతగారి పేరే సుమా. అలాగ మాది కాటికాపరుల కుటుంబం కూడా అయింది.

తాతగారు చనిపోయాక ఆ పని నాన్న తీసుకున్నాడు. ఆ కాలమూ, ఆ రోజులూ వేరు. మనుషులకి బతికున్న పెద్దలమీదే కాదు, చనిపోయిన పెద్దలమీద కూడా గౌర వాభిమానాలే. తాతగారి ఆత్మ సంతోషించా లనే నాన్న కాటికాపరితనాన్ని వారసత్వంగా స్వీకరించాడు. అప్పటికీవూరు మునిసిపా లిటీ అయింది. కాటికాపరి అనేది ప్రభుత్వో ద్యోగమయింది. శ్మశానమంటూ నిర్మా ణమూ జరిగింది. అప్పుడు కట్టిందే ఈ శ్మశానం. ఎలా అయితే వీలో నాన్న సల హాలూ, సంప్రదింపులూ తీసుకుని మునిసి పాలిటీవారు కట్టించారు. నాన్న దీనిని నిర్వ హించేవారు. నేనప్పటికి కుర్రాణ్ణి. నాన్నతో ఇక్కడికొచ్చేవాడిని. వెళ్ళకూడదని అమ్మ ఎంత ఆంక్ష విధించినా అల్లరీ, ఆగమూ చేసి నాన్నని బుట్టలో వేసి నేను ఈ శ్మశా నంలో ఆడుకునేవాడిని.

"ఇదీ మంచిదే. రేపు వాడు భయమనేది ఎరగకుండా పనిచేసుకుపోగలడు. చిన్న ప్పుడు చూసినవి మనసుకి మరింత బాగా హత్తుకుంటాయి. తండ్రిపని కొడుకు నేర్చు కుంటేనే మంచిది. 'రానీ' అనేవాడు నాన్న అమ్మతో ఒకవిధంగా మా కుటుంబానికి కాటికాపరిపని కులవృత్తయిపోయింది. అందుకెవరూ చింతించినట్లు కానీ, సిగ్గుపడి నట్లు కానీ నేనెరుగను.

సమాజంలో మెల్లగా తెలియనివీ, కనిపిం చనివీ మార్పులొస్తున్నాయి. వాటిలో కొన్ని మంచి మార్పులున్నాయి. మనిషి చదువు వేపు మొగ్గుతున్నాడు. ప్రభుత్వంవారు విద్యావ్యాప్తికై చేస్తున్న ప్రచారం ధర్మమా అని చదువుకోవాలి, ఉద్యోగం చెయ్యాలి ఇది చాలామందిలో ప్రవేశించింది. నిశ్చయంగా మనిషి విద్యావంతుడు కావడం మంచిదే.





కాని ఇది వేలంవెర్రిలా తయారై వృత్తిప నుల కుటుంబాలవారు కూడా పిల్లలని బళ్లలో వేయసాగారు.

నాలో కొన్ని భయాలూ, సందేహాలూ కలిగేవి బడి వదలగానే బిలబిలమంటూ వందల సంఖ్యలో గేటులోంచి బయటపడే బాలబాలికలని చూస్తూంటే.

"విద్యను చూసి వెరపా!" ఆశ్చర్యం అణ చుకోలేకపోయింది శివాని.

"నన్ను మరోలా అర్థం చేసుకోకు. నేను విద్య విలువను తక్కువ చెయ్యడంలేదు. కించపరచడంలేదు. కాని నాలాగ కూడా ఆలోచించి చూడు. మనిషి దైనందిన జీవితం సుఖంగా గడవాలంటే విద్య ఒక్కటే చాలదు. పనులు కూడా జరగాలి. ఉదాహరణగా పారిశుధ్యపు పనే. ఎంత ఉద్యోగికయినా మరుగుదొడ్డి శుభ్రపరిచేపని అంటూ ఉంటుందికదా? ఉండేందుకిల్లు, కూర్చునేందుకు కుర్చీ రాసుకుందుకు కలం. ఇవన్నీ అవసరంకదా? మరి అవి సిద్ధం చేసిచ్చేదెవరు? సమాజానికి ఆ వృత్తిపనుల వారి అవసరం కూడా ఎంతైనా ఉంది. కాని దానికి ప్రాముఖ్యతా, విలువా, గుర్తింపూ తక్కువైపోసాగాయి. విద్యనేర్చి చేసే ఉద్యో గమే గొప్పదనీ శరీరశ్రమతో చేసే కులవృ త్తులు నీచమయినవనీ అపోహ బయలు దేరి బలపడిపోయింది. నిష్కర్షగా చెప్పా లంటే మానవ సమాజానికి మేధావులెంత అవసరమో మేదరీ, తాపీమేస్త్రీ, మెకానిక్కూ కూడా అంతే అవసరం. ఈ సొదా సోదీ ఎందుకు చెబుతున్నానంటే సమాజంలో వచ్చిన అవలక్షణం నా జీవితాన్నే దెబ్బతీ సింది కనుక. నా గాథలో అదీ ఒక భాగమూ కారణమే. అందుకే తప్ప ఉప న్యాసం ఇవ్వాలని కాదమ్మా"

విభ్రాంతురాలై చూస్తూ ఉండిపోయిం దామె.

మోటుగా వయసుమీరుతూ మోకాళ్ళపైకె గగట్టిన ముతకపంచె, నోట్లో చుట్ట, చేతిలో కర్ర, పెరిగిన జుత్తు, తిలతండుల న్యాయం తలపుకు తెస్తూ నలుపు తెలుపుల మిశ్ర మంలా తెల్లవీ, నల్లవీ వెంట్రుకలు నిండిన గెడ్డాలూ, మీసాలూ. కాటికాపరి వృత్తి. ఒట్టి నాటు సరుకుగా కనిపించే ఈ తాత వెనుక ఇటువంటి ఆలోచనలా? ఇంత చక్కని భాషా! ఇంత స్పష్టమైన భావప్రకటనా! ఇన్ని వినదగినవీ, అనుసరించదగినవీ విష యాలా!

తాతా నీకు జోహార్!

"మనిషి- పుడుతూనే అతని ప్రమేయం లేకుండానే అతనికి తెలిసో తెలియకో మూడు వలయాల ప్రభావంలోకి అడుగుపె డతాడమ్మా"

"ఏమిటవి తాతా? ఏమిటా వల యాలు? " ఎంతో కుతూహలంగా అడి గింది.

"ఒకటి ఆర్థిక వలయం. రెండోది సాంస్కృతిక వలయం. మూడోది రాజకీయ వలయం. సమాజంలో జన్మించి జీవించే మనిషిని ఇవి అనుక్షణమూ ప్రభావితం చేస్తూనే ఉంటాయ్ అతని ప్రవర్తననీ, ఆలో చనలనీ కూడా.

"పెట్టుబడిదారీ విధానం ఉండే అమెరికా వంటి దేశాలలో మనిషికీ, కమ్యూనిజం ఉండిన రష్యాలోని మనిషికీ, ప్రజాస్వామ్యదే శమయిన మనదేశపు మనిషికీ ముగ్గురూ మనుషులే అయినా వాతావరణరీత్యా ఏర్ప డిన స్వల్ప శారీరక వ్యత్యాసాలు తప్పిస్తే తేడా ఎందుకుండాలి అందరూ మనుషులే అయినప్పుడు?

"మరి ఎందుకుంది?

"అంతెందుకూ. ఇల్లు సమాజపు చిన్న రూపమేకదా. మాస్టారింట్లో పుట్టిపెరిగినవా రికి, వ్యాపారస్తుడింట్లో పుట్టి పెరిగినవారికీ, దొంగ ఇంట్లో పుట్టిపెరిగిన వారికీ మధ్య

అంతరం అతిస్పష్టంగా కనిపించెయ్యదూ?

"అందుకే కద ఏ చెట్టు ఆ పూవే పూస్తుం దంటారు.

"అందుకే కదా స్త్రీ కూడా విద్యావంతురా లవ్వాలనీ ఇల్లాలి చదువు ఇంటికంతకీ వెలు గనీ.

"స్త్రీ విద్యావతి అయితే ఆ సంస్కార సౌగంధాలు సంతానానికంతకూ సోకు తాయి. మంచి పౌరులు తయారవుతారు దేశానికి.

"ఎక్కడో నాలాటి దురదృష్టవంతులున్నా వారి సంఖ్య స్వల్పమే" కంఠంలో గద్గదికత.

"ఏమిటి తాతా? ఒక్కసారి భారమైపో యింది నీ గొంతు? "

"వంశవృక్షాన్ని కదిపానుగా. కొడుకు జ్ఞాపకమొచ్చీ ఆఁ... కొన్ని పూలు వాడినా సుగంధమే అన్నట్లు మా తాతగారిలాటి వారు చనిపోయినా వంశాన్నీ, సంసారాలనీ వారి సంస్కార ప్రభావం వదలదు.

"వారి ప్రభావంగానే మా ఇళ్లల్లో ఆడ వాళ్లు చదువుకున్నారు. అయితే ఉద్యోగాలు చేయాలనే ఆశతోకాదు. జ్ఞానం సంపాదిం చుకుందుకే.

"నా గురించి నేనే చెప్పుకోవడం బాగుం డదుకానీ తప్పడంలేదు. తాతగారినుంచీ మా వంశం సమాజసేవ కంకితమయింది. తరం వెనుక తరం పాకీపని చేయడం ద్వారానూ, పారిశుధ్యపు క్రియలు నిర్వర్తిం చడం ద్వారానూ, ఆడవాళ్ళు కాటికాపరితనం నిర్వహిస్తూ, మగాళ్లూ ఇదీ అని చెప్పుకోగల పనులు చేస్తూ వస్తున్నాం. ప్రజలు మమ్మల్ని గుర్తించడం కాదు. మేము ప్రజ లని గుర్తించడం. వారికవసరమైన సేవలం దించడం.

"పారిశుధ్యాన్ని మించిన ప్రజావసరమూ ప్రధాన కర్తవ్యమూ మరేమున్నాయి? గౌర వమంటూ మనవాళ్లు శ్రమగౌరవాన్ని గుర్తించడానికింకా ఎన్ని శతాబ్దాలు పడు తుందో"

"నేనేమీ గుర్తింపుకోసం, గౌరవం కోసం తాపత్రయపడడంలేదు. నాకా చింతేమీ లేదు.

నేనెప్పుడేనా విచారిస్తే- "ఈ సేవావార సత్వం ఇంతటితో, నాతో ఆగిపోతుందేమో అనే. మా వంశానికి సేవక వంశమనిపిం చుకునే సువర్ణావకాశంపోతుందనే"

సేవనే పరమార్థంగా గుర్తిస్తున్న రామ దాసు ఎంత ధన్యజీవి! ఇచ్చుటలో ఉన్న హాయి మరెచ్చటనూ లేనేలేదని ఇందుకే కాబోలన్నారు.

"నా కొడుకు శ్రీధర్ పదోతరగతి పాస య్యేవరకూ బాగానే ఉండేవాడు. అప్పటికి వాడికి పదహారేళ్లు. తెలిసీ తెలియని వయసు. కాని తెలుసుకోవలసిన వయసూ అదే.

అందుకని అబ్బాయికి కర్తవ్యం బోధిద్దా మని కూర్చోబెట్టుకున్నాను.

"పదోతరగతి పాసయ్యావ్. సంతోషం" అంటూ ప్రారంభించాను.

"ఇంటర్‌లో చేరతా నాన్నా. నా క్లాస్‌మే ట్లందరూ అలాగే చేస్తున్నారు" అన్నాడు వాడు. ఆ వయసుకి అంతకంటె ఆలోచనుం డదు. స్నేహితులేం చేస్తే తనూ అదే చెయ్యాలనే అనుకుంటారు. అంతే తప్ప తమ పరిస్థితేమిటి, ఇంటి పరిస్థితేమిటి, వాళ్ల కష్టసుఖాలు తమకేది అనుకూలం ఏది తగినది. అలాటివి ఆలోచించాలని తట్టదు.

"చూడు బాబూ... చదువుకోవడం మంచిదే. కాని అంతకంటె మంచిపని కాక పోయినా అంత మంచిపనీ మరొకటి కూడా ఉంది సుమా!" వాత్సల్యంగానూ, జాలి గానూ నవ్వాను.




"ఏమిటి? " అడిగాడు శ్రీధర్.

"కులవృత్తి. అందుకేకదా- పరవృత్తులెన్నియైనను, కులవృత్తికి సాటిరావు గువ్వల చెన్నా అన్నారు.

"నీకు తెలుసుకదా మన కులవృత్తి కాటి కాపరితనం.

"నిజానికి నేను చిన్నప్పుడు మా నాన్నతో శ్మశానానికి వెళ్ళి ఆయన పనిచేసేతీరు చూస్తూ నేను చేయగలిగిన సాయం చేస్తూండేవాడిని. దానివల్ల నేను స్వతంత్రంగానూ, ఒంటిచేత్తోనూ ఆ పని చేయవలసివచ్చినప్పుడు నాకేమీ కొత్త అనిపించ లేదు. సమస్య ఎదురవలేదు"

వాడు బిక్కచచ్చిపోయాడు. బహుశా వాడి కలలకీ, ఆశలకీ నేను చెబుతున్న మార్గానికీ హస్తిమశకాంతరముండి ఉంటుంది. వాడి ఊహలకి ఊపిరాడకుండా చేసుంటాను.

"నేనాపని చెయ్యను నాన్నా. చదువుకుంటాను. నలుగురు స్నేహితుల్తో చదువుకుంటాను" బింకంగా అన్నాడు- ఇప్పటికీ నన్ను వీడు కాటికాపరి కొడుకురా శవాలని తగలెట్టడమే వీడి ఫాదర్ పని. పీనుగులని కాల్చడమే రేపు వీడు చేసేదీని. జాగ్రత్తరేయ్, బతికున్నవాళ్ళకే అగ్గెట్టగలడు అదాటున అంటూ మాస్టార్లు కూడా వెక్కిరించడమే" అంటున్నప్పుడు వాడి కళ్ళల్లో నీళ్లు.

నేను కోపం పట్టలేకపోయాను.

"ఆ మాస్టర్లు ఎలా గురువులయ్యారో బుద్ధిజ్ఞానం లేకుండా. తండ్రి వృత్తిని బట్టి కొడుకుని హేళన చేయడమా! సంస్కారం లేని ఉపాధ్యాయులు. పిల్లల సున్నితమయిన మనస్తత్వమెరుగని మూర్ఖులు. ఇవాళ ఇలా వెక్కిరించాడు కానీ రేపో ఎల్లుండో ఆయన చావడా, చితికెక్కడా, అగ్గిలో బుగ్గవడా? వెక్కిరించినవాళ్లు వెల్లకిలా పడకమానరు. నువ్వు వాళ్ల మాటలు లెక్కచెయ్యకు"

"కాన్నేను చదువుకుంటాను-" మొండిగా అన్నాడు.

"నేన్నిన్ను చదువుకోవద్దనడం లేదు. ఆ చదువుకునేదేదో ఇంటి దగ్గరే నాకు సాయం చేస్తూనే చదువుకోవచ్చంటున్నాను. మనది గుమాస్తాపనిలా ఇరవైనాలుగ్గంటలూ ఉండదు. ఉన్నప్పుడు పని, లేనప్పుడు తోచి చావనంత తీరుబడి. ఎంతేనా చదువుకోవచ్చు"

"అలాకాదు. నేను కాలేజీలో చేరతాను. కాలేజి లైఫ్ బాగుంటుందట"

నేను చేసిన పొరపాటేమిటో తెలిసి వచ్చింది. "మొక్కయి వంగనిది మానయ్యాక వంగుతుందా" అని ఊరికే అనలేదు. వీడికి చిన్నప్పటినుంచీ పనులు నేర్పకపోవడమే నేను చేసిన పొరపాటు. వీడికి ముద్దుగా చెప్పి లాభంలేదు.

"నిన్ను కాలేజికి పంపడానికి నా దగ్గర డబ్బు లేదు. చేసే ఉద్యోగం ఇచ్చే జీతంలో ఏమీ మిగల్చలేకపోయాను. నువ్వు నాలాగే ఈ ఉద్యోగంలో చేరతావుకదా అని పొదుపు చెయ్యలేదు డబ్బవసరంరాదని"

అది అబద్ధమెంత మాత్రమూ కాదు. జీతమంటేనే ఎంతొచ్చినా చాలనిదని నిర్వచనమన్నారెవరో. కక్కుర్తి పడితే గీతానికే లోటూ ఉండదు నా వృత్తిలో ఈ ఉద్యోగం... పోనీ పని...లో చేరేముందు నాన్న చనిపోయాడని తెలిసి మరో వూరి కాటికాపరి అయిన దూరపు బంధువు ఒకాయన వచ్చాడు. నాన్న చనిపోయినందుకు పరామర్శచేసి "నువ్వేనా మీ నాన్న జాగాలో కాబోయే కాటికాపరివి? " అని అడిగాడు.

నేను ఔనన్నాను.

అతను ఇంటిని ఎగాదిగా ఆ మూలా ఈ మూలా చూసి "ఏమిటి? ఇల్లేటిలా బీసిగుంది? సామాన్లే లేవేటి? " అన్నాడు ఆశ్చర్యపడిపోతూ.





"మా నాన్న జీవితవిధానంలో ఆడంబరానికీ, సంపద చేసుకుందుకూ తావులేదు. అయినా ఆయనకందే జీతమేపాటిది?" అన్నాను నేను.

"సర్లే. మీ నాన్న తరమెల్లిపోయి నీదొచ్చేసింది. నువ్వేనా బాగుపడు. ఈ వృత్తిలో నాల్డబ్బుల్జేసుకునే తోవల్జూపుతాను. మీ నాన్నలా ఎఱ్రిబాగులోళ్లా డబ్బులు సంపాదించకుండా ఉండకు. మన వృత్తిలో అంత వీజీగా మరెక్కడా సంపాదించలేం"

డాక్టర్లు మనిషి జబ్బుమీద దెబ్బకొడితే మనం మనిషి సావుమీనా, సెంటిమెంటు మీనా కొట్టగలం.

"శవం కాలేవరకూ వాళ్లకొకటే ఆత్రుత, ఆరాటమూ. దాన్ని మనమెన్ని విధాల సొమ్ముజేసుకోగలమో సెబ్తానినుకో

"కట్టెల కాంట్రాక్టూ, మంగలి కాంట్రాక్టూ మనమే దీసుకుంటే అటు కట్టెలోడి దగ్గరా ఇటు శవమోళ్ల దగ్గరా డబల్ శాన్సు కొట్టేయొచ్చు

"అలాగే... శ్మశానం మంగలున్నాడని మన చెప్పుచేతల్లోని వోణ్ణి ముందుకు దోస్తే వాడి ద్వారా ఎక్కువ లాగించి తర వాతాడి దగ్గర వాటా కొట్టొచ్చు

"శవం కులాన్ని బట్టి కట్టెలంటుకోవడంలేదంటూ ఆవు నెయ్యో, కిరసనాయిలో... తేనో మనింటికేదవసరమైతే అదట్టుకురమ్మని అదార్టీ చూబించొచ్చు

"శవం కాలాక మన ముకం జూడ్రు కాని అంతవరకూ మనమేం చెప్పినా చేస్తారు చెప్పుకింద తేలులా.

"శ్మశానం మన రాజ్జం. అక్కడ పవరంతా మందే. కర్పూరంలాటివి మనకక్కర్లేకపోతే పక్కనెట్టేసి కొట్లకమ్మేయొచ్చు

"కాల్చడానికిచ్చే శ్మశానం ఫీజు మునిసిపాలీటికి పోతది నా కష్టానికేటయినా ఇమ్మంటూ హుండీలో డబ్బు వేసినా దక్షిణ పళ్లెం చాపే కోవెల బ్రామ్మల్లా మనమూ కొంత కొట్టొచ్చు

"సీకటడినా శవం కాలడం అవదు. సీకటడ్డాక శవమోళ్లింటికెళ్లి కట్టెలు చాల్లేదు, డబ్బులివ్వండి. కొని పూర్తిగ కాలుస్తా అని అడిగితే సచ్చినట్లిస్తారు.

"సెంటిమేంటు.

"శవం సగం సగం కాలితే వాళ్లకే పాపం చుట్టుకుంటదో అని భయం.

"శ్మశానపోళ్లమైన మనమూ సినిమావోళ్లలా సెంటిమెంటుమీద దెబ్బకొట్టి జనాల్నుంచి డబ్బులాడికేసుకోవాలి.

"పోస్టుమార్టమ్ అని చెప్పి శవాల్ని కోసేవాళ్లనీ, శవాల్ని కాల్చేవాళ్లనీ ఏ ప్రొబిసనూ అడ్డదు. సారా తాగొద్దనదు. అలా అంటే పన్లాగిపోతాయి. ఈ రెండూ మందులేందే ముందుకి సాగవు కాక సాగవు. అదందరికీ తెలిసిందే. ఇలా శవంమీద చాలా విధాలుగా డబ్బులేరుకోవచ్చు

"నేను నీకు కొన్ని చెప్పాను. నువ్వు పన్లో అనుభవం సంపాదించాక నీ మార్గాలు నువ్వు కనిపెట్టుకోగలవు. ఒకటి మాత్రం తెలుసుకో ఒకేరియా కొకటే కోర్టులాగే ఒకేరియాకొకటే శ్మశానం. ఓ ఆస్పిటలు కాదని మరో ఆస్పిటాలుకి పట్టుకుపోవచ్చు రోగిని. కాని ఒక శవాన్ని ఒక శ్మశానం కాదని మరో శ్మశానికట్టుకుపోవడం జరిగేపని కాదు. ఈ శ్మశానంకి మనమే సర్వాధికారులమీ, చక్రవర్తులమీ. అయితే మన ప్రతాపమంతా శవం కాలీవరకే. అది బూడిదయ్యాక మనయిలువా బూడిదే. కాటికాపరిని కన్నెత్తి కూడా చూడ్రెవరూ

జాగర్తగా యిన్నావా నేం జెప్పినవన్నీ?" అడిగాడతగాడు.

"విన్నాను. నేనేవేవి చేయకూడదో తెలిసింది. నిజానికి నేను ఈ మాటలు వినకూడదు. ఎందుకంటే చెడు కనకు, చెడు

వినకు, చెడు అనకు. అని గాంధీగారనేవా రని మా నాన్న అనేవాడు. కాని చెడు తెలుసుకోకపోతే తెలియక అది చేసేస్తానేమో అని. ముందు జాగ్రత్తకి విన్నాను. ఇవన్నీ ఎట్టి పరిస్థితులలోనూ ఆచరింపదగనివని గుర్తుంచుకుంటాను" అన్నాను.

అతను నా పక్కనే తుపుక్కున ఉమ్మేసి వెళ్ళిపోయాడు.

నేను నా వృత్తిలో నాకు తెలిసీ ఏ అవినీతికీ, లంచానికీ పాల్పడలేదు. జీతంతోనే సరిపెట్టుకుంటూ వొస్తున్నాను. నా దగ్గర నిల్వలెలా ఉంటాయి?

అదే చెప్పాను అబ్బాయికి: నిజమే చెప్పాను.

అంతే! శ్రీధర్ నావేపొక్కసారి అదోలా చూసి "నేను చచ్చినా జీవితంలో కాటికాపరిని మాత్రం కాను... కాను... కాను..." అంటూ అరుస్తూ కేటిల్ బార్ వొదిలిన మట్టిగుండులా రివ్వున దూసుకుపోయాడెక్కడికో.

"వాడే వొస్తాడు ఆకలేస్తే. అనుకున్నాను. కాని వాడు రాలేదు నాటికీ నేటికీ కూడా.

"ఉన్నదే ఒక్కపిల్లడు. వాడేమో దేశాలు పట్టిపోయాడు. ఇక తనకి బిడ్డలు కలగరు. ఈ బెంగతో ఆవిడ మంచం పట్టేసింది. మూడు నెలలలో మరణమూ తెచ్చుకుంది.

"మగవాడికి- నడివయసులో భార్య మరణంకంటె మరొక శిక్ష ఉండదు. ఎన్నిరకాల బాధలు ఒక్కసారి చుట్టుముడతాయో ఒక్కసారి కరెంటుపోగానే దోమలు ఝుయ్యిన ముసురుకున్నట్లు.

"తొలిబాధ వొంటరితనం.

"రెండవది వంట.

"ఎవరిపనులు వారే చేసుకోవాలి సాధ్యమైనంతవరకూ. అనే గాంధీగారి సిద్ధాంతాన్ని పుణికిపుచ్చుకున్న తాతగారికి వారసుడనయినా వంట మాత్రం అలవరచుకోలేక పోయాను. నేను చెయ్యి కాల్చుకుందుకు ఇల్లాలు అంగీకరించకపోవడమూ, సహకరించి నేర్పకపోవడమూ ముఖ్యకారణమనుకుంటాను.

"శివానీ! తాతా అని పిలిచావు నన్ను. మన మధ్య ఎంత వయోభేదమున్నా నేను మగవాడినే, నువ్వాడ పిల్లవే. కొన్ని విషయాలు చెప్పుకుందుకు ఏ ఇద్దరి మధ్యయినా ఆడమగల తేడా ఉంటే... నిజానికి నాకు నా సొదచెప్పుకోవడం బాగానే ఉందనుకో"

"ఫరవాలేదు తాతా! నువ్వు ఎలాటి విషయమైనా సభ్యమయిన భాషలో సున్నితంగా చెప్పగలవు. ఆ విశ్వాసం ఏర్పడింది. నేను నీకేం చేయగలనో, ఏం చేయలేనో కనీసం నీకు తృప్తి కలిగించేలా కథయినా వినగలిగితే సంతోషమే. నీ బాధ కథ మధ్యలో ఆపడంలో కలిగే బాధ నేనూహించగలను. అర్థం చేసుకోగలను"

"మనిషి తినడంకోసం బతకడం తప్పే. కాని బతకడంకోసం తినే తిండయినా తినదగినదిగా లేకపోతే ఎంత కష్టమో అనుభవంమీద తెలుసుకున్నాను. వంట చేతకాక హోటల్లో తినబోయాను ఒక్కనెల. ఆహారం మీదా, జీవితంమీదా కూడా విరక్తి కలిగేసింది. నోరు చచ్చిపోయింది. దానికితోడు గోరుచుట్టుమీద రోకటిపోటులా అద్దె ఇల్లు ఖాళీ చేసెయ్యమన్నారు"

"స్వంత ఇల్లు కాదూ మీది?"

"ముత్తాతల దగ్గరనుంచీ మడివాళ్లమాయె. ఇళ్లూ ఆస్తులూ ఎలా అమరుతాయి? జీతంలో అప్పు చెయ్యకుండా బతగ్గలిగితే అదే బ్రహ్మప్రళయం"

"ఎందుకు ఖాళీ చేసెయ్యమన్నారూ? అద్దె సరిగా చెల్లించలేదా? పెంచమన్నారా?"

"అవేవీ కావు. అన్నీ దగ్గర దగ్గరగా కలిసిపోయినట్లుండే ఇళ్లు. పేదలవాడ అలాగే




కదా ఉండేది? ఆ ఇళ్లనిండా ఆడవాళ్లు. నన్ను మళ్లీ పెళ్లి చేసుకోమన్నారు మరీ వయసు ముదిరిపోలేదని. నాకూ ఒంటరి తనం కష్టంగానే ఉంది. ఆ పిచ్చెక్కినట్టున్న స్థితిలోనే మతిస్థిమితం చెడినట్లున్న పరిస్థితి లోనే నేను వ్యభిచారులని ఆశ్రయించాను. నా మనసులోనూ మళ్ళీ పెళ్లి చేసుకోవాలనే ఉంది, అంతరంగపు అడుగు పొరలలో మా వాళ్లలో మారుమనువులు నిషిద్ధమూ కాదు స్త్రీ పురుషులకు ఏవయసులో అయినా"

"మరి ఇకనేం? "

"మళ్లీ పెళ్లంటే ఇంట్లోకీ, సంసారంలోకి కొత్త మనిషి. నేనయితే ఎలాటి స్త్రీనయినా భార్యగా గ్రహించనూగలను, భరించనూగ లను. కాని నా కొడుకు? వాడికామె అమ్మగా నచ్చాలి. లేకపోతే ఎన్నో సమస్య లుత్పన్నమవుతాయి. అందుకని వాడొస్తే తప్ప ద్వితీయం గురించి ఏమీ చెప్పలేన న్నాను. దాంతో వాళ్ల అసలు రంగులు బయటపడ్డాయి. కాటికాపరి తమ మధ్య ఉండకూడదు, శుభం కాదని ముఖంమీదే చెప్పేశారు. అందులోనూ పెళ్ళాం బిడ్డలు లేని ఒంటరి కాటికాపరి గృహస్తుల మధ్య అసలుండకూడదట. అందుకని నన్ను తరి మేశారు- ఇంటి యజమానిని లొంగదీసు కుని. అతని అసలుద్దేశం ఏమైనా వాడలోని ఆడవాళ్ల వొత్తిడికి తలొగ్గాడు"

"మరి అన్నాళ్లెలా ఉండనిచ్చారూ? "

"ఆ పరిస్థితులు వేరు. ఇంట్లో ఆడవాళ్లుం డేవారు. వాళ్ల నోరు మంచిది. ప్రవర్తన మంచిది. అందుచేత వాళ్లని కాదనలేక మమ్మల్నుండనిచ్చారేమో.

"కాని... కాటికాపరితో ఇరుగు పొరుగుగా ఉండడం ఎవరికీ ఇష్టముండదు. ఇదేమన వాళ్ల బలహీనత. గురువింద గింజ సామెత కచ్చంగా సరిపోతారు చాలామంది.

"అగ్రకులాలవాళ్లు తమనణగ దొక్కేస్తు న్నారనీ, చిన్నచూపు చూస్తున్నారనీ గోల చేసే నిమ్నజాతులవారికే ఒకరంటే ఒకరికి పడదు. మాలమాదిగలు ఒకరింట ఒకరు నీళ్లు తాగరు, అన్నం తినరు. ఆ రెండు కులాలలోనూ ఎక్కువ తక్కువలు! అలాగే శ్రమ గౌరవంలేదో అని గోల చేసేవాళ్లలోనే ఒకరి వృత్తిపట్ల ఇంకొకరికి అసహ్యమూ, చిన్నచూపూ. మళ్ళీ వీళ్లే ఇంకొకరిమీద ఫిర్యాదులు.

"సరే... కారణాలేవైతే ఏం, నేనా ఇల్లు ఖాళీ చేయవలసివచ్చింది. ఇంటికంటె గుడి పదిలం అని ఊరికే అనలేదు. వీధివారు తరిమేసినా ఆఫీసువారు దయతో నాకిక్క డొక ఇదే, ఈ షెడ్డు వేయించిపెట్టారు. తరువాత నేనే మెల్లమెల్లగా కొన్ని హంగులు చేర్చాను.

"ఇంతవరకూ మా అబ్బాయి తిరిగిరా లేదు. అందుచేత నా ఒంటరిజీవితం అలాగే సాగుతోంది. ఏభైమూడేళ్లు నిండిన ఈ వయసులో ఇప్పుడూ నాకు సంసారం కావాలి. కాని ఇల్లాలు కాదు. నా కొడుకూ కోడలూ వాళ్ళ సంసారం"

"ఏభైమూడేళ్ళా నీకు తాతా? అంత వయసున్నట్లు కనపడవే"

"కాయశరీరం. ఆ పైన శ్రమతో కూడిన జీవితం. అంచేత వయసుకి సులభంగా లోబడదు. తరువాత స్వయంపాకం. ఎవరి వంట వాళ్లకి బలమివ్వదు" నవ్వాడు.

"పోనీలే నిన్ను తాతా అనడానికి ఒప్పుకు న్నావు కనుక, నీ రుణం తీర్చుకుందుకు శాయశక్తులా ప్రయత్నిస్తాను"

"నేను చుట్ట కాల్చుకుంటాను. వాసన, పొగ పడవేమో నీకు. లోపలికెళ్ళిపో చాలా సేపయి చుట్ట కాల్చక నోరు పీకుతోంది.

"ఎందుకు. కాల్చుకోలెద్దూ నాకు సిగరెట్ పొగ భరించడం అలవాటే. నాన్న ఇంట్లో ఉంటే చిన్న సైజు పొగగొట్టమే"

"ఎందుకు కాల్చుకోలేదంటే మొదటిది కథ చెప్పుకుంటున్న ఉత్సాహం. చుట్ట అంటిస్తే పీలుస్తోంటే కథ కడ్డం పడుతుంటుంది. రెండోది సాధారణంగా ఆడవాళ్లకి చుట్ట పొగపడదు. షోకుగా ఉండే సిగరెట్ పొగ కొందరికి పడవొచ్చు" అంటూనే చుట్ట అంటించేశాడు. ఒక నిముషం చుట్టలో లీనమైపోయాడు చుట్టూ ప్రపంచాన్ని మరచి.

నేనలాగే కూర్చున్నాను. మర్రిచెట్టు నీడ మహా హాయిగా ఉంది. తాత కన్నులర మోడ్పు చేసుకుని ధూమపానాస్వాదన చేస్తున్నాడు. చల్లగా గాలి వీస్తోంది.

అదేమిటో ఊళ్లో వేడి. శ్మశానంలో చల్లదనం.

అక్కడ గోల ఇక్కడ ప్రశాంతత. ఆత్మలు నిద్రపోతుంటాయని కాబోలు. నిజంగా ఆత్మలుంటాయా? చూడాలి, ఇక ఎలాగూ శ్మశానంలోనేకదా ఉండేది?

"తాతా!"

"ఏమిటి? "

"నువ్వొకటి గమనించావా? "

"ఏమిటి? "

"మనిద్దరి బతుకు కథలలోనూ ఒక సామ్యముంది"

"అబ్బే... నా కలా అనిపించలేదు. ఎలాగో చెప్పు పోనీ"

"కమ్యూనికేషన్ గాప్... భావప్రకటనా లోపం. దానికారణంగానే మన బతుకులిలా అయ్యాయని నా అనుమానం. మా నాన్న చెడ్డవాడు కాదు. మంచివాడే. కాని ముందుగా ఏదీ చెప్పని తత్వం. అలాకాక ఆ పెళ్లివారి వివరాలిచ్చి ఉంటే, చెప్పివుంటే నేను వాళ్ళ వద్దకు పోయి ఉందును. తరువాతేం జరిగినా మానినా నేను నీకిలా లంపటంలా తగులుకునేదాన్ని కాను.

"అలాగే మీ శ్రీధర్. నువ్వేమో కులవిద్య కుడిచెయ్యి అంతకాకపోయినా ఎడమచెయ్యి పాటి విలువేనా చెయ్యకపోదనీ, దానిని నరికేసుకున్నా, అంగవైకల్యమే అవుతుందనీ చెప్పబోయావు మీ అబ్బాయికి. అతనికది అర్థం కాలేదు. పోనీ తన మనసులోని మాట, ఆ అయిష్టం సంగతి కుండబద్దలు కొట్టినట్లు చెప్తే నువ్వే నీ ఉద్దేశం మార్చుకునేవాడివి. కొడుకు ఇల్లు వదిలిపోవడం భార్య మరణం ఈ అనర్థాలేవీ సంభవించేవే కావు"

"ఔను" అన్నాడు చుట్ట నుసి విదుల్చుతూ.

అప్పటికి వేళ తక్కువేమీ కాలేదు. నేను గుడిసెలోకి నడిచాను. ఎంతయినా ఆడదాన్ని. నేనంటూ ఒకింట్లోకి, మరో స్త్రీ లేని ఇంట్లోకి వచ్చినప్పుడు ఆ ఇంట్లో వంట బాధ్యత నాదే ఔతుందనే జ్ఞానం నాది.

నూతి దగ్గరనుంచి నీళ్లు పట్టితెచ్చి పొయ్యిమీద ఎసరు పడేశాను. అది ఉడికేలోగా ముందుగది పరికించసాగాను.

ఆ ట్రంకు పెట్టెలో ఏముందా అని చూస్తే పుస్తకాలు! గాంధీమహాత్ముని ఆత్మకథ. భగవద్గీత టీకాటిప్పణులతో... వీరేశలింగం జీవిత చరిత్ర. వివేకానందుని ఉపన్యాసాలు. అలాటి ఉద్గ్రంథాలు! తాత చదివినవీ చదివేవీ కాబోలు.

నా దృష్టిలో అతను ఒక్కసారి మరింత ఎత్తుకెదిగిపోయాడు అవి చూడగానే.

ఇల్లు చూసి యిల్లాలిని చెప్పినట్లే- పుస్తకాలు చూసి పురుషుణ్ణి చెప్పవచ్చునేమో. రామదాసు తాతవంశమే ఘనమైనది. ప్రజలకు సేవచేసేందుకు ఆ వంశం పదవులని కోరలేదు, సరిగదా పాకీపనిని స్వీకరించారు. అదీ అసలుసిసలయిన సేవంటే.

మరి యిప్పుడో? ప్రజాసేవంటే పదవులే. రామదాసు వంశం చదువుకున్నదే కాని సేవా వృత్తినే... ఉంఛ వృత్తినే కావాలని





చేపట్టారు. మానవ సేవకులు వీరుకాక మరెవరు? నిజమయిన గాంధేయవాదులు వీరుకాక మరెవరు? ఇప్పటికీ చరఖామీద తాను తీసిన నూలునే బట్టగా నేయించి కట్టుకుంటాడుట! అదిగో ఆ మూల చరఖా! గాంధీ! నువ్వు యిక్కడ మాత్రం చచ్చిపో లేదు సుమా; గొప్పవాళ్ళూ రాజకీయనాయ కులూ నిన్నెన్నివిధాల ఎన్నెన్నిసార్లు హత్య చేస్తున్నా.

రామదాసుకి కులవృత్తులంటే గౌరవం. అలాగని విద్య విలువను తక్కువ చేయడు. ప్రతి మనిషికీ విద్య ఉండాలి. కాని అంద రికీ కాక కొందరికే అది ఉపాధి కావాలం టాడు.

నిజానికి అదే సరయిన దృక్పథం. వాస్త విక దృక్పథం కూడా.

ఇవాళ చదువుకున్న నిరుద్యోగుల సంఖ్య మరీ పెరిగిపోతూందేడాదేడాదికీ! ఆ సమస్య ఒకవేపున అలా ఉంటే మరోవేపు కొన్ని రకాల పనులకు అసలు మనుషులు దొరకడంలేదు. శ్రమగౌరవం ఎరుగక. ఆ పనులన్నీ పరువు తక్కువని భావించి ప్రతి వాళ్ళూ గుమాస్తా చదువులకెగబడడంతో అక్కడ విపరీతమైన పోటీ. కుర్చీలో కూర్చుని చేసేదే గొప్ప ఉద్యోగమని మన అపోహ. ఆ బానిస గుమాస్తా గిరినే కౌగ లించుకుంటాం తప్ప కష్టపడి స్వతంత్రంగా ఏదో ఒక పనిచేయడంలోని ఆనందాన్నీ గౌరవాన్నీ గుర్తించలేకపోతున్నాం. అవసరా నికి మించిన విద్యావంతులూ, అవసరానికి సరిపడని కార్మికులూ. ఇవి కాదూ నేడు చాలామందికి చాలా విషయాలు సమస్య లుగా మారడానికి కారణం? అసలే అధిక జనాభా అనే రుగ్మతతో పీడించబడుతున్న దేశంలో నిరుద్యోగ రక్కసి విలయతాం డవం చేసే దేశంలో ఉద్యోగాలూ పనులూ సరయిన నిష్పత్తిలో పంచుకోబడకపోతే మరింత అనర్థంకాదూ?

తాత ఉద్దేశాలివే... సూటిగానూ స్పష్టం గానూ చెప్పకపోయినా.

తాతా! నీకు నా జోహారు. గాంధీతాతకు వారసుడా! నీకు మళ్ళీ నా జోహార్లు.

నాకిప్పుడెంతో ధీమాగా ఉంది. నీ నీడలో... ప్రాపకంలో. నేను మనిషిని కాగలిగేందుకు ప్రయత్నిస్తాను.



ఉదయం లేవడం... నూతినుంచి నీళ్ల తేవడం.

కుటీరం శుభ్రంచేసి టీ కాచడం.

తాత భగవద్గీత చదివి చెబుతూంటే వినడం.

తరువాత వంట చెయ్యడం.

ఇదీ నా దినచర్య. ఏదయినా శవమొస్తే- తాతకి సాయంగా వెళ్ళి చేతనయినవి చేయ బోతే తాత వొద్దనేవాడు.

"ఆడపిల్లవని కాదుకాని. నీకెందుకూ ఇలాటి పనులు? నేను చేయగలను. ఇంకా అంత ముసిలాడినయిపోలేదులే" అనేవాడు.

"నీకెంత సాయపడగలిగితే అంతా చేయ డంలోనే నాకానందం. నీ రుణం కొంతేనా తీర్చుకుంటున్నానన్న తృప్తి. శవదహనం కేవలమూ పురుషుల పనే అనీ స్త్రీలకు నిషి

ద్ధమని భావించవు కదా? "

"అలా ఎంతమాత్రమూ భావించను. కొందరు కుడిచేతితో మాత్రమే చేయగలిగిన పనులను మరికొందరు ఎడమచేత్తో చేస్తారు. కుడీ ఎడమలనేవి అలవాటువల్ల వొచ్చేవి. పనుల పంపకానికై ఆ తేడా. అలాగే ఆడ, మగల మధ్య పనుల పంపకమూను. పిల్లణ్ణి కనడమనేదొక్కటి తప్పితే మరే పనీ ఆడదీ కాదు మగపనీకాదు. ఎవరేనా చేయొచ్చు ఆమధ్య పేపర్లో చూడలేదూ? స్త్రీలు పురోహితులుగా, కాటికాపరులుగా పనులు చేపట్టారు. రాజస్థాన్‌లోనో, ఉత్తర ప్రదేశ్‌లోనో అనుకుంటాను. నన్నడిగితే అది శుభారంభమే" అన్నాడు తాత.

"ఇకనేం? - తాతా! నీ మనసులో ఎటూ ఒక చింత ఉంది గదా..."

"ఏమిటీ, నా మనసులోది? నాకు తెలియనిదీ, నీకు తెలిసినదీ?." నవ్వాడు.

"నీ కోరిక... కాటికాపరి పనిని నీ వారసత్వంగా నీ కొడుకుకందించాలని. కాని అది నెరవేరేటట్లు కనిపించటంలేదుగా"



"అంటే... నేను చనిపోయేలోగా నా కొడుకు రాడా? అయ్యో... బాలవాక్కు, బ్రహ్మవాక్కంటారు. దేముడు నీతోటి అలా పలికించాడంటే... ఏదో అంతరార్థముండే ఉంటుంది"

"అదికాదు. శ్రీధర్ తిరిగిరాడని నా ఉద్దేశం ఎంత మాత్రమూ కాదు. తల్లితండ్రులు తమ బిడ్డలకోసం పడే తపనలో పిల్లలు వారికోసం పదోవంతయినా పడరా! కొంచెం ఆలస్యం అయినా అతను నిన్ను వెదుక్కుంటూ వొచ్చితీరతాడు. అయితే... అతను తిరిగి వొచ్చేనాటికి మీవద్ద కొచ్చేసరికి ఎంత గొప్పవాడయి ఉంటాడో మరి అప్పుడతను మీ వారసత్వం తీసుకోలేడుగా? తనకు ఇష్టంలేని ఈ పని చేయలేడుగా? అలాగని మీ వారసత్వం పోకూడదాయె! అందుకని అది నేను తీసుకుంటాను. మీపేరు నిలుపుతాను. ఇప్పటినుంచే యీ పనులు నేర్చుకుంటూ ఉంటే నాకూ సులభమౌతుంది కదా. రేపు మీ వారసత్వంగా కాటికాపరితనం స్వీకరించేందుకు? అందుకూ... నువ్వు నాకన్నీ నేర్పెయ్యాలి తొందరగా"

"శ్రీధర్... నా కొడుకు తిరిగొస్తాడు. గొప్పవాడై వొస్తాడు. ఎంత తియ్యని మాట చెప్పావు! అమ్మా! శివానీ ఉండు. మిఠాయి తెస్తాను. నోరు తీపి చేసుకుందాం" అని నేను ఆగమని పిలుస్తున్నా వినకుండా వెళ్ళిపోయాడు.

పదినిముషాలలో మిఠాయితో తిరిగొచ్చి నాకు తాను తినిపించి, నాచేత తాను తినిపించుకుని, "అంతా బాగుంది కానీ... నువ్వు కాటికాపరివి కావడం" అని నసిగాడు.

ఈసారి నేను నవ్వాను.

"తాతా! నా నొసటి లిఖితం అలాగే ఉందనిపిస్తూంది నాకు యింతవరకూ జరిగింది చూస్తూంటే. ఈ ప్రాంతంలో భర్త లేదా తల్లితండ్రుల శవంతోనైనా సరే, శ్మశానంలో అడుగుపెట్టేందుకు అర్హత, అనుమతి లేని ఆడదాన్నయి కూడా విపరీత పరిస్థితులలో శ్మశానంలో అడుగుపెట్టాను. తల్లిదండ్రుల చితికి కొరివి కూడా పెట్టాను. దహన సంస్కారాలు చేశానీ ఆడ చేతులతోనే! మా అమ్మ, మా నాన్న ఏరికోరి నాకు శివాని అని నామకరణం చేశారు. నా ఉద్దేశం వారు నిమిత్తమాత్రులే అనీ, దేముడే నాకా పేరు పెట్టించాడనీ. శివుడి స్థావరం శ్మశానమే కదా? అతని పేరు పుణికిపుచ్చుకున్న నేనూ శ్మశానంలోనే ఉంటానని అన్యాపదేశమేమో. తాతా! మనకిష్టమున్నా లేకపోయినా విధిని మార్చలేం కదా? కానున్నది కాక మానదు. హేరామ్!" అంటూ అర్థవంతంగా చూశాను తాతవేపు.

ఆయన నవ్వేశాడు.

ఆ తరవాత నాకు దహనకాండ నేర్పడంలో తాత ఏమాత్రమూ తాత్సారం చేయలేదు. ఒక్కొక్కపుడు శవం దహించబడ్డాక... చితివద్దనే వేదాంత పాఠం చెప్పేవాడు.

"చూడు శివానీ! ఏ మానవుడి జీవితానికయినా చిట్టచివరి అడుగు ఇదే. అంతమూ ఆదీలేని కాలవాహినిలో మానవ జీవిత కాలం బుద్బుదప్రాయమే. ఎనభయ్యో నూరో సంవత్సరాలంటే మనకి దీర్ఘంగా కనిపిస్తుంది కాని కోట్ల కొద్దీ సంవత్సరాల కాలంతో పోలిస్తే అదెంత?

"ఈ బుడగనే మనం సత్యమూ శాశ్వతమూ స్థిరమూ అని భ్రమపడి ఎన్నెన్నో ప్రలోభాలకు లోనవుతూ ఎన్నో దుష్కార్యాలు చేస్తాం. ఎంత ఐశ్వర్యమైనా, పేరుప్రఖ్యాతులయినా, ప్రతిభయినా, రాగ ద్వేషాలయినా, అనురాగ విరాగాలయినా, అధికార దర్పమయినా ఆ కొనవూపిరివరకే




"ఒకసారి హంస ఎగిరిపోయి దేహం వొట్టి కట్టె అయినప్పుడింకేమీ ఉండదు. ఇంత చిన్న జీవితంకోసం మనిషికెంతో తాపత్రయం! అదే సృష్టివిచిత్రం. మృత్యుభయంతో అయినా చచ్చినట్లు బతుకుతుంది జీవి. అయితే- ఈ జీవితం వ్యర్థమనుకోకు. ఇది రెండంచుల కత్తి. సృష్టిలో సౌందర్యం, సౌజన్యం... సౌఖ్యం... సుహృద్భావం వంటి సుగాణాలెన్నో ఉన్నాయి. అందుకుందుకు చిత్తశుద్ధితో ప్రయత్నిస్తే అవే లభిస్తాయి. మంచితోనయినా చెడుతోఅయినా ఎలాగేనా మనిషి బతికే జీవితపరిమాణం అంతే.

"అయినా ఏ బతుకు ప్రభావం దానికి ఉంది. మరణయాతన, మరణవేదన అనే మాటలు విని ఉంటావు. మనిషి చనిపోయే చివరి క్షణాలలో ఒక్కసారి గతమూ దానిలో తాను చేసిన మంచి చెడులూ అన్నీ అతని మనోనేత్రం ముందు మెదులుతాయి. చేసింది చెడే ఎక్కువైతే అది అతని అంతరాత్మని నిలదీస్తుంది. అతనిలో పాపభీతి... నరకంలాటివి మెదడులో మెదులుతాయి. విపరీతమైన భయం... నిజానికానరకం చాలు అతను భూమ్మీద చేసిన పాపాలన్నిటికీ!

"మంచివాళ్ళకి భీతి ఉండదు, అలజడి ఉండదు. ప్రశాంతంగా, నిశ్చింతగా, నిర్భయంగా చనిపోగలుగుతారు. అందుకే మంచివానికి మరణమే సాక్షి అనే నానుడి.

"అందుకే ప్రతివారూ 'అనాయాసేన మరణం, వినాదైన్యేన జీవితం' అంటూ కోరుకుంటారు. అంటే... దైన్యంలేని జీవితమూ, బాధలేని మరణమూ వాంఛిస్తారని.

"ఏదేమయినా దేహంమీది మోహం ఎప్పుడూ క్లేశదాయకమే.

"మన విధి ప్రాణంలేని కట్టెను కాల్చడం. ఆ కట్టెకు బాధ, సౌఖ్యం ఏమీ తెలియవు. రాతిలో అయినా ప్రాణమూ ఆర్ద్రతా ఉండొచ్చునేమోకాని హంస ఎగిరిపోయిన మానవ దేహంలో ఏవిధమయిన స్పందనా ఉండదు. అందుకే దీనిని కాల్చడంలో మనమేమీ బాధపడనక్కరలేదు. పొయ్యిలోకి కట్టెనంటించినట్లే మానవ కళేబరాన్నీ కాలుస్తాం. నిజానికి అలా కాల్చకపోతేనే పీనుగువల్ల ప్రమాదాలు వొస్తాయి. కుళ్ళిందో- పురుగులూ వాటిద్వారా రోగాలూ.

నవ్వగలిగే ఏడవగలిగే ప్రాణి సృష్టిలోకెల్లా మానవుడొక్కడే అని మనం మనుషులం గర్వపడతాం. కాని మనకి గర్వభంగం కలిగించే అంశమూ ఉంది. నిర్జీవ కళేబరాల విషయానికొస్తే మానవ కళేబరమే అత్యంత నిరుపయోగకరమైనది.

"పులి చస్తే దాని తోలూ, గోళ్ళూ పనికొస్తాయి.

"గేదె, ఆవులవంటివి చస్తే వాటి కొమ్ములతో దువ్వెనలు చేస్తారు. అలా చాలా జంతువులకీ పక్షులకీ మరణానంతర విలువుంది. కాని మనిషికేలేదు. అంచేత కూడా దీనిని కాల్చడానికి మనమేమీ చింతించనక్కర్లేదు. నిర్వికారంగా దహనపర్చొచ్చు ఇక కోరికలు తీరకుండా చనిపోయినవారు దెయ్యాలవుతారనేది- ఆ మాటకొస్తే ఏ మనిషికీ ఎన్నేళ్లు బతికినా కోరికలు పూర్తిగా తీరడమనేది జరగదు. మునిమనవడి పెళ్ళి చూడాలనేనా కొట్టుకుంటూనే ఉంటారు ముసలివాళ్లు. నేనెన్నో ఏళ్ళనుంచి ఇక్కడే పగలూ రాత్రీ ఉంటున్నాను. నాకొక్క దెయ్యమూ కనపడలేదు. ఈ దెయ్యాలూ భూతాలూ ఉండేది మనుషుల భావనలోనూ దృష్టిలోకీ తప్ప బాహ్యంగా మాత్రం కావు. నన్ను నమ్ము. లేని దెయ్యాలూ, భూతాలగురించి భీతి ఎందుకు. అవన్నీ వొట్టి కథలూ కల్పనలూ భ్రమలూ. సాహి

త్యానికీ సినిమాకీ భూతవైద్యులకీ వ్యాపార వస్తువులంతే. శవంతో సెంటిమెంట్లు తగిలించడం అమాయకత్వం.

అది శవం! వొదుల్చుకోవలసిన వస్తువు, అంతే! ఇదంతా నేనెందుకు చెబుతున్నానంటే రేపు నువ్వు శవాన్ని తగలెయ్యవలసివొస్తే పని సులభమౌతుందని. అయితే-చెప్పినంత సులభం కాదనుకో అందుకే ఏదయినా చెప్పుట సులభము, చేయుట కష్టము అన్నారు. నేను నీకు థీరీ చెప్పాను. దీన్ననుసరిస్తే ప్రాక్టికల్‌గా కొంత సౌలభ్యం ఉండొచ్చు"

"నీకింగ్లీషు కూడా వొచ్చా తాతా?" నా ఆశ్చర్యానికంతులేదు.

"సో సో..." నవ్వాడు తాత. అతని నోటి వెంట ఇంగ్లీషు! ఒక్క క్షణం ఆశ్చర్యమూ ఆనందమూ కలిగి, తాత నడిగాను.

తాతా ఇంగ్లీషెందుకు మాట్లాడకూడదు? కాటికాపరైనంతమాత్రాన నిశానిగానే ఉండాలన్న నియమం లేదుగా?

ఎక్స్ట్రాకరికులర్ ఆక్టివిటీస్, హ్యూమన్ రిసోర్స్ డెవలప్‌మెంట్‌ల పేరిట కార్యాలయాలూ సంస్థలూ కంపెనీలూ తమ ఉద్యోగులకు వివిధ కళారంగాలయిన నాటకం, చిత్రలేఖనం. క్రీడలు... వంటి అంశాలలో వికసించేందుకు నిధులిచ్చి మరీ ప్రోత్సహిస్తున్నాయి.

ఒక గుమాస్తా మంచి గాయకుడైతే...

ఒక ఆఫీసరు చక్కని చిత్రకారుడైతే...

ఒక పోలీసు ప్రతిభావంతుడైన ఫుట్‌బాల్ ప్లేయరైతే- లేని ఆశ్చర్యం...

ఒక కాటికాపరి బహుభాషాకోవిదుడైతే ఎందుకు కలగాలి?

చేసే ఉద్యోగానికీ ఆ ఉద్యోగిలోని యితర ప్రతిభలకి సంబంధముండి తీరాలనేముంది? ఎక్కడుంది?

రామదాసుది మూడు నాలుగు తరాల నుంచీ స్త్రీలు కూడా విద్యావంతులయిన వంశం. 'అచట పుట్టిన చివురు కొమ్మయిన చేవ' అన్నట్లు విద్యావతి అయిన యిల్లాలి యింట్లో ఎవరికయినా అంతో ఇంతో విద్య వొచ్చి తీరుతుంది. సంగీత విద్వాంసుల ఇంట సత్తుచెంబుకి కూడా సరిగమలు వొచ్చేసేటట్లు.

తెలుగు, సంస్కృతం పేరుకే రెండు భాషలు కాని చాలావరకు అవి పిల్ల, తల్లి మాత్రమే. తొండ ముదిరి ఊసరవిల్లి అయినట్లు తత్సమాలతో కూడిన తెలుగు సంస్కృతానికి చేరువే. అలా రెండు భాషలు ఒకే దెబ్బకి రెండు పిట్టల్లా. ఇంగ్లీషు... తెలుగులో కొన్ని పదాలెటూ ఇంగ్లీషువే. ఆపైన తరచుగా వినబడే భాష. కొంచెం శ్రమచేస్తే ఇంగ్లీషు నేర్వడం అతి సులువు.

ఇలాగే రామదాసు త్రి భాషా ప్రవీణుడయ్యాడేమో.

అయినా అతను కారణజన్ముడు. విరాటరాజు కొలువులో ధర్మరాజు శాపవశాత్తూ మరొక పాత్ర ధరించినట్లు... ఈ గాంధేయవాది కావాలని కాటికాపరయ్యాడు. అదే ప్రజాసేవకు సరయిన మార్గమని నమ్మాడు. లేకపోతే ఆ దేశభక్తికీ, కమిట్‌మెంటుకీ, తెలివితేటలకీ ప్రజాసేవకుడిగా రాజకీయనాయకుడే అయ్యేవాడు. రాజకీయాలకీ ప్రజాసేవకీ క్షుద్రత్వం అంటి ఉండకపోతే తప్పక ఆ రంగంలోనే ఉండేవాడే.

తాతకేమయినా తెలియకపోతేనే ఆశ్చర్యపడాలిగాని తెలిస్తే కాదు అని నాకు నేనే పాఠంచెప్పుకున్నాను.

అనాగరికంగా... అమాయకంగా కనిపించే ఈ తాతలో యింకెన్ని అద్భుతాలూ అపురూపాలు దాగి ఉన్నాయో! వాటిని





కాలమూ, అవసరమూ అవకాశాలే వెలికి తియ్యాలి.

ఏదేమయినా నేను సరయిన చోటుకే వచ్చానాసర్వేశ్వరుడి కృపవలన.

ఐతే దారం తెగిన గాలి పటాలన్నీ ముళ్ళ కంపలలోనో మురికినీళ్లలోనో మాత్రమే పడక్కర్లేదన్నమాట. కొన్ని గాలి పటాలకి మంచి గంధపు చెట్లు కూడా ఆశ్రయమిస్తాయి! బహుశా దీనినే కాబోలు అదృష్టమనాలి.

వంటకి వేళవుతోందని లేచి కుటీరంలోకి వెళ్ళాను. నేనిప్పుడు బాగానే వొండగలుగుతున్నాను. తాత నా వంటలని మెచ్చుకుంటున్నాడు కూడా. అందుకు నేను పొంగిపోతూంటాను.



రోజులు గడిచిపోతున్నాయి. తాతని కదిపి అనేక విషయాలు తెలుసుకుంటున్నాను. ట్రంకు పెట్టెలోని పుస్తకాలు అనర్ఘ రత్నాలే. అవి చదువుతున్నాను. వంట, కుటీరాన్ని శుభ్రంగా ఉంచడం, నీళ్ళు తేవడం మొదలయిన పనులన్నీ చేస్తూ తాత రుణం కొంత తీర్చుకుంటున్నాను. అలాగే శవంవొస్తే దహనక్రియలో తాతకు సహాయపడుతూ పని నేర్చుకుంటున్నాను. కాలం వృధా కావడంలేదు. నిజానికి అది సార్థకమే ఔతూంది తాతవంటి గురువు సమక్షంలో.

తాత- నాకు అమ్మా నాన్నలని తలుచుకుని వగచే తీరికా ఒంటరితనమూ కూడా ఉండనివ్వడంలేదు.

తిండి, బట్టలాటి ప్రాథమికావసరాలకు లోటులేకపోవడం అదృష్టమేకాని జ్ఞాన ధార లభించడం మనిషికి మహాదృష్టం. అదే ప్రసాదిస్తున్నాడు తాత.

తీరికదొరికితే చాలు తన తాత, గాంధీతాత, స్వతంత్రం కోసం పోరాటం.. భారతదేశ చరిత్ర... ఏదో ఒకటి కనులకు కట్టినట్లు చెపుతాడు.

అలా అంతా సవ్యంగా సుఖంగా వెళ్తున్నా "జీవితాలిలా సాఫీగా గడిచిపోకూడదు; మార్పు నా తీర్పు" అన్నట్లుగా కాలం మమ్మల్నొక కుదుపు కుదిపింది.



ఆవేళ... ఉదయం పదవుతోంది...

తాత ఊళ్లోకి వెళ్లాడు కూరగాయలు తెచ్చేందుకు. నేను వంట చేస్తున్నాను.

ఇంతలో కుటీరం బయటినుంచి పిలుపు!

ఎవరా అని చూడబోతే "మీరెవరు? " అని ఎదురు ప్రశ్న!

అతను యువకుడు. టిప్‌టాప్ బట్టలు వేసుకునున్నాడు. ఇంట శవంలేచిన విషాద ఛాయలెక్కడా గోచరించడంలేదు. పైగా ముఖంలో చాలా ఉత్సాహమూ, కళ, వెలుగూను.

నేనతన్ని పరికిస్తున్నట్లే అతనూ నన్ను తీక్షణంగా చూస్తున్నాడు.

ముందు జవాబు చెప్పినంత మాత్రాన పరువేమీ పోదులే అని "రామదాసుగారి మనవరాలిని" అన్నాను.



అతని ముఖంలో ఒక్కసారెంతో నమ్మలే నితనం.

"ఇంపాసిబుల్ నాకింకా పెళ్ళేకాలేదు. ఏమిటలాచూస్తారు? నేను రామదాసు గార బ్బాయిని"

"ఆ! శ్రీధరా!" ఆశ్చర్యమూ ఆనందమూ పట్టలేకపోయాను.

"లోపలికిరండి. కూర్చోండి. తాతగారు బజారుకి వెళ్ళారు. వొచ్చేస్తారు" అంటూ హడావిడిగా కుర్చీవేసి టీ యిచ్చి తాతకెంత తొందరగా శుభవార్త చెబుతానా అని రివ్వున పరుగెత్తాను ఊళ్ళోకి.

తోవలోనే ఎదురయ్యాడు తాత.

ముందు నా మాటలు నమ్మలేదు. ఆటలు పట్టిస్తున్నాననుకున్నాడు. ఔను మరి. మొదట్లో నేను తాత దగ్గర భయభ క్తులతోనే ఉండేదాన్ని కాని "చూడమ్మా శివానీ... మనుషులు బిగుసుకుపోయినట్లు ఉండకూడదు. సాధ్యమైనంతవరకూ సరదా గానూ నవ్వుతూనూ ఉండాలి. నవ్వు ఆరో గ్యకరం నవ్వినవారికీ చూసేవారికీ కూడా. జీవితంలో కొన్నిసార్లేడవక ఎలాగా తప్పదు. అవసరంలేనప్పుడు కూడా ధూమ్రాక్షుడి ముఖం ఎందుకూ? మనిషికి మనిషి తోడున్నప్పుడు సరదాగా హాస్యాలా డుకొంటూ నవ్వుకుంటూండాలి. మనిషి-ఒక్కడే నవ్వుకుంటే పిచ్చితనమనిపిస్తుంది. ఇద్దరుండీ నవ్వుకోలేకపోతే బతకడమనే కళ తెలియకపోడమౌతుంది. మనకి ఒంటరిత నపు శాపం లేదు కనుక హాయిగా నవ్వుకో గలిగేటట్లే మాట్లాడుకుందాం. ప్రవర్తిద్దాం. ఎలాగూ మనది తాతామనవరాళ్ళ వరసే కనక బోలెడన్ని హాస్యాలాడుకోవచ్చు ఆటలు పట్టించుకోవచ్చు అంతమాత్రాన ఎవరు ఎవరినీ అగౌరవించినట్లయిపోదు. నవ్వుతూ బతకాలి శివానీ!" అంటూ చివరి వాక్యం పాటలా పాడాడు.

"థాంక్యూ తాతా... థాంక్యూ" అని తాత చేతులు పట్టుకు ఊపాను కృతజ్ఞతా సూచ కంగా.

అందుకే తాత మొదట నా మాటలు నమ్మలేదు. నమ్మాక కుటీరానికి వొచ్చేలోగా ఎన్ని ప్రశ్నలు వేశాడనీ "అబ్బాయెలాగు న్నాడు?

పొడగరేనా? భారీ విగ్రహమేనా?

ముఖం అందంగా ఉందా? సాత్వికంగా ఉందా?

ఏం బట్టలేసుకున్నాడు? చూడగానే మంచివాడనే అనిపిస్తాడా? " అంటూ లక్ష ప్రశ్నలు.

సహజమే! పదిహేనేళ్ళ అనంతరం... కలుసుకోబోతున్న కొడుకు.

మళ్ళీ జీవితంలో కనపడడేమో అని పరి తపించిన పుత్రుడు.

తండ్రికి ఎంత ఆత్రుత ఉంటే అంత సహ జంగదా!

వాళ్ళిద్దర్నీ కుటీరంలో వొదిలి నేను బయ టకొచ్చేశాను, పానకంలో పుడకని కాకూడ దని. పుస్తకం చేతబట్టుకుని స్మశాన ఆవర ణలో తిరగసాగాను.

ఒక గంటపోయాక తాత పిలిచాడు.

కొడుకుని నాకూ నన్నతనికీ పరిచయం చేశాడు.

"నాన్నకి మీరు చాలా చేదోడు వాదోడుగా ఉంటూ వొస్తున్నారట యిన్నాళ్ళనుంచీ. థాంక్స్" అన్నాడతను.

"నాకే ఆయన ఆశ్రయం కల్పించారు. సరేగానీ మగవారి జీతం అడగకూడదం టారు గానీ ఉద్యోగం గురించి అడగొచ్చును కుంటాను" అన్నాను లౌక్యంగా.

తాత నవ్వాడు అమ్మదొంగా అంటు న్నట్లు.




"అదొక స్వచ్ఛంద సేవా సంస్థ. ఉద్యోగం కాదు, అది నేను స్థాపించినదే. గ్రామీణాభివృద్ధికి కృషిచేస్తుంది. జీతం చెప్పాలంటే నెలకో రెండు వేల ఐదువందలు అనుకోవచ్చు అదికాక టి.ఏ.లూ డి.ఏ.లూ ఉంటాయ్. నిజానికి ఆ ఉద్యోగంలో జీతపు లెక్కలు గుర్తురావు. పల్లెప్రజల బాధలూ సమస్యలూ తప్ప"

తాత ముఖం కళకళలాడిపోతోంది.

ఔను... ఎలాగైతేనేం, జయించాడుగా. కొడుకు కూడా ప్రజాసేవనే చేపట్టాడు. కాటికాపరి కాకపోతేనేం. **శ్రీధర్** కూడా స్వచ్ఛంద ప్రజాసేవకుడే.

"మీ ఉద్యోగం... అదే సేవ ఎక్కడ?" అడిగాను.

"ప్రస్తుతం తూర్పుగోదావరిజిల్లాలో ఒక మారుమూల ప్రాంతం. అక్కడ ప్రాజెక్టు అయిపోతే మరోచోటుకి వెళ్తాం. దేశంలోని అన్నిప్రాంతాలూ అభివృద్ధి కోసం చూస్తున్న వేకదా. మరి నేను వెళ్తాను" అంటూ లేచాడతను.

నేను ఆశ్చర్యపోయాను అతనలా లేస్తుంటే.

"అదేమిటి? అప్పుడే వెళ్ళడమేమిటి? భోజనం చేద్దురుగాని, పావుగంటలో వండేస్తాను" అంటూ హడావిడిగా లేచాను వంట కుపక్రమిద్దామని.

ఆ తండ్రీకొడుకులు సహపంక్తి భోజనం చేసి పదిహేనేళ్ళయింది. నా చేత్తో యిద్దరికీ పక్కపక్కన వడ్డించాలని నా ముచ్చట.

"భయపడకండి. నా వంట మరీ అంత ఘోరంగా ఉండదు. మీ నాన్నగారు యిన్నాళ్ళుగా నా వంట తింటూ కూడా క్షేమంగా ఉండడమే నా పాకశాస్త్ర ప్రతిభకి కితాబు. ఏం తాతా"

మొత్తానికి నామాట నెగ్గించుకున్నాను. ఆ తండ్రీ కొడుకులకి నాచేత్తో వండి వడ్డించాను. భోంచేసి **శ్రీధర్** హడావిడిగా వెళ్ళిపోయాడు.

అప్పుడు తాత నన్నూ రమ్మనమని మర్రిచెట్టు నీడకు దారితీశాడు. భోజనం చేసిన అనంతరం మర్రిచెట్టు నీడలో... దాని ఊడకు చేరగిలబడి కళ్ళు అరమోడ్పులు చేసుకుని చుట్ట కాల్చుకుంటూంటే స్వర్గమే తాతకి.

తాతకి చిన్నచిన్న సరదాలు కూడా ఉన్నాయ్, చాలా విషయాలలో పెద్దవాడయినా. ఇవాళ మాత్రం ఆయన కన్నులరమోడ్పు చేసుకోలేదు చుట్ట కాలుస్తున్నా.

"శివానీ!" మెల్లగా పిలిచాడు ఏదో చాలా ముఖ్యమయిన విషయం చెప్పబోతున్నట్లు.

"అబ్బాయి... అలా వెళ్ళిపోయినా మంచి పనే చేశాడు. బాగానే తయారయ్యాడు. పట్టభద్రుడై అనుభవంకోసం రెండుమూడు సంస్థలలో పనిచేసి తనే ఒక స్వచ్ఛంద సంస్థని నడుపుతూ గ్రామీణులకి సేవచేస్తున్నాడు. ఆవేళ- పెద్దవాళ్ళ మాట వినకుండా ఎదిరించి పారిపోయాడనీ, కాటికాపరి పనిని చేయనన్నాడనీ కోపగించిన మాట వాస్తవమే కాని... ఇదీ ఒకందుకు మంచికే జరిగింది. సరే... అదలా ఉంచు. గతం గతః. ఇప్పుడు అబ్బాయేమంటున్నాడంటే... నన్ను తనతో వొచ్చేయమంటాడు. పెళ్ళి నా చేతులమీద జరిపించాలట. నేను వాళ్ళతోనే ఉండాలంటాడు. అదే తన అభీష్టమూ న్యాయమూ కూడానట. కావాలంటే నా ప్రజాసేవ అక్కడే చెయ్యొచ్చుట" తాత కంఠంలో ఎంతో ఉత్సాహమూ, పొంగూ

"నిజమే... అందరూ ప్రజలే"

"ఆలోచించడానికి వ్యవధీ, వీలూ యివ్వనేలేదు. వొచ్చినప్పట్నుంచీ వొచ్చీ.. వొచ్చెయ్... అని ఒకటే పాట. కచ్చులో కందులేపేశాడంటే నమ్ము. నేనంటే వాడి

కింత అభిమానముందా అని నాకే ఆశ్చర్యం వేసిందనుకో"

"బాగుంది... మీకతను కొడుకు కాదా, అతనికి మీరు తండ్రికారా? అందుకే కదా రక్తం నీటికంటె చిక్కన అన్నారు? రక్త సంబంధాలెప్పుడూ గాఢమే. అయినా ఆలోచించడానికేముంది. కొడుకు పిలుస్తున్నాడు, తండ్రి వెళ్తున్నాడు అంతే! శ్రీధర్ మాటలు సబబే"

"కాని... నాకీవూరూ, కాడూ విడచి వెళ్ళాలనీ అనిపించడంలేదు. కొడుకుదగ్గరికి వెళ్ళి వాడికి పెళ్ళి చేసి వాళ్ళతో ఉండాలనీ ఉంది" చిన్నపిల్లాడిలా బాధగా అన్నాడు.

"తాతా! అవ్వో, బువ్వో ఏదో ఒకటే" అని నవ్వాను.

తాత నవ్వేసి దీర్ఘాలోచనలో పడ్డాడు.

నేనే మళ్ళీ అన్నాను "ఆలోచించేందుకేమీ లేదు తాతా. అబ్బాయితో ఉండడమే"

"నా కోరికా అదే నిజానికి"

"తప్పకుండా నీ కోరిక తీర్చుకో. అంత కంటె కావలసిందేముంది"

"అయితే నా ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసేదా! అబ్బాయ్ టైపు చేయించి తెచ్చాడు"

"నిస్సందేహంగా. శుభస్యశీఘ్రం. ఇవాళే యిచ్చెయ్"

అయితే శ్రీధర్ అన్ని ఏర్పాట్లూ చేసేవొచ్చాడన్న మాట.

రాజీనామా పత్రంమీద సంతకం పెడుతూంటే తాతకళ్లల్లో నీళ్లు!

న్యాయమే. ఎన్నేళ్ల అనుబంధం ఈ ఉద్యోగంతో! పదవీవిరమణ బాధాకరమే. రాజీనామా అంటే మరీను.

ఉద్యోగజీవితమంటే ఎన్నెన్ని అనుభవాల అనుభూతుల సంపుటి!

సంతకం పెట్టి ఏడుస్తున్న తాతని ఓదార్చి మనిషిని చేయడానికి అరగంట పట్టింది నాకు.

★ ★ ★

"నువ్వు వెళ్ళిపోతానంటే బాధగానే ఉంది. కాని నీ కొడుకు దగ్గరకంటున్నావు కనుక నీ రాజీనామా అంగీకరిస్తాను. కాని ఒక షరతు. కాటికాపరి పనికెవరూ రారేమో. ప్రకటనయిస్తాను. ఎవరేనా వొస్తే సరే. లేకపోతే నీ స్థానంలో నువ్వే ఎవరినో నియమించి వెళ్ళాలి. రామదాసూ! నీకు తెలుసు. శ్మశానానికి ఒక్కరోజు కూడా సెలవుండదు. ఒక్కరోజు కూడా ఆగడానికి వీల్లేదు. కాటికాపరి లేకపోతే ఊరంతా అల్లకల్లోలమే"

"ప్రకటించండి చూద్దాం ఏమవుతుందో. ఉద్యోగాలు దొరకని ఈ రోజుల్లో కూడా ఎవరేనా రాకపోతారా? " అని కమిషనర్ నుంచి సెలవు తీసుకున్నాడు రామదాసు.

అతని మనసులో ఒక ఆలోచనుంది. అది తనతోపాటే శివానిని కూడా తీసుకుపోవడం. అక్కడ తనతోపాటు ఉంటూ ప్రజోపయోగమయిన పనులు చేయొచ్చు

విచిత్రంగా "కాటికాపరి కావలెను. తక్షణం దరఖాస్తు పంపండి" అంటూ రెండు పేపర్లలో ఇచ్చిన ప్రకటనలకూ రెండు వారాలు గడిచినా ఒక్కటంటే ఒక్కటీ దరఖాస్తు రాలేదు! కమిషనర్‌కేం చేయాలో తోచలేదు.

"ఎవరేనా నీ స్థానంలోకి రాకుండా నువ్వెళ్ళిపోతే ఎలా రామదాసూ? ఆలోచించు. ఏ పనేనా ఆగుతుందేమో కాని శవదహనం ఆపలేం కదా? "

"మనవాళ్లకి కాటికాపరి పని నీచంగా అనిపిస్తుంది. పరువుతక్కువగా తోస్తుంది. ఎవరూ వొస్తారనే ఆశ లేదు నాకైతే"

"మరెలా!" తెల్లమొహం వేశాడు కమీష




నర్... "సబ్స్టిట్యూట్ లేకుండా యిలాటి పోస్టులలో రిలీవ్ చెయ్యకూడదే"

"ఉద్యోగం వొదిలి పోయేవాడిని నియమాలు బంధించగలవా? " నవ్వాడు రామదాసు.

"రామదాసూ!" వెళ్ళిపోతావా అన్నట్లు దీనంగా చూశాడు ఆఫీసరు. అతని భయం అతనిది. కాటికాపరి లేని శ్మశానం చిన్న సమస్యేంకాదు.

"నేనేం చెయ్యగలను? అబ్బాయి నేనొచ్చే స్తానని ఎదురుచూస్తూంటాడు"

"నేను చెయ్యగలను" ముందుకు అడుగేశాను నేను.

"ఏంచెయ్యగలవు! ఈ ఉద్యోగానికెవరినయినా తీసుకురాగలవా తెలిసినవారిని? "

"ఎవరోకాదు, నేనే దరఖాస్తు పెడతాను ఇదిగో" అంటూ అందించాను.

రామదాసు ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వా! ఆడదానివి"

"అయితే! రాజ్యాంగం ఈ ఉద్యోగానికలాటి విచక్షణా, వివక్షా అంగీకరించదు. మనదేశంలో నేనే మొదటి కాటికాపరిని కాను" నా కంఠం కచ్చితంగా ఉంది.

నాకు తెలిసినంతవరకూ నా సర్వీసులో ఆంధ్రాలో... ఆడ కాటికాపరి లేరు"

"కమిషనర్ సార్! మీరు మరికొంత విశాలంగా దేశం పరిధిలోనూ, రాజ్యాంగం పరిధిలోనూ ఆలోచించండి. కాటికాపరి కవసరమయిన చదువు, వయసు, ఆరోగ్యం వగైరా అర్హతలున్నాయి నాకు. మరొక దరఖాస్తుదారు కూడా లేరు.. మీరు లింగ వివక్ష తప్ప నా అనర్హతకు మరే కారణమూ చూపలేరు. జెండర్ డిస్క్రిమినేషన్ అన్నారో నేను సరాసరి స్త్రీ హక్కుల పరిరక్షణ సమితి వారివద్దకు వెళ్లి ఫిర్యాదు చేస్తాను. ఇప్పటికే రాజస్థాన్‌లో కాటికాపరిగా స్త్రీలు చేస్తున్నారు. ఈ పొద్దు నాతోనే పొడవడంలేదు. నేను చేస్తానంటే మీకెందుకూ అభ్యంతరం? "

నేనలా కఠినంగా మాట్లాడడానికి కారణం లేకపోలేదు. దరఖాస్తులు వస్తే లంచం తీసుకుని ఉద్యోగమివ్వాలని కమిషనర్ ఆశపడుతున్నట్లు తెలిసింది. ఆ లంచగొండితనంపట్ల అసహ్యమే నా అవిధేయతకు అసలు కారణం.

"అది కాదు. అలాటిపనికి ఆడవాళ్లను వేస్తే పురజనులేమంటారో అని"

"మరెవరూ ముందుకు రాలేదని చెప్పండి. గడువులోపల వచ్చిన దరఖాస్తు నా దొక్కటే కనుక నాకు నియామకపత్రం ఇవ్వండి. రామదాసుగారు తన స్థానాన్ని భర్తీ చేసేందుకు చూపుతున్న అభ్యర్థిని నేనే. కదూ తాతా? నేను నీ వారసురాలినే కదూ? " నిలదీసి అడుగుతున్నట్లే చూశాను తాత కళ్లల్లోకి.

నాకతని మనసులోని ఆందోళన తెలుసు. కొడుకు దగ్గరికి వెళ్లిపోవాలని ఆతృతగా ఉంది. ఈ ఉద్యోగబంధం కాళ్ల కడ్డం పడుతోంది. ఆ బంధాన్ని నేను కాక మరెవరేనా తొలగించగలిగితే చాలా సంతోషించేవాడే. నేనీ ఉద్యోగంలో చేరితే తనతో రావడానికి కుదరదు. ఒంటరిగా ఇలాటి ఉద్యోగం చేస్తూ ఆడపిల్లని ఎలా బతుకుతానో అని ఒకవేపు భయం.

కాని పరిస్థితిని రక్షించగలదాన్ని నేను తప్ప మరెవరూ లేరు.

అందుచేత మళ్లీ విషమ సంధిలోనే ఇరుక్కుని ఒక నిముషం ఆలోచించి,

"ఔను ఈమే నా వారసురాలు" అనేశాడు తెగించి నిశ్చయానికి వచ్చినట్టు.

అలా అంటూంటే అతని కళ్లల్లో నీళ్లు, భయం, సందేహం!



అవి సహజమే! అతను ఆంధ్రదేశంలో తొలిసారిగా ఒక ఆడపిల్ల కాటికాపరి కావడానికి కారణభూతుడవుతున్నాడుమరి. నేనీ పనిని సక్రమంగా నిర్వర్తించగలిగితే అతనికి మంచి పేరు వస్తుందో, రాదోకాని తనుకాని భంగపడిందో రామదాసుకి అప్రతిష్ఠే. చేతకాని అభ్యర్థిని... ఆడపిల్లని ఇరికించిపోయాడు, స్వార్థంకొద్దీ అంటారు నలుగురూ. అదీకాక అతనికి నా పట్లా, నా క్షేమంపట్లా ఆతృత. చూస్తూ చూస్తూ ఒక ఆడపిల్లని ఒంటరిగా శ్మశానానికప్పగించి ఎలా వెళ్లగలరు మనుషులు?

కమిషనర్ నా మాటల ధాటికే బెదిరిపోయాడో, లంచం రాదని నిరాశే చేసుకున్నాడోగానీ చివరి ప్రయత్నంగా ఎస్టాబ్లిష్‌మెంట్ మాన్యువల్ తెప్పించాడు. స్త్రీని కాటికాపరిగా నియమించడం విషయంలో అటుకాని ఇటుకాని ఏమయినా రూల్సూ, సెక్షన్లూ ఉన్నాయేమో అని కాబోలు వెదికాడు. పెదవి విరిచాడు. గుమాస్తాని పిలిచాడు.

అరగంటకి ఒణుకుతున్న చేతులతో నా ఉద్యోగ నియామకపత్రం అందజేశాడు. అప్పటికే సిద్ధం చేసి ఉంచుకున్న నా జాయినింగ్ రిపోర్ట్‌ని నేనాయనకిచ్చేశాను.

"సర్! రాముదాసు తాత నాకన్నీ నేర్పాడు. చేయగలననే ధైర్యముంది. నా ఉద్యోగ నిర్వహణ గురించి మీరే కాదు ఎవరూ సందేహాలు పెట్టుకోనక్కర్లేదు. థాంక్స్" చెప్పి వచ్చేశాను.

తాతకి ఆఫీసరు రాజీనామా అంగీకార ఉత్తర్వులు అందించాక ఇద్దరమూ ఇంటికొచ్చాం.

"ఏమిటమ్మా, అలా చేశావ్?" అడిగాడు తాత. అతని కంఠం గద్గదికంగా ఉంది. కళ్లల్లో నీళ్లు.

"నేను న్యాయంగా చేయవలసిందే చేశాను తాతా! నాకెంత సంతోషంగా ఉందో నిజంగా"

"ఈ తాతకి దూరం కావడమా?"

"కాదు. మా తాత వారసత్వమూ, వాంఛా అందుకున్నందుకు. అలా చేయడంలో మా తాతకు ఉద్యోగబంధంనుంచి విముక్తి కలిగిస్తూ మరో మధురానుబంధమైన పుత్రానుబంధం ఏర్పరచగలుగుతున్నందుకు. నేను నీ ఋణమూ, నా కర్తవ్యమూ తీర్చుకుంటున్నానంతే. ఇలాటి అవకాశం వస్తుందని కలలో కూడా ఆశపడలేదు. ఆశీర్వదించు తాతా! కనీసం ఆంధ్రదేశంలో ఒక ఆడపిల్ల కాటికాపరిగా చరిత్రే అనుకుంటాను. నీ మనవరాలు చరిత్ర సృష్టించాలని మనస్ఫూర్తిగా ఆశీర్వదించు. నాకేమీ భయంలేదు తాతా. నీ పేరు నిలపడమే నా ధ్యేయం. ఆనాడు నువ్విచ్చిన ఆశ్రయముందే అది ఎంత విలువైనదో! నా జీవితాన్ని మంచి మలుపు తిప్పిందదే. నువ్వు నాకెన్ని విధాలయిన సంపదలు ప్రసాదించావో ఇచ్చిన నీకు తెలియదు. పుచ్చుకున్న నాకే తెలుసు" అని ఊరుకోక తాత చెప్పిన వేదాంతం తాతకే అప్పగించాను.

"జీవితం ఒక ప్రయాణం.

దానిలో ఎవరెవరో తగులుతుంటారు.

భార్యాబిడ్డలు... స్నేహితులు, అందరూ అలాటి ప్రయాణికులే.

ఈ ప్రయాణానికి ఆదిలోనూ వారుండరు. అంతంలోనూ ఉండరు. మనిషి ఒంటరితనంలో పుట్టి ఒంటరితనంలో మరణిస్తాడు.

తరచిచూస్తే జీవితమొక మాయా, స్వప్నమూ మాత్రమే కాదూ?"

అంతలోనే శ్రీధర్ వచ్చాడు. చెప్పుల్లో కాళ్లు పెట్టుకున్నట్లు, "మా నాన్న వారసత్వం అందుకుని ఆయన కోరిక తీరుస్తున్న మీకు




నా కృతజ్ఞతలు. మనం ఇలాగ బంధువులమే అయ్యాం. ఏ అవసరమొచ్చినా మీకు మేమున్నామని మరచిపోయి మా నాన్ననీ, నన్నూ అవమానించకండి, బాధించకండి. ఏం? మీ కొత్త ఉద్యోగంలో మీకు బెస్టాఫ్ లక్" అంటూ తండ్రిని రిక్షా ఎక్కించేశాడు.

తన బట్టలు తప్ప తన సామానంతా పుస్తకాలతోసహా నాకే వదిలేశాడు తాత.

జీవితంలో నేను అమ్మా నాన్నల మరణానికి తప్పిస్తే, అంతలా ఏడ్చింది తాత రిక్షా కనుమరుగు అయినప్పుడే! కాని "నన్ను స్వేచ్ఛగా ఏడ్వనీయరు వీరు" అని కవిగారు వాపోవడం సమంజసమే అన్నట్లు పావుగంటేనా ఏడ్చుకోనివ్వలేదు నన్ను-

పత్రికావిలేఖరినంటూ ఒకాయనొచ్చాడు. నన్ను ఫొటోతీసి ఇంటర్వ్యూ చేసి పేపర్లలో ప్రచురిస్తాడట.

అతనితోపాటు ఓ మహిళా సమితి కార్యదర్శి కూడా వచ్చారు. ఆడపిల్ల కాటికాపరి కావడం వాళ్ళకు సంచలనంగా ఉన్నట్లుంది.

నాకు ఊళ్లో ఎవరేనా ఇల్లిస్తారేమో అని తాత ఉండగానే ప్రయత్నించాము. కాని కాటికాపరికి ఆడవాళ్లకయినా సరే అద్దెకిల్లివ్వమని నిర్దయగా చెప్పేశారు.

కనుక ఇహ నా నివాసం నా మాతాపితరుల కంత్యక్రియలు జరిగిన ఈ పితృవనంలోనే.

తాతలేని శ్మశానం మునుపెన్నడూ లేనిది భయపెట్టసాగింది నన్ను.

ఔను. ఇప్పుడు నేను ఏొంటరిని.

దానికితోడు ఉద్యోగ బాధ్యత కొత్తగా నెత్తినపడింది. ఆడపిల్లని. శ్మశానమేమో ఊరికొసన. మరి అది నన్ను అలుసుచేయడంలో, జడిపించి చూడడంలో ఆశ్చర్యమేముంది!

'ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు సుమ్ము. నరుడు నరుడౌట ఎంతో దుష్కరము లెమ్ము' అన్నట్లు నేనివాళంటే మీకు చాలా విషయాలు చెప్పగలిగేంత రాటుతేలాను. కాని మొదట్లో ఎలాటి అనుభవాలెదురయ్యాయనీ...

శవదహనమంటే శవాన్ని కాల్చడంలో సహకరించడమేకదా అనుకున్నాను. అంతవరకూ తాతకి సహాయకారిగా మాత్రమే ఉండడమూ, రాత్రులు తాత ఉన్నాడన్న నిశ్చింతతో గాఢంగా నిద్రపోగలగడమూ. వీటితో శ్మశానానికి సంబంధించిన అనుబంధ విశేషాలు నాకేమీ తెలియలేదు.

రాత్రులు ఏం జరుగుతుందో అన్న భయంతో సరిగా నిద్రపట్టేది కాదు.

నన్నెవరో ఏదో చేస్తారని కాదు. నాకు ఆత్మరక్షణ చేసుకోగలిగేపాటి కరాటే వచ్చును. పైగా పనికట్టుకుని వచ్చి నన్నేదో చేయాలనిపించేంత అందంగా కనిపించను మగాళ్ల కంటికి.

"దెయ్యాలనేవి లేవు" అని తాతే స్వయంగా చెప్పాడు కనుక ఇక ఆ విషయంలో అనుమానం లేదు.

నిజం చెప్పాలంటే నా భయాలు నా గురించి కానే కావు.

ఒక శ్మశానాన్ని సంధించుకుంటూ ఇన్నిరకాల కార్యకలాపాలుంటాయా? శవం తాలూకు వారికేకాక ఇంకా ఎంతోమంది పైవాళ్లకి కూడా శ్మశానమనేది ఓ కార్యాలయమా! కచ్చితంగా చెప్పాలంటే ఆ అనుభవాలకి సాక్షిగా నిలిచినప్పుడు నాలో కలిగిన భావం ఒక్క భయం మాత్రమే కాదు. జుగుప్స, కుతూహలం, మందహాసం, బాధ, భావరాహిత్యం. అలా ఎన్నో.

నేను మీకా సంఘటనలూ, అనుభవాలే చెప్పబోతున్నాను. అథోప్రపంచపు అధివాస్తవికతలను మీ ముందుంచబోతున్నాను.

★ ★ ★



"మాడమ్!"

"ఊc..."

"ఇదిగో మీరు చెప్పిన కథకు రూపం. ఇది మీరు మీ కథ చెప్పినట్లే. అంటే ప్రథమ పురుషలో రాశాను. అలా అయితే పాఠకులకు బాగా హత్తుకుంటుందని!"

"సరే"

"ఇక- మీ అనుభవాలు"

"చెబుతాను"

"మీరు చెప్పబోయే అనుభవాలను నేను రిపోర్టింగ్ ధోరణిలో అంటే రచయితే చెబుతున్నట్లుగా రాస్తాను"

"మీ ఇష్టం. ఏది ఎలా రాయాలో నాకేం తెలుస్తుంది? రచయిత లయిన మీకు తెలియాలి కాని"

"నామీద అంత విశ్వాసముంచినందుకు చాలా కృతజ్ఞతలు"

"బలేవారే! ఒక అనామకురాలినైన నా కథ రాస్తున్నారు. ఇందుకు నేనే మీకు కృతజ్ఞతలు తెలపాలి. మీరు నాకు కావ్య గౌరవమే కల్పిస్తున్నారు, నేనందుకర్హురాలిని కాకపోయినా"

"కాటికాపరి వృత్తినంగీకరించడంలో మీరు చూపిన చొరవా, ధైర్యమూ, సాహసము, తాత రుణం తీర్చుకుందుకు మీరు చేసిన త్యాగమూ సామాన్యమైనవి కావనే నా ఉద్దేశం"

"సర్లెండి. మనమిలా పరస్పరము పొగుడుతూ కూర్చుంటే కాలం కాస్తా మనకి తెలియకుండానే జారిపోతుంది" నవ్విందామె.

"మరయితే మీరు చెప్పడం మొదలు పెట్టండి"

ఆమె గొంతు సవరించుకుంది. ఆమె చెప్పేవి ఒకవేపు నోట్ చేసుకుంటూనే మధ్య మధ్య ఆశ్చర్యంగా ఆమె ముఖం చూడసాగాడతను.

చెబుతామని గొంతు సవరించుకుందేకాని శివానిలో ఎన్నో అనుమానాలు.

తను శ్మశానంలో ఒంటరిగా ఉండడం గమనించి రెండు మూడుసార్లు తనపై అత్యాచార ప్రయత్నాలు చేశారు ఇద్దరు మగవాళ్లు. తను ఆ ప్రమాదాలనుంచి తప్పించుకోగలిగింది చాకచక్యంగా. అటువంటి సిగ్గుమాలిన అనుభవాలను మగవాడైన ఇతనికెలా చెప్పగలదు?

మిగిలిన ప్రమాదాల సంగతటుంచితే తనను పట్టి పీడించిన బాధ ఒంటరితనం. ఎవరేనా మగవాడు తనకి జీవన సహచరుడిగా లభిస్తే ఎంత బాగుండునని ఎన్నోసార్లు అనుకునేది. అది ఎంత గాఢమయిన కోరికంటే.

చాలా తరచుగా తన కలలోకి రకరకాల పురుషులు వస్తూండేవారు. వీళ్లు తనతో తియ్యగా మాట్లాడేవారు. ప్రేమగా లాలించేవారు. గాఢంగా కౌగలించుకునేవారు.

ఒక్కొక్కసారయితే తను కలలో సంసారం చేసి పిల్లల తల్లి కూడా అయిపోతూండేది. చిన్న ఇల్లు. ఉద్యోగి అయిన భర్త. అనుకూల దాంపత్యం. అతని సరస శృంగారాలు.

మెలకువ వచ్చాక మళ్ళీ తలుచుకుందుకే సిగ్గు తెప్పించే స్వప్నాలు.

తన అంతరాంతరాలలో మగవాడి సాహచర్యం కోరుకుంటూంది. దానికోసం దేముడికి పూజలు చేస్తూంది.

ఒకసారయితే భయంకరమైన కల వచ్చింది.

ఆ సాయంత్రం ఒక అందమైన యువకుడి శవానికి సంస్కారం జరిపించింది. రాత్రి అతనే కలలోకి వచ్చి "కాటికాపరివైన నిన్ను మరే మగాడూ పెళ్లి చేసుకోడు. కాని నీమీద దయతో నేను చేసుకుంటాను. రా..." అంటూ ఆహ్వానించాడు.





తను సందేహిస్తూంటే ఆ శవం తన మెడలో తాళి కట్టేసి తనని కౌగిలిలోకి తీసేసుకుంది.

చిత్రమేమిటంటే ఆ శవంతో నెరపిన సంసార జీవితమూ తనకి సంతోషాన్నే ఇచ్చింది.

తను ఒంటరితనంనుంచి పడుతున్న బాధకీ, తనలోని కోరికకీ ప్రతీకలా స్వప్నాలు.

కాని...

వాటిని మాత్రం ఇతనికి చెప్పదుకాక చెప్పదు.

అవి ఎవరికీ చెప్పుకోదగ్గవీ కావు.

ఎవరితోనూ పంచుకోదగ్గవీ కావు.

అలాగ కొన్నిటిని దాచుకుని కొన్నే చెప్పిందామె.

అతనవి రాసుకుని నాలుగు రోజులలో వాటికి అక్షర రూపమిచ్చి రాసి తెచ్చి చూడమన్నాడు.



**సా**యంత్రం...

నాలుగు దాటుతోంది.

ఎండ బంగారం రంగునుంచి గులాబీరంగుకి మారుతోంది.

శబ్ధమేదీ లేక తీరిగ్గా ఉంది శివాని.

శవమొచ్చే సూచనలు కూడా కనిపించడంలేదు. చదువుతున్న పుస్తకం మడిచి, టీ కాచుకుని తాగి కుటీరంలోంచి బయటకొచ్చింది.

గేటు అవతల ఎవరో తచ్చాడుతున్నారు.

గేటువరకూ రావడమూ, మళ్లీ వెనుకంజ వేయడమూ. లోపలికి రావడానికి తటపటాయిస్తున్నట్లుంది. ప్రవేశించడానికనుమతి అక్కరలేని అతికొద్ది చోట్లలోనూ ఈ కాడు కూడా ఒకటి.

దీనిలోపలికి రావడానికి సందేహిస్తున్న ఆ అమాయకులెవరు?

కొంచెం తీక్షణంగా చూసిందామె- అటు వేపు.

ఎవరో యువకుడు. ఇరవైకీ పాతికకీ మధ్య ఉండొచ్చు వయసు. మంచి బట్టలే వేసుకున్నాడు.

అటూ ఇటూ తిరుగుతాడే తప్ప లోపలికి రాడేం?

ఆమె అతన్నే పరిశీలించసాగింది.

ఐదు నిమిషాలు చూశాక ఆమెకు విసుగేసింది. సంగతేమిటో తేల్చుకుందామని గేటు వేపు తనే నడవసాగింది.

అతను భయపడుతూ గేటు అవతల.

ఆమె ఇటు.

"ఎవరు మీరు? "

"నేను... నేనొక స్టూడెంటుని" తడబడ్డాడు చెప్పడానికి.

"మీ పేరు? "

"కిషోర్- మీరు కాపరికదూ? "

"ఔను ఏం కావాలి మీకు? " అడిగిందామె సౌమ్యంగా.

అతను భయంనుంచి, కంగారునుంచీ సర్దుకుని స్థిమితపడ్డాక అడిగింది.

కిషోర్ సిగ్గుపడిపోయాడు.

"ఫరవాలేదు. చెప్పండి. ముందు- లోప లికి రండి. ప్లీజ్" సభ్యత జ్ఞాపకమొచ్చి గేటు తెరుస్తూ ఆహ్వానించింది. అతను తనకే ప్రమాదం తేలేని లేతవయసు విద్యార్థి అనిపించాక!

"నో... ప్లీజ్... వద్దు" కంగారుపడిపో యాడు.

"ఏమీ? "

"నాకు శ్మశానమంటే భయం" సిగ్గుపడి పోయాడు.

"మరెందుకొచ్చారూ ఇక్కడికి పని కట్టు కుని? "

"మీరేమీ అనుకోనంటే..."

ఆడపిల్లలా అతనలా మెలికలు తిరిగి పోతూంటే ఆమెకు నవ్వొచ్చింది.

ఆపుకుంటూ- "అనుకోనుగానీ చెప్పండి" అంది అభయమిస్తున్నట్లే.

"మరి మేము పందెం వేసుకున్నాం"

"ఏమని? "

అతను తల వొంచేసుకుని. "మనిషి చచ్చి పోయాక అతని అరచేతుల్లో గీతలు మాయమైపోతాయని మా ఫ్రండూ, కావని నేనూ" ఆగిపోయాడు.

ఇక నవ్వాపుకోలేకపోయిందామె.

"ఇంతకంటె మంచి విషయాలూ పనికొ చ్చేవీ మరేవీ దొరకలేదూ పందాలు కాసు కుందుకు? మనిషే చచ్చిపోయాక అతని చేతిగీతలు ఉంటేనేం, ఊడితే ఏం? ఉన్నా ఎంతసేపు? కాల్చి బూడిద చేసేవరకేగా? మీరు చచ్చినవారి కళ్లు చేరడేసి అనే సామెత వినివుంటే ఇలాటి పందెం కాసి ఉండరు"

"ఉహుఁ... అదికాదు. తెలుసుకుందా మని. జ్ఞానం సంపాదించుకుందామని"

"దీనినే పనికిరాని పరిజ్ఞానమంటారు. సర్లెండి. దీనికోసం ఇంతవరకూ రావడందే నికీ? ఏ శవాన్ని చూసినా ప్రత్యక్షంగానే తెల్సుకోవచ్చుగా? "

"ప్రయత్నించాను, తెలిసినవారిలో ఒకరు చనిపోతే. నిజానికి నాకు శవమంటే చచ్చేంత భయం. అయినా ఎలాగో గుండె లుగ్గబట్టుకుని దగ్గరకు వెళ్లాను. ముక్కులో, చెవుల్లో... దూది. అరచేతులు చూద్దా మంటే అవేమో ముడుచుకుని ఉన్నాయి. విడదీసి చూద్దామంటే చుట్టూ ఎందరో ఉన్నారు"

"ఓహో! అయితే ఈసారి శవం రావడం చూసి మీరే రండిక్కడికి. శవాన్ని చితికె క్కించే ముందు చూద్దురుగాని"

"ఎవరి శవాన్నో అలా పరీక్షించడం బాగుండదుగా? చనిపోయినవాడికి నువ్వే మౌతావని అడిగితే ఏం చెప్పాలి? "

"మరెలా? "

"ప్లీజ్... మీరు రోజూ బోలెడన్ని శవాలు చూస్తూంటారుగా"

"కాని శవం అరిచేతుల్లో గీతలున్నాయా లేదా అని ఎప్పుడూ చూడలేదు"

"మా కోసం చూడండి, ఈసారి శవమొ చ్చినప్పుడు"

"దానికేం భాగ్యం? అలాగే చూస్తాను. కాని"

"ఏమిటి? "

"ఉన్నాయనో, లేవనో ఏదో ఒకటేకదా నేను చెప్పేది? "

"ఔను"

"నేనేం చెప్పినా ఒకరికి వ్యతిరేకమే అవు తుందిగా"

"ఊఁ"

"కనుక వారు నా మాటలని ప్రమాణంగా అంగీకరించకపోవచ్చు పందెం ఓడిపోతామన్న యిదిలో" ఏమంటా




రన్నట్లు చూసింది.

"నిజమే. మరెలా? పందెం కలిపి మధ్య వర్తికి ఇచ్చేశాం కూడానే"

"డాక్టరు, కాటికాపరి వీరిద్దరిలో ఎవరి నైనా ప్రమాణికంగా అంగీకరించగలరేమో తేల్చుకోండి ముందు మీరిద్దరూ. అలా ఏకీ భవించలేకపోతే ఇద్దరూ కలిసి ఇక్కడికే రండి. మీ కళ్లతో మీరే చూడొచ్చు శవం చేతిలో గీతలుంటాయో మాయమౌతాయో"

"బాగుంది. మంచి ఐడియా ఇచ్చారు. థాంక్స్ మళ్లీ కలుస్తా" అని వెళ్లిపోయాడా అబ్బాయి గేటు అవతలినుంచే.

శివానికి నవ్వూ వచ్చింది, జాలీ వేసింది.

ఈ కాలపు పిల్లలు ఇలా తయారవుతు న్నారేం? పనికిరాని పరిజ్ఞానం వెంట ఎందుకు ఇలా వెర్రిపరుగులు పెడుతు న్నారూ? టీవీ ఛానెల్స్ మహాత్మ్యమేనా ఇదీను?



**చ**దువుతున్న నవల "పితృవనం" ఎంత ఆకట్టుకునేదిగా ఉందంటే శివానికి టీ కాచుకు తాగడానికి కూడా లేవబుద్ధి కాలేదు.

శవవాహకుల గురించిన నవల అది. ఒక్కొక్క పాత్ర వెనుకా ,ఎంతో కథా యింకెంతో వ్యధా. ప్రతి పాత్రా సజీవంగా ఉండి మానవత్వంతో తొణికిసలాడుతోంది.

సంఘటనలు కూడా అత్యంత సహ జంగా. హేతుబద్ధంగా జరుగుతున్నాయి.

మనిషి తాలూకు బలమూ, బలహీనతా కూడా ప్రతిబింబింపజేస్తున్నాయి పాత్ర లన్నీ.

భాషలో ఎక్కడా కృతకత్వం లేకుండా మామూలుగా ఆ మనుషులెలా మాట్లాడు కుంటారో ఆ భాషలోనే రాయబడింది నవ లంతా.

"అసలు కథావస్తువే విలక్షణమైనదీ, విచి త్రమైనదీ. పీడిత వర్గపు నవల అని ముద్ర వేయకుండానే అధోజీవుల గాధలను చిత్రిం చారు రచయిత.

శవవాహకులకంటె అధో జీవులెవరు?

ఆకలి, నిరుద్యోగం, కన్నీళ్లు, వ్యధ. మౌలిక సమస్యలకు రాజీపడని ధోరణిలో నిర్మోహమాటమయిన చిత్రణ.

నవలనిండా నిష్టుర, నిప్పచ్చర బతుకుల ఫొటోలే.

ఎన్నెన్ని వాస్తవాలు!

ఎన్నెన్ని ఆలోచనా కోణాలు!

నిత్యజీవిత సత్యాల నిలువుటద్దమే ఇది!

క్రయిమ్, హారర్, సెక్స్, థ్రిల్, డిటెక్షన్‌ల వంటివేమీ లేకురడా కేవలమూ వాస్తవం తోనే అమోఘమయిన నవల వ్రాయవచ్చు ననేందుకు ఉదాహరణలా ఉందీ నవల.

ట్రూతీజ్ స్ట్రేంజర్ దాన్‌ఫిక్షన్. ట్రూతీజ్ స్ట్రాంగర్ దాన్ ఫిక్షన్.

అసలు సిసలయిన ఉత్కంఠ కల్పనలో కాక కటిక నిజంలోనే ఉంటుంది. కల్పన లోంచి కంటె కఠోర వాస్తవికతలోంచే అద్భుత రచనలు వెలువడతాయి.

ఈ రచన ధన్యం. దీని రచయిత ధన్య

జీవి! అనుకుంది శివాని.

నవల చదువుతూంటే ఒక్కోచోట ఆమె కళ్లు చెమర్చాయి.

మరోచోట మందహాసం మొలిచింది.

ఒక అధ్యాయం గుండె బరువెక్కిస్తే మరో పాత్రలోని మానవత్వం, మనసుని తేలిక చేసింది.

నవల ఒకవిధంగా నవరసభరితంగా ఉండి ఆకట్టుకుంది.

కథ ముగిసినా ఆ పాత్రలూ, సంఘటనలూ మెదడులోనే తిరుగుతూంటే టీ తాగడం కూడా మరిచిపోయి పుస్తకాన్ని చేతిలో ఉంచుకునే అలా చూస్తూ ఉండిపోయింది.

చితిమీద శవం కాలుతోంది.

అటు సూర్యుడు త్వరలో అస్తమించేస్తానని హెచ్చరిక చేస్తున్నాడు ఎర్రగా. శివాని అతనివేపు చూసింది.

ఏమయినా సరే ఇవాళ ఇతని సంగతి తేల్చుకోవలసిందే అని నిశ్చయించుకుంది. కాలుతున్న శవం తాలూకు వాళ్లు ముగ్గురున్నారు. వాళ్లవాడే మరో నౌకరూ ఉన్నాడు. కనుక తనకేమీ పనుండదిప్పుడప్పుడే. శవం కాలటం దాదాపు చివరిదశ కొచ్చేసింది. అంతగా కట్టెలనో, శవాన్నో సవరించవలసివస్తే ఆ నౌకరు చూస్తాడు.

ఆమె అతనివేపు నడిచింది.

అతను చితికి కొంచెం దూరంగా ఒంటరిగా నిలుచున్నాడు. కాలుతున్న శవానికి కళ్లప్పగించి.

విచిత్రంగా అతని కళ్లల్లో ఆనందం! అసూయ.

ఆశ్చర్యపోయిందామె.

శ్మశానంలోకి వచ్చాక మనసులో లేకపోయినా బయటకయినా విచారం నటిస్తారు. అది ఇక్కడి సభ్యతానియమం. శ్మశానంలో నవ్వు అసభ్యత.

ఇతనెవరూ చితిని చూస్తూ చిరునవ్వులు వొలకబోస్తున్నాడు? ఇతనెవరు? చాలా కాలంగా గమనిస్తూంది. తరచుగా వస్తాడతను. శవం తాలూకు బంధువు (చనిపోవడమంటే బంధాలు తెగిపోవడం. మరి శవానికి బంధువులుంటారా?) అనుకుందామంటే రకరకాల కులాలవారికి చెందిన శవాల సంస్కారాలకీ హాజరయ్యాడు. చనిపోయినవారి స్నేహితుడిగా వచ్చాడనుకుందామంటే ఆ శవం ముసిలి స్త్రీదయినా వయసులో ఉన్న వనితదయినా, పేదరాలయినా, ధనికురాలయినా ఇతను హాజరే! అన్ని కులాలవారికీ ఎలా బంధువు కాగలడు? అన్నిరకాలవారికి స్నేహితుడూ కాలేడుగదా! మరి?

ఏ సంబంధమూ లేకపోయినా భోజనానికాశపడి పెళ్లిళ్లకు వెళ్లేవారుంటారు కానీ... అనవసరంగా శ్మశానానికొచ్చేదెవరు?

చాలారోజులనుంచి ఇతనొక ప్రశ్నార్థకమై మనసుని కుమ్మరి పురుగులా దొలుస్తున్నాడు. ఇవాళ ఇతని సంగతి తెలుసుకోవలసిందే... తేల్చుకోవలసిందే.

కాలుతున్న శవం బంధువులు చితికి దూరంగా ఉన్నారు. ఇదే మంచి తరుణం.

"చూడండి"

అతను తుళ్లిపడ్డాడు. రసభంగమైనవాడిలా ముఖం అదోలా పెట్టి,

"నా పేరు మహర్షి" అన్నాడు.

"ఈ శవం మీకేమవుతుంది? "

"మా ఇద్దరిదీ ఒకేజాతి. మానవజాతి. దేశానికి నేను చేసిన ప్రతిజ్ఞననుసరించీ, ఆలిండియన్నార్ మై బ్రదర్స్ అండ్ సిస్టర్స్... అనే వాక్యాన్ని బట్టీ చనిపోయిన ఇతను నా సోదరుడు"

అతని మాటలు తమాషాగా అనిపిం





చాయి.

అతను వేదాంతా? పిచ్చివాడా? కదిపీ కదిపీ చూద్దామనిపించింది.

"కాని... మీరు మీ సోదరుడు దహించబడుతూంటే మందహాసం చిందిస్తున్నారు" నేరారోపణ చేస్తున్నట్లే అంది.

"నేను వీడ్కోలు చెబుతున్నాను. చిట్టచివరి వీడ్కోలు"

"ఇతనిది మామూలు ప్రయాణం కాదు చిరునవ్వులతో సాగనంపడానికి. మహాప్రస్థానం. తిరిగిరాని ప్రయాణం. భూమిమీంచీ మానవులనుంచీ శాశ్వతంగా నిష్క్రమిస్తున్నాడు. కనుక మనం దుఃఖించాలి" ఔనా అన్నట్లు చూసింది.

అతను నవ్వాడు. అజ్ఞానమో, అమాయకత్వమో నిండిన మాటలు వింటున్నట్లు.

"మీ ప్రశ్నలో ఉంది జవాబు. మరణాన్ని మహాప్రస్థానమనీ, పెద్ద ప్రయాణమనీ మీరే చెప్పారు. మరి చిన్న ప్రయాణపు వీడ్కోలుకి చిరునవ్వు సరయిన వీడ్కోలు విధానమే అయినప్పుడు పెద్ద ప్రయాణమైన చావుకి దరహాసమేకదా తగినది? మరి దుఃఖించడమెలా సమంజసం?

"చిన్న ప్రయాణం చిన్న నవ్వు. పెద్ద ప్రయాణం- పెద్ద నవ్వు. అదేకదా సరయిన ఈక్వేషను?"

ఆలోచించవలసిందే అనిపించింది. "కాని లోకం, ఆచారాలు సంప్రదాయాలు, అలవాట్లు" గొణిగిందామె.

"లోకులు కాకులు. మూర్ఖులు. సారీ. అమాయకులనుకుందాం పోనీ... ఏమిటలా చూస్తారు? లోకుల్ని మూర్ఖులన్నాననా? వివరిస్తాను"

అదే సమయంలో శవం లేచికూర్చుంది. లేచి కూర్చోవటమంటే మరేమీ కాద

మనిషి ఎముకలలో ఒక ద్రవముంటుంది. చితిమీద ఉండే అధిక ఉష్ణోగ్రత ఎముకలలోంచి ఆ ద్రవానికి కూడా సోకి వ్యాకోచిస్తుంది. ఎముకలో జాగా చాలదు. దానితో ఎముకలలో అధికంగా చలనం కలుగుతుంది (ఒకవైద్యుడిచ్చిన వివరణ యిది) ఫలితంగా శవం లేచి కూర్చుంటుంది.

కర్రతో రెండుబాదులు బాదింది శివానీ ఆ లేచిన శవంమీద. దాంతో అది చచ్చినట్లు మళ్లీ పడుకుని... బుద్ధిగా కాలిపోసాగింది. దండం దశగుణం భవేత్! కాటికాపరి చేతిలో దుడ్డుకర్ర యిందుకే. శవాలకి బుద్ధిచెప్పడానికే.

ఆమె మళ్లీ మహర్షివేపు తిరిగింది చెప్పమన్నట్లు.

"ప్రతిమతం చెప్పేదీ దేముడొక్కడే అనీ, మానవసేవే మాధవసేవ అనీ.

"కానీ యిన్ని మతాలు!

"వీటిని ప్రోత్సహించేది లోకులే!

"దేముడు సర్వాంతర్యామి అంటూనే దేముడికి గుడులు!

"భగవంతుడు భక్తజనసులభుడంటూనే దేముడి ఏజెంట్లుగా బాబాలు!

"ఈ దళారీ బాబాలని కొలిచే బదులు నేరుగా దేముడినే కొలుచుకోవచ్చుగా అని ఆలోచించరు ఎందుకు బాబాభక్తులు?

"లోకుల అమాయకత్వాన్ని నిరూపిద్దామని చెప్పానీవిషయం. ఇక మన విషయానికొద్దాం. దానికి ముందే మీకు మరో విషయం చెప్పాలి" ఆగాడతను.

"చెప్పండి" అందామె శవంవేపే చూస్తూ.

"కొన్ని శవాలకి 'కపాలమోక్షం' జరుగుతూ వుంటుంది. పుణ్యాత్ములకీ, మహాజ్ఞానులకీ అలాంటి మోక్షం జరుగుతుందని చాలామంది నమ్మకం. కాని... వారిది అపోహే అవ్వొచ్చు కపాలంలో కూడా

ద్రవపదార్థాలుంటాయి. కపాలపు ఎముకలు ఎంత దృఢమైనవంటే పూర్వం మెదడుకి ఆపరేషన్ చేయవలసి వచ్చి పుర్రెని తెరవాలంటే కపాలంలో డ్రిల్లింగ్ చేసి రంధ్రాలు పెట్టి... కపాలపు జాయింట్లను సుత్తీ, సేనాలతో పగలగొట్టేవారు. అంత దృఢమయినవి పుర్రె ఎముకలు. లోపలి ద్రవం విపరీతమయిన వేడికి వ్యాకోచించి... స్థలం చాలక కపాలాన్ని ఛేదించే క్రియలో ఎముకలు పగులుతాయి. విడిపోతాయి. అందుకే అంత శబ్దమూ, అలజడీ. అంతే తప్ప కపాలం పగలడం మనిషి పుణ్యానికీ, ప్రతిభకీ నిదర్శనం కాదని వైద్యులే చెప్పారు.

"నేను తీరికగా ఉన్నప్పుడు యిలా శ్మశానానికి వచ్చినట్లే ప్రసూతి ఆసుపత్రులకీ వెళ్లొస్తుంటాను" అన్నాడు మహర్షి.

"ఎందుకూ? "

"మనుషులు జన్మించేదక్కడే కదా? ఆ శిశువులకి దుఃఖంగా స్వాగతం చెప్పొద్దూ? "

చాలా సహజంగా ఉందతని కంఠం.

ఆమె ఆశ్చర్యానికవధి లేకపోయింది. "శిశువులు జన్మిస్తే విషాదస్వాగతమా! అక్కడ ఏడిస్తే... అదే విచారం వెలుబుచ్చితే... వాళ్ళూరుకున్నారా! శుభమా అని శిశోదయం జరిగితే పనిపూలా వచ్చి పరితాపం ప్రదర్శిస్తావేం అని నిలదీయలేదూ?"

"మాటలతో నిలదీసి ఊరుకుంటే బాగుండేదే గానీ... కొన్నిసార్లు కొట్టబోయారు కూడా. కాని నేను నా పద్ధతి మార్చుకోలేదు. నేను నమ్మిన సిద్ధాంతం..."

"ఏమిటది? "

కుతూహలంగా అడిగింది.

మనిషి పుట్టినప్పుడు ఏడ్చీ చనిపోయేటప్పుడు సంతోషించే యీ వ్యక్తి సహజంగానే ఆమెనాలోచింపచేసి వదిలాడు. "ఏమిటి మీ సిద్ధాంతం? "

"దానిని లాజిక్ అనడం మరింత న్యాయమనుకుంటాను సరే... భగవంతుడు- భూమినీ, మనుషులనీ ఎందుకు సృష్టించాడు? భూమ్మీద మనిషిని సుఖపడమని. అందుకే ప్రకృతినిండా పూలు, చెట్లూ, వెన్నెలా, నదులూ, స్త్రీలూ వంటి అందాలు.

"కాని మనిషేం చేశాడు?

"తాగలేని పిల్లి పాలొలకబోసుకున్నట్టు ప్రకృతిని ఆనందించడం మాని గెలవాలని కోరుకోవడం మొదలుపెట్టాడు.

"స్త్రీనికూడా ప్రకృతి అనడం ఒక కారణమేమో పురుషాధిక్యతకు మానవుడి అవసరాలే తప్ప ఆశలు తీర్చజాలదు ప్రకృతి. ప్రకృతితో పోరాటంలో మనిషి చాలా కోల్పోయాడు. అందుకే యివాళ మానవ జీవితమంతా యాతిబాధలమయం.

"కులాలు, మతాలు, అధికారాలు, కలిమి, డబ్బులేమి, కొత్త కొత్త రోగాలు, క్యూలు, ఆకలి, నిరుద్యోగం, చిన్న విషయంకూడా బ్రహ్మప్రళయమంత సమస్య కావడం- యివన్నీ మనిషి స్వయంకృతాపరాధాలే.

"మీరు మనస్ఫూర్తిగా ఆలోచించండి. ఇవాళ మనిషికి ఏం సుఖం మిగిలింది? ఎందుకొచ్చిన బతుకురా బాబూ అనుకునే వాళ్ళే కదా అధిక సంఖ్యలో? చావలేక బతుకుతున్న వాళ్ళేకదా చాలామంది? "

"ని...జ...మే..." అంది శివానీ కాదనలేక.

"మరి యిలాంటి దుఃఖమూ, సమస్యలతో నిండిన ప్రపంచంలోకి బలవంతంగా తేబడుతున్న మానవప్రాణికి చెప్పే స్వాగతం విషాదంగా ఉండాలా? వెర్రి ఆనందంగా ఉండాలా? పాతఖైదీ- కొత్తగా జైలులో కొస్తున్న వాడికి పలికే ఆహ్వానం ఎలా ఉండాలి."

అతని మాటలలోని నిజాయితీకీ, నిష్ఠూ

రానికీ ఆమె తెల్లబోయింది. ఒక నిముషం పాటు నోటివెంట మాటరాలేదు.

అంతలోనే అతను మళ్లీ తన ప్రశ్నను శరంలా సంధించేశాడు. "అలాటి దుఃఖభాజనమూ, రోగపూరితమూ అయిన ప్రపంచంనుంచి విముక్తిచెంది, మరణమనే వరం ద్వారా బయట పడుతున్న మనిషికి మనం చెప్పే వీడ్కోలు ఎలా ఉండడం న్యాయం?

"భయంకరమూ, బాధాకరమూ అయిన రోగంతో ఆసుపత్రికొచ్చి దానినుండి విముక్తుడై సుఖమయ ప్రపంచంలోకి వెళ్లిపోతున్న రోగ విముక్తుడికి సాటి పేషెంట్లు యిచ్చే వీడ్కోలులా చిరునవ్వులతో కూడి ఉండొద్దూ? " అతని సూటిప్రశ్నకు సమాధానం ఆమె వద్దలేదు.

మనిషి జన్మించినప్పుడు విషాద స్వాగతం;

మరణించినప్పుడు ఆనందంగా వీడ్కోలు! ఆమె జీర్ణం చేసుకోలేకపోతోందా విచిత్రలోక వైపరీత్యాన్ని. జననానికి రోదన! మరణానికి మందహాసం... అనుసరించగలదా లోకం? అంగీకరించగలదా? అవతల శవం తన మానాన తాను కాలిపోతూంది.

ఆమె నిశ్చేష్టురాలుగా ఉండిపోయింది. ఎప్పుడు వెళ్లిపోయాడో ఆ మహర్షి.

ఇంగువ కట్టిన గుడ్డమూట... యింగువని తీసేసినా వాసన వేయడం వొదలనట్లు అతను నిష్క్రమించినా... అతని మాటలు రేకెత్తించిన ఆలోచనలు మాత్రం ఆమెను విడవడంలేదు. ఎన్నెన్నో సందేహాలు కలుగుతున్నాయి. 'నాకోసం చెమ్మగిల్లునయనమ్ములేదు' అని వాపోతుంటారెందరో.

"నేను చనిపోయాక నా శవంమీద రెండు కన్నీటి బొట్లు రాల్చు చాలు. అంతకంటె నాకింకేమీ అక్కర్లేదు' అంటాడు ప్రియుడు ప్రేయసితో.

మహర్షి చెపుతున్న ప్రకారథ్థ అయితే మరి యివన్నీ హాస్యాస్పదాలే. జీవితాన్ని వెలుగుతోనూ మరణాన్ని చీకటితోనూ (పగలు-రాత్రితో) పోల్చాడు ప్రఖ్యాత ఆంగ్లకవి.

మరి అతనూ తప్పేచేశాడా?

జీవితమే చీకటా! మృత్యువే వెలుగా! అయినా... చావుతో చాలా సెంటిమెంట్లు...

నలుగురి మధ్యా చావాలని కొందరికోరిక.

దిక్కులేని చావు రాకూడదని కొందరు.

అసలు చావుకి దిక్కేమిటి? ఎవరు?

తన శవాన్ని ఐనవారే తమ చేతులమీదుగా వెళ్లదీయాలన్న వెర్రితనం ఇంకొందరికి. మనిషి చచ్చాక... నిర్జీవమైన ఆకట్టెను... మునిసిపాలిటీవాళ్ళే యీడ్చి పారేశారో, కుక్కలూ, రాబందులూ పీక్కుతిన్నాయో... బంధువులే మోసుకెళ్లారో... ఏం తెలిసి చస్తుంది మనిషికి చచ్చాక? ఆ మాత్రం దానికలాటి కోరికలెందుకూ. అలాగే... తను చచ్చిపోయాక ఎవరేడిచారో ఎవరు నవ్వుకున్నారో తెలియదుకదా...

మరి చెమ్మగిల్లు నయనాలకోసం చింతించడం ఎందుకూ?

'చచ్చిపోవడమంటే... మరేమీకాదు. నువ్వుమాత్రం ఉండకుండా మిగిలిన ప్రపంచం అంతా అలాగే ఉండడం-'

ఎవరు రాశారో గుర్తులేదు కానీ ఎంత అద్భుతంగా చెప్పారు మూడుముక్కల్లో చావంటే అందరికీ అర్థమయ్యేలా. చావుకి యీ భాష్యమే కాని తెలుసుకోగలిగితే. ఎంత తేలికగా తీసుకోగలిగేవారో చావుని!

ఎంత గొప్పవాడి శవమయినా...ఎంత ఉన్నతకులంవాడిదైనా... ఎంత మేధావి మృతశరీరమైనా... చివరకు తగలబడేది కాటికాపరి లాటివారి చేతులద్వారానే. ఈ ద్వారంలో ప్రవేశించేవరకే ఏ తేడాలయినా. మామూలు దుంగలతో ఐనా మంచిగంధపు చెక్కలతో ఐనా శవం చివరకు కాలవల

సిందే.

దేశాన్నేలిన ప్రభువుల కయినా... దేహీ అని అడుక్కుంటూ బతికిన ఆగర్భ దరిద్రుడికయినా శ్మశానంలో దొరికేది ఆరడుగుల నేలే.

అంతవరకూ ఎంత ఖరీదయిన పట్టుచీరలు చుట్టబడిన దేహమయినా, ఎన్ని నగలు దిగేసుకున్న స్త్రీ అయినా, చితి ఎక్కేసరికి మొలనూలు కూడా మిగలక మొండి మొలతో మంటల పాలు కావలసిందే. బతికున్నంతసేపే గొప్పలు. చచ్చాక ఎవరిపనయినా బూడిద కావటమే! ఇవన్నీ మనుషులకి తెలియకనా? ఉహూ... తెలిసినా ఎప్పటికప్పుడు ఏదో మాయలో పడిపోతూంటారు. మాయామేయ జగంబె నిత్యమని సంభావించి... ఆటలో పావులైపోతూంటారు. అదే మరి ప్రపంచ కేళి... జీవిత లీల!

చిత్రమేమిటంటే... చావు అనంతరం కూడ తమ ఘనతని నిలబెట్టుకోవాలనుకుంటారు కొందరు.

అదిగో... ఆ తులసికోట అలాటి ఒక వెర్రి వాడికే తార్కాణం. దహనం చేస్తే తులసికోటలు కట్టరు సాధారణంగా. ఖననానికే అలా గోరీలు. కాని... అతనికి సంప్రదాయం మేరకూ దహనం జరిగింది. కాకపోతే... అతని చివరికోరిక తీరాలంటే తులసికోట ఉండాలి, దానిమీద అతని వివరాలుండాలి.

అందుకని భూమిలో అతని బొమికెలిన్ని పడేసి సమాధి కట్టారు. ఆ సమాధిమీద అతని పేరూ, అంతకంటె పెద్దక్షరాలతో 'సినిమా ఆపరేటర్' అని ఉంది! అతని ముఖ్యమైన ఆ చివరి కోరిక. భ్రమనే ఆధారంగా చేసుకు బతికే సినిమాకి నిజజీవితంలోనూ ప్రపంచంలోనూ ఎంత పట్టం





కట్టబడుతోంది.

సినిమా అనేపదంతో సంబంధముంటే చాలు. అతను మిగిలిన వారందరికంటే గొప్పవాడిగానే జమ. ఈ దేశంలో మేధావికీ, సైంటిస్టుకీ, రాజకీయ నాయకుడికీ, సంస్కర్తకీ ఎవరికీ ఉండనంత గౌరవం. ఒక సినిమా ఎక్స్ట్రాకయినాసరే.

నిజాన్ని చూడలేక నీడల వెంటపడడమే కదా సినిమాలనింత పిచ్చిగా అభిమానించడమంటే!

సినిమా ఒక భ్రమ.

అది వెండితెరకాదు, వొట్టిగోడ.

ఆ కదిలేవి మనుషులుకాదు, వారి నీడలు.

అది వాస్తవం కాదు, కల్పన.

సినిమా- ఎస్కేపిజం.. పలాయనవాదం.

ఐనా దీని వెనుక ఎందరి వెర్రి పరుగులో! ఏ కళాకారుడి ధ్యేయమైనా సినిమాయే ఐపోయింది!

గుడ్లగూబ అరిచేసరికి- ఆలోచనా లోకంలోంచి యిహలోకంలోకి వొచ్చిందామె.

అప్పటికే దట్టంగా అలుముకుంది అంధకారం.

ఒక మధ్యాహ్నం...

గంటకిందట ఒక శవం కాలింది.

శివాని ఆ విధి నిర్వర్తించి, స్నానంచేసి వొచ్చి.. వండుకు తిని పడుకుంది.

నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాళ్లెవరన్నట్లు... ఆమెకు శవాలూ, దహనాలూ మామూలైపోయాయి. ఆపరేషన్లు చేసే డాక్టర్లలాగే ఆమె కూడా జుగుప్సని చాలావరకూ జయించేసింది. అందుచేతనే ఆమె అటు శవాన్నీ కాల్చి..యిటు వంటాచేసుకుని... ఏమీ జరగనట్టే అన్నం తినగలిగింది. ఇంకా ఆమెకు నిద్ర పట్టలేదు.

"కాపరీ... కాటికాపరీ... కాటికాపరి బాబూ..."

పిలుపులు... ఆమె కొంచెం ఆశ్చర్యపడుతూనే లేచింది మంచంమీంచి. మిట్టమధ్యాహ్నం, మిడసరి లగ్నమని... సాధారణంగా యిటువంటి సమయంలో శవదహనం పెట్టరు. మరి పిలుస్తున్న వారెవరో? అనుకుంటూ తడికె తెరిచింది.

ఎవరో... యిద్దరు... పల్లెటూరి వాళ్లలా ఉన్నారు. మోటుగా పెద్దపొట్టలు... పుట్టగోచీలు... భుజాన గోనెసంచిలు... చేతిలో చేటలు... నల్లగా చెమటలు కారుతున్నాయి. వాళ్ల మొలలకి వెండి మొలతాళ్ళున్నాయి.

"ఎవరు మీరు?"

"జలగడుగులవాళ్లం. కాపరిబాబు కావాల..."

"ఎందుకూ?"

"మంతనాలాడాలి"

"ఆడండి. నేనే కాపరిని"

వాళ్లు నమ్మలేదు "మాతో పరాసికాలేటి తల్లీ... కాపరిబాబుని పిలు"

"నిజంగా నేనే. ఆసెకాలాడడంలేదు"

ఈపాటికి వాళ్ళు నన్ను నమ్మగలిగినట్టున్నారు. "ఆడవాళ్ళేటి, కాటికాపరేటి?" అని నోరు వెళ్లబెట్టారు.

అదంతేలే అన్నట్లు నవ్వాను నేను.

"ఇక్కడెండగా వుంది. అలా సెట్టునీడకెళ్లి మంతనాలాడుకుందాం తల్లీ..." అన్నారు. మర్రిచెట్టుకిందకి నడిచాము.

ఎంతో చల్లగా ఉంది.

అందుకే అంటారు కూపోదకం, వటచ్ఛాయా... అని. దిగుడుబావిలోని నీరూ... మర్రిచెట్టునీడా మహా చల్లనివట.

మర్రిచెట్టు ప్రత్యేకత అంతేకాదు. పెరిగిన మర్రి చెట్టు ఒక్కొక్కటి... వెయ్యిమంది మనుషులు కలిగించే వాతావరణ కాలుష్యాన్ని నిరోధించగలదట. ఆక్సిజన్ యివ్వగలదట. అందుకేనేమో... మునుపు రోడ్ల కటూ యిటూ మర్రిచెట్లు పెంచేవారు. విద్యుచ్ఛక్తీ, రోడ్ల విస్తరణల పేరుతో మర్రిచెట్లని నాశనం చేసెయ్యబట్టే యిప్పుడిలా ఎండలు మండిపోడమూ, వర్షాలు తగ్గిపోడమూ, వాతావరణ కాలుష్యం పెరిగిపోడమూ., మర్రి ఊడలతో పళ్ళు తోముకుంటే... పళ్ళు మిలమిల మెరుస్తుంటాయనీ, ఆరోగ్యకరమనీ... తను అవే వాడేది.

"నాపేరు గంగన్న... ఈడిపేరు సింగన్న. జలగడుగులవాళ్లం..." అంటూ భుజాల మీది గోనెలూ, చేతుల్లో చేటలూ మర్రిచెట్టు మొదట్లోపెట్టి కూర్చున్నారు.

"జలగడుగులవాళ్లంటే?"

"తల్లీ..." అంటూ గొంతు సవరించుకున్నాడు గంగన్న. చూడబోతే అతనేదో పెద్ద కథే చెప్పేటట్టున్నాడు.

"రెల్లిపని... పాకీపని...ఎలా పుట్టిందో తెలుసా?"

"తెలియదయ్యా"

"ఒరియా దేశంలో రాజులు... కిళ్లీలో బంగారం రేకులు వేయించుకుని తినేవారు ఆరోగ్యమనీ, పురుషత్వం పెరుగుద్దనీ. ఐతే... తిన్న బంగారంలో అరిగేది అల్పం. బయటకు విసర్జించబడేదెక్కువ. అందుకని ఆ రాజుల మరుగుదొడ్లమీద కెగబడేవాళ్ళు పేదోళ్ళూ, కక్కుర్తోళ్ళూ. మలం కడిగి... బంగారం తీసేవారు. మేం పాకీవాళ్లం కావు. కాని... బంగారం అవీ తీస్తాం..."

"దేన్నుంచి?" అడిగింది శివానీ.

"మట్టిలోంచి... రకరకాల మట్టిల్లోంచి"

"నాకర్థం కావడంలేదు"

"సూడమ్మీ... శవంకాలిన బుగ్గుందా... దీనిని పట్టుకెళ్ళి కడుగుతాం. కడగ్గా కడగ్గా కాసింత బంగారం కళ్ళజూస్తాం..."

"ఈ బూడిదలో బంగారమా!"

సింగన్న నవ్వాడు ఆమె అజ్ఞానానికి. గంగన్న చెప్పసాగాడు. "దీన్లోనూ ఉంటుంది. ఆచారమని శవంనోట్లో బంగారమేస్తారు. లేదా... చితిమీదేస్తారు. కొందరు దనవంతులు చచ్చిపోయినవారి శరీరంమీద కొన్ని నగలు, వెండీ వదిలేస్తారు. కొన్ని శవాలకు ఉంగరాలు ఊడిరావు. కొందరికి కడియాలూడిరావు. అవన్నీ శవంతో కాలిపోయేవే. అంచేత ఈ కాటిబూడిద మాకు బంగారమే. మా అదురుస్టాన్ని దీన్లోనే ఎదుక్కుంటాం. మురిక్కాలవల్లో మట్టి కూడా తీస్తాం యీ మట్టి దొరకనప్పుడు. కాలవల్లో నగో, నట్రో, డబ్బు పడిపోయిందని తెలిస్తే పరుగునపోయి ఆమేర మట్టంతా ఎత్తుకొస్తాం..."

"ఆ..." ఏదో జ్ఞాపకం వొచ్చినట్లు గొణుక్కుంది శివానీ. ఔను. ఇలాంటివాళ్ల గురించి తనెక్కడో చదివింది.

"మీకీవృత్తిలో బాగా కిడుతుందా? "

"అదురుష్టం బాగుండాలి తల్లీ. అదేమో మురిపించుకుని అప్పుడప్పుడే సల్లంగా జూస్తది. మమ్మల్ని చూస్తుంటే తెలవడం నేదూ మా అదురుస్టమేపాటిదో..."

"సరే... మీకు నాతోపనేమిటి? "

"ఈ బుగ్గి నీది... కాటికాపరివి కనక నువ్వు ఒప్పుకుంటేనే పట్టుకెళ్లగలం. ఊరికే అక్కర్లేదు. గంపకి రూపాయి చేసుకో.

"కాటిబుగ్గికి ఖరీదా! ఒద్దొద్దు. యీ బుగ్గి యిక్కడుండి ఏం ఉపయోగం. ఎత్తిపోతలకి పైపైది ఉంచి అడుగుదంతా తీసుకోండి. నాకేమీ యివ్వక్కర్లేదు" అందామె.

"దయగల తల్లివి. నీకు మాటరాకుండానే బుగ్గి ఎత్తుకెళ్తాం. నువ్వు సేత్తున్న ఉపకారం ఉంచుకోనులే. సీకటడ్డాక వొచ్చి బుగ్గెత్తుకెళ్తాం"





"ఏం ఉపకారం చేస్తారూ? " ఊరికే అడిగిందామె.

"మేం మాటలమనుషులం కాం తల్లీ. సేసే సూబెడతాం" అని దణ్ణాలు పెట్టి వెళ్లిపోయారు. శవాన్ని కాల్చిన మూడోరోజున కొందరు ఎత్తిపోతల కార్యక్రమం పెడతారు. చితిమీద బుగ్గిని ఎత్తి అవతల పోస్తారు కావలసిన అస్తికలు (ఎముకల శేషాలు) ఉంచుకుని. ఈ జలకడుగులవాళ్లకి అలాటి బుగ్గే కావాలి! ఏమట్టి లేదా బూడిదలో లోహాలుండే అవకాశముంటుందో ఆ బూడిదని నీటితో కడుగుతూ మలినాలని తీసేస్తారుట. కొత్తనీటిలో కడిగి నీరుమారుస్తూ బట్ట జాడించినప్పుడల్లా తేట వొచ్చినట్టు. అలా కడుగుతూ పోగా పోగా ఘనరూపంలో ఉంటుంది కనుక బంగారం వంటి లోహం మిగులుతుంది. మట్టిలోంచి బంగారం తీయడమంటారిదే కాబోలు.

'వెంటపోగునందు పృథ్వి రత్నంబున్న' అన్నట్లు బంగారం ఎక్కడెలా వున్నా బంగారమే. దాని విలువ దానిదే. అందుకే కదా మాతా పుత్ర హిరణ్యాయ... అంటూ బంగారం తల్లికీ, కొడుక్కీ కూడా శత్రుత్వం ఏర్పరచగలదు సుమా అన్నారు పెద్దలు. ఎన్నెన్ని పేర్లని దీనికి! ఉత్తమలోహం. వీళ్ళూ వాళ్ళూ అనకుండా ప్రపంచమంతా దీనిని గుర్తించి విలువ యిచ్చింది. అందుకే బంగారం బలి కోరుతుందనే నానుడి కూడా పుట్టింది.

ఆలోచిస్తున్న కొద్దీ ఆమెకొకటి స్పష్టమౌతోంది

ఈ ప్రపంచంలో పనికిరాని వస్తువంటూ ఏమీ ఉన్నట్లు లేదు.

అందుకే కాబోలు బ్రిటిష్‌వాళ్ళు- "ఏ వస్తువునయినా... ఎంత పనికిరాని దనిపించినా ఏడేళ్లయినా దాచకుండా అవతల పారేయకు..."అంటారట. ఆ మాటలు ఆచరిస్తారట కూడా.

ఇలాటివన్నీ పైపైకే, పుస్తకాలలోనూ

బాగానే ఉంటాయి కానీ నిజంగా అమలు జరపబోతే అంతా తంటాయే.

ఈ చెత్తనంతటినీ ఏడేళ్లపాటు దాచాలంటే ఎంతస్థలం ఉండాలి! ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. అందుకు క్రిమిసంహారకమందులకెంత ఖర్చు చెయ్యాలి! ఈ ఖర్చంతా ఎవరు పెట్టుకుంటారు? పోనీ...యింత కష్టపడినా... ఏడేళ్ళూ ఎప్పుడెప్పుడా అని ఎదురుచూసినా... భద్రంగా దాచి ఉంచిన చెత్తలోంచి... చెదవొస్తుందో, మరేమయినా పనికిరాని దొస్తుందో?

పనికొచ్చేదేమీ రాకపోతే?

అనవసరంగా ఏడేళ్ళూ యీ చెత్తకి బోలెడంత చాకిరీ చేశామే చచ్చీచెడీ అని దుఃఖిస్తూ కూర్చోవాలి. ఆ విచారంతో బతుకే చెత్తా చెదారమూ ఐపోతుంది. ఎందుకొచ్చిన చెత్త... అనుకుంటూండగా...

గేటు తోసుకుని ఎవరో వస్తున్నట్టు అలికిడయింది.

ఆ గేటు చేసే శబ్దం- అదే కాలింగ్‌బెల్ యీ శ్మశానానికీ ఆమెకీ!

నల్లబనీను...

గళ్లలుంగీ... అదీ... మడిచికట్టి...

మనిషి సన్నగా రివటలా పొడుగ్గా ఉన్నాడు.

కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

ముఖం గంట్లు పడిఉంది.

అతను-

క్రూరంగా కనిపిస్తున్నాడు.

మనిషిని చూడగానే భయంవేస్తుంది తప్ప గౌరవించబుద్ధికాదు.

అతను తాగినట్లు కూడా ఉన్నాడు.

"కాపరీ" పిలుపుకూడా ముద్దగానూ, మోటుగానూ ఉంది.

ఎదురు వెళ్లాను. "ఏంకావాలి? "

"కాటికాపరి..."

"నేనే..."

నమ్మలేనట్లు చూశాడు. సహజమే. కాటికాపరిగా ఒక స్త్రీని విశ్వసించగలిగే, ఆమోదించగలిగే స్థితికి మనవాళ్లింకా రాలేదు.

"ఏం కావాలి? " అడిగాను.

"మేము గారడీవాళ్ళం..."

ఎందుకో నాకలాగే అనిపించాడు.

"శవాల్ని నువ్వే కాలుస్తావా? స్వయంగా"

"ఊ..."

"నిన్నరాత్రి... నా మంత్రదండాన్ని... అబ్రకదబ్రని కక్కుర్తి కుక్క ఎత్తుకు ఎగరేసుకుపోయింది..."

"మంత్రదండం! కుక్క!"

"మంత్రదండమంటే అదే... మనిషి తాలూకు ముంజేతి ఎముక... గారడీవాడు దానికే ఎన్నోపేర్లు పెడతాడు జనాలని మాయచేసి నాలుగు డబ్బులు చేసుకుందుకు..."

"ఓహో!" నవ్వొచ్చింది. "మంత్రదండాన్ని కుక్కెత్తుకుపోయింది. ఐతే? "

"ఈసారి శవం కాల్చుకి రాంగనే... సరైన టైముచూసి చేతెముకలు పక్కకి తప్పించెయ్యాలి దాని చర్మమూ, మాంసమూ, కొవ్వూ కాలిపోగానే. ఊరికే అక్కర్లేదులే ఎముకకయిదు రూపాయలిస్తాను. వీలయితే రెండు బొమికెలు చూడు. చూడబోతే ఓ మంత్రదండం స్పేరుగా ఉంచుకోడం కూడా మంచిదిలా ఉంది..."

శివానికి మతిపోయింది. ఈ శ్మశానం కూడా రకరకాల కార్యక్రమాల కాలవాలమే అన్నమాట. దీనితోనూ చాలామందికి అవసరాలు పడుతూంటాయి. చనిపోయినవారికి మాత్రమేకాక!



చతుర ... 85

మనిషి మోచేతి ఎముక మంత్రదండం! జనాలని మోసంచేసే అబ్రకదబ్ర! అంటే... మనిషి బతికుండగానేకాక చచ్చాక కూడా అమాయకులను, మోసంచేస్తూనే ఉంటాడ న్నమాట. అయ్యో! మనిషీ!

ఆ గారడీవాడు డేగకళ్ళు వేసుకుని శ్మశా నమంతా కళ్లతో కలయజూసేస్తున్నాడు. పొదలు, తుప్పలు, పెద్దచెట్లు, గడ్డి, ఒకవి ధంగా యిదీ పార్కే, కాకపోతే తేడా అల్లా పార్కులో చెట్లూ అవీ పెంచుతారు. అవి ఇక్కడ వాటంతటవే పెరుగుతాయి. స్వేచ్ఛకీ క్రమశిక్షణకీ యింత తేడా ఉందా!

"ఇక్కడెప్పుడేనా పురుగూ పుట్రా కనపడుతుంటాయా? "

"వాటికేం భాగ్యం? చీమలూ, బొద్దిం కలూ వాటితోనే నేనూ బతుకుతున్నాని క్కడ"

"ఆ పురుగులు కావు... పాములు"

"ఓ! వాటికీ విహారస్థలమే"

"జాతినాగులు... కనీసం అలా కనిపిం చేవి. ఏమైనా ఉన్నాయా? "

"పాముకంట బడగానే భయంతో పారి పోడమేకాని వాటి కులమూ జాతీ మతమూ కనుక్కునే ధైర్యమెక్కడిదీ నాకు? నేనెన్నో పాములనిక్కడ చూశాను. కానీ... దేనినీ పూర్తిగానూ నిర్భయంగానూ తాపీగానూ చూడలేదు"

"ఉన్నాయి కదా... అది చాలు. మేము యిల్లూసుకుని వొచ్చి పాములు పట్టు కుంటాం. ఉట్టినే కాదులే. పామును బట్టి ఒక్కోదానికీ ఐదో... పదో... అలాయిస్తాం. పాములు అరిజంటుకావుకానీ... మంత్రదండం మాత్రం మహార్జంటు సుమా. అదిలేకపోతే పనాగిపోతది. రేపొ స్తాను"

"అదెలా చెప్పగలం? ఇవాళ శవం వొస్తుందో రాదో"

అతను భొళ్లున నవ్వాడు సారా కంపు ఆమడదూరం గుప్పుమనేలా. "ఈ దేశంలో నిముషంకీ కనీసం ఒక్కళ్లేనా పుడుతు న్నారే... ఎంత యీనపచ్చంగా జూసినా గంటకొకరేనా సావరూ? ఊరికి రోజుకొక రేనా సావరూ? ఇంతూరుంది... రోజుకొక ళ్లేనా సావకపోతే యింతూరూ యింత జనమూ దేనికి పనిమాలా తిండి దండక్కి. కాకపోతే... ఆс... నేన్రేపుపొద్దున్నే ఒస్తా..."

అని గారడీవాడు వెళ్ళిపోయాడామె జవాబు కోసం ఆగకుండానూ, అది మరోలా ఉండడానికి వీలేలేదన్నట్టుగానూ!

★ ★ ★

శవదహనాలన్నీ ఒకేలా ఉండవు, మను షులందరూ ఒకేలా ఉండనట్లు. కొన్ని కులా లవాళ్ళ దహనకాండ చాదస్తంగా ఉంటుంది. కుండనిండా నీళ్ళు భుజాన మోయించీ తడిగుడ్డల్లో ఉండమనీ... గుండుగీసీ... నానాయాతనలూ పెడతాడు పురోహితుడు కర్మకాండ చేసే అభాగ్యుజీ విని.

శవాన్ని దహనం చేయడంతో ఐపోదు. పదిరోజులవరకూ వాళ్ళు శ్మశానంలో శవం కాల్చిన చోట ఏవేవో చేస్తూనే ఉంటారు, అన్నం వండడంలాటివి.

కొందరి శవాలు గొప్పలకిపోతాయి. నోటిలో బంగారపు చెంచాతో పుట్టినవారిని శివానీ ఎప్పుడూ చూడలేదుకాని... విచిత్ర మయిన శవాలని కొన్నిటిని చూసింది.

ధనిక స్త్రీ చనిపోతే- పుట్టుకతో వొచ్చిన బుద్ధి పుల్లలతో కానీపోదనే నానుడిని రుజు వుచేస్తూ... స్త్రీ చచ్చినా స్త్రీయే. ఆమెకు నగ లమీద మోజు చచ్చినా పోదని చెప్పడానిక న్నట్లు... ముక్కుపుడక, చెవిదుద్దులు లేదా నోట్లో బంగారపు పన్నో ఉంటే వాటితోసహా దహనంచేస్తారు. కొత్త పట్టుచీరతో (చితిలో దానినీ ఉంచుతారు ఆ స్త్రీ శవంతోపాటు)




దహనమైన కలవారి కోమలులనీ చూసింది. ఈ బంగారం, పట్టుచీరెల పిచ్చి లాంటివి సాధారణంగా మగ శవాల విషయంలో ఉండదు. మహా అయితే, వేలి నుంచి ఊడిరాక ఏ ఉంగరమో ఉండిపోవచ్చు లేదా... చెవిపోగులాటిది మిగిలిపోవచ్చు.

కాని... ఒకసారొక విచిత్రమయిన శవం వొచ్చింది.

మగ శవం. చితి అంతా సిద్ధమయ్యాక కట్టెలమీద కొందరు శవంతాలూకువాళ్ళు ఆవు నెయ్యి పోస్తారు. ఇంకొందరు మంచి గంధంచెక్కలు వేస్తారు. అలాటివి మరీ అరుదేమీ కాదు కాని.

ఆ శవంమీద దానితాలూకు బంధువులో మిత్రులో ఎవరోగానీ చితిమంటలు రగులుతూంటే ఒక ఫుల్ బాటిలు రమ్ తెరిచి ఆ ద్రవాన్ని చితిమీద పోశారు. సీసాని చితిలోకి విసిరేశారు. అలాగే ఒక కాగితపు సంచిలోంచి సరికొత్త పేకదస్తాలు రెండు తీసి వాటిలోని ముక్కలను మనుషులకి ఆటగాళ్లకి పంచుతున్నట్లు చితిమీద ఆరువేపులకి పదమూడేసి చొప్పున విసిరి మిగిలినవాటిని దొంతుగా చితిమీద ఉంచారు. అప్పుడు వారిలో ఒకరు "మిత్రమా! మమ్మల్ని వొదిలి వెళ్ళిపోతున్నావు. నీకు రమ్మూ, యీ స్నేహితులూ ఎంతో ప్రియమైనవారు. కట్ జోకర్ ఆట అంటే నీకు ప్రాణం. మా హృదయాలెలాగూ నీతోనే ఉంటాయి. అలాగే యీ రమ్, పేకలు కూడా ఉంటాయి. హాపీ డెత్ డే టు యూ" అని పాట అందుకున్నాడు.

మిగిలినవాళ్ళు కూడా "హ్యాపీ డెత్ డే టు యూ" అంటూ కోరస్ అందుకున్నారు.

అదొక వెర్రి. దానికి అర్థమూ పర్థమూ ఉండదు.

వెర్రి- వెయ్యి విధాలంటారు కానీ ఈ భూమ్మీద మనుషులెందరో, వాళ్ళ సంఖ్యకు రెట్టింపు రకాల వెర్రులున్నట్లున్నాయి. మనుషులు యిలా ప్రవర్తిస్తారా! హ్యాపీడెత్ డే... వీళ్లూ అలనాటి వేదాంతి పిచ్చివాడు మహర్షికి వారసులు కారుకద?

నాగరికత, విద్య, విజ్ఞానం ఇవన్నీ యీ వెర్రికేం భాష్యం చెబుతాయి? ఏం వివరణ యిస్తాయి? నయమే... అతగాడికి స్త్రీ వ్యసనం ఉన్నట్లు లేదు. ఉండి ఉంటే అయిదు వేళ్ళకీ ఉంగరాలతో కనపడుతున్న యీ మిత్రులు రమ్, కార్డ్సతోపాటు ఒక రమణిని కూడా అతని శవంతోపాటు చితిమీద ఉంచేవారేమో... సతీసహగమనం అలాంటిదేగా!

నయమే... ఎవరో ఒకస్త్రీ రక్షించబడింది.

రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదువా అని ఐశ్వర్యవంతులు తలుచుకుంటే వారి వారి శవాలకు చేయలేనిదేముందీ?

చేదు నిజమేమిటంటే అంత గాఢ మిత్రులూ- శవం సగం కాలేవరకూ అయినా ఉండలేదు.

పోయేనాడూ వెంబడిరాదూ పూచిక పుల్లయినా... ప్రాణ మిత్రులయినా... అని నిరూపించేందుకు అనువుగా ఒకరు పనుందనీ... మరొకరు క్లబ్‌లో తన కంపెనీ కోసం ఎదురుచూస్తున్నారనీ, లిక్కర్ పార్టీ ఉందని ఇద్దరూ వెళ్ళిపోయారు.

శవంమీదనుంచి, చితిమీదనుంచి రమ్ కాలుతున్న ఘాటువాసన... పేకముక్కలు కాలుతున్న వెగటువాసన... శవం సరిగా కాలని వాసన. వర్షాకాలంలోనూ కట్టెలు చెమ్మగిల్లీ ఒక్కొక్కప్పుడు అంటుకోవు. అలాటప్పుడు పెట్రోల్లో, డీసిల్లో, కిరసనాయిల్లో పోస్తుంటారు కట్టెలమీద... అలాటివి కొత్త కాదు కానీ... చితిమీద రమ్, పేకముక్కలు అదోవింతే! సినిమాల్లోనేకాక వాస్తవంలో కూడా యిలాటివి జరుగుతూంటాయన్న మాట!





ఆలోచనల్లో ఉండగానే గేటుదగ్గర కల కలం, గుంపుగా మనుషులు.

ధనవంతుడి శవమేమో అనుకున్నాగానీ కాదు ఎవరో రాజకీయనాయకుడిలా ఉన్నాడు. వెంట ఉన్న గుంపు ఏదో ఉద్యమ కారుల్లాఉన్నారు. వారు అతనికి శ్మశానం చూపిస్తూ- "చూడండి, ఎలా కిక్కిరిసిపోయి యిరుగ్గా అయిపోతోందో. మన మతం వాళ్ళు తప్ప యిక్కడుండే మిగిలిన మతాలవాళ్ళు సమాధులో గోరీలో కడతారు. అంచేత ఎంత స్థలమూ వాటికే చాలదు. పోనీ, పాతవి తవ్వించేసి వాటి స్థానే మళ్ళీ మళ్ళీ కొత్తవి కట్టించినా జాగా సమస్య ఎదురవకపోను. కాని అలా ఒప్పుకోరు. దానివల్ల మనవాళ్ళకి దహనస్థలం క్రమేపీ తగ్గిపోతోంది. ఇది చాలా అన్యాయం. ఏమతానికామతానికి వేర్వేరు శ్మశానాలు నిర్మించబడవలసిందే" ఆవేశంగా అంటున్నాడొకడు.

నాకర్థమయిపోయింది. ఒక్క నిట్టూర్పు విడిచాను.

ఇన్నాళ్ళూ కనీసం శ్మశానంలోనయినా మతాలు ప్రవేశించలేదని సంతోషిస్తూండే దాన్ని కాని యిక ఆ ఆనందం కూడా మిగలనట్లే. శ్మశానమూ రాజకీయ రంగమైపోయినట్టే. రాజకీయాల వాళ్ళు అడుగుపెట్టడమూ శ్మశానం మలినపడడమూ అయిపోయింది భగవంతుడా! ఈ రాజకీయాలకు ఉచ్ఛమూ నీచమూలేవా? శ్మశానం చాలకపోతే మరొకటి అదనంగా నిర్మించమని అడిగితే అర్థముంది కానీ మతాన్నిబట్టి శ్మశానమా! రేపు ఒకే మతంలోని వేర్వేరు కులాలకు వేర్వేరు శ్మశానాలుండాలని ఆందోళన లేవదీస్తారు కాబోలు.

దేశసమైక్యత ఎంతో ఆవశ్యకమౌతున్న తరుణంలో యిలా మతాలనీ, కులాలనీ చీలికలు! మానవత్వంలోనే చీలికలు! దేముడే రక్షించాలీ దేశాన్నీ మనుషులనీ.



భూతవైద్యులతో కొంచెం ఇబ్బందే! సాధారణంగా వీళ్లెక్కువ గుంపుతో రారుకానీ ఒక్కొక్కప్పుడు మాత్రం దెయ్యంపట్టి, భూతవైద్యుడిచే వొదిలించబడిన గాలిరోగితోపాటు పటాలందిగిపోతూ ఉంటుంది శ్మశానానికి.

ఇలాటి తతంగాలు ఆదివారమూ అమావాస్యా కలిసొచ్చిన నాటి అర్థరాత్రిళ్ళు జరుగుతూంటాయి.

కోడిపెట్టలూ... కొత్తబట్టలూ, తినుబండారాలూ, రోగి స్త్రీ అయితే పసుపు, కుంకుమ, గాజులూ అలాటివన్నీ తట్టలతో మోయించుకొస్తాడు భూతవైద్యుడు.

తాను మధ్యన కూర్చుని ఎవరినో ఎదురుగా గొయ్యి తవ్వమంటాడు. తను మంత్రాలు చదువుతూంటాడు. ఆ మంత్రాలు దెయ్యాలకి ఆహ్వానాలో బెదిరింపులో కాని మనుషులకి మాత్రం వినడానికి నవ్వు తెప్పిస్తాయి.

కోడిపెట్ట పీక నులిమి రక్తం చిందిస్తాడంతకు మునుపే వేసిన ముగ్గుమీద.

నిమ్మకాయలు నలిపి రసం ఓడ్చుతాడు.

పెద్ద కంఠంతో మంత్రాలు అరుస్తూ రోగి తాలూకు జుత్తు చివరలు ఖాళీ సీసాలోకి పడేలా కత్తిరిస్తాడు. తర్వాత మూత వేసి సీలు చేయిస్తాడు లక్కతో.

అంతసేపూ ఏవో మంత్రాలు చదువుతూనే ఉంటాడు. వేపమండలతో కొడుతూ తీసుకువచ్చిన భూతరోగికాసీసానోసారి చూపించి గోతిలో కోడి రక్తం, సాంబ్రాణి, నిమ్మకాయలు లాటివివేసి, సీసాను వాటి మధ్యఉంచి, మట్టి కప్పేసి గట్టిగా చదునుచేయిస్తాడు. లేకపోతే దెయ్యం మళ్ళీ బయట కొచ్చేస్తుందని భయపెడుతూంటాడు.

భారీ శరీరమూ... పెద్ద బానంత పొట్టా.

నడుముకిందనించి మాత్రమే ఎర్ర పంచె.

గుండెలమీద పులిగోరు.

కంఠానికి సింధూరపు గీతలూ.

నల్లని శరీరమూ... పెద్ద నోరూ.

బుంగమీసాలూ... బూచిగెడ్డమూ.

విశాలమైన నుదుటిమీద ఎర్రని గీతల మధ్య పెద్ద బొట్టూ.

చెవులకి చిన్నపిల్లల ఊయల కట్టేందుకు వేసే రింగులంత రింగులూ.

ఆడవాళ్ళే ఈర్ష్యపడేంత, జడవేయవొచ్చు ననిపించే దుబ్బు జులపాల జుత్తూ.

భూతవైద్యుడి గెటప్పే భయంకరంగా ఉంటుంది.

దానికితోడు ప్రాక్టీస్ చేసి పెంచిన కంఠం, స్వరం. దానిలోంచి అరుపులలాటి మంత్రాలు. ఇవన్నీ సౌండ్ ఎఫెక్ట్సు, సైట్ ఎఫెక్టులూ. వాతావరణం కూడా తోడవుతుంది వాటికి.

శ్మశానం... అర్ధరాత్రి... కటిక చీకటిలో ప్రమిదె దీపం. అన్నీ కలిసి సామాన్యులకు మతి మిగలనిస్తాయా?

"దెయ్యాన్ని భూస్థాపితం చేసేశాను" అంటాడతను, వెంట్రుకలు వేయబడిన సీసాకి సీలువేసి పాతిపెట్టాక.

అప్పటికే వాళ్ళతనికి చాలా చెల్లింపులు వదిలించుకుని ఉంటారు. అయినా అతనింకా అడుగుతాడు. హుంకరిస్తాడు. తాను పట్టుకుపోయే పీకలేసి కోడిపెట్టా కొత్తబట్టలూ దక్షిణలూ చాలనట్లు.

వాళ్ళకతనంటే మనసు లోపల మహా భయం. అతన్ని కాదన్నా ఎదిరించినా తమకు చెడుపోచిల్లంగో పెట్టేస్తాడేమో... ఏదెయ్యాన్నో భూతాన్నో తమింటిమీదికి వదిలేస్తాడేమో... అని బెదురు. అక్కడికి నిజంగా దెయ్యాలూ భూతాలూ ఉన్నట్లూ... ఉంటే అవన్నీ యీ భూతవైద్యుడిగారికి 'జీ హుజూర్' అనడానికే ఉన్నట్లూ.

దెయ్యాల కథలూ, భేతాళ మాంత్రికుల కథలూ చదవటం మనదేశంలో చిన్నప్పటి నుంచీ మొదలౌతుంది. పెద్దవాళ్ళకోసం కూడా దెయ్యాల సీరియళ్ళే. ఇవన్నీ చదివిన మెదడు చెడిపోక వివేకంగా ఎలా ఆలోచించగలదు?

ఎన్నెన్నో కాలుష్యాల గురించి చెబుతారు కాని యీ మానసిక కాలుష్యం గురించి ఎవరూ పట్టించుకున్నట్లు కనపడరెందుకనో.

పేపర్లకు బాణామతి వార్తలే సెన్సేషన్! సాహిత్యం పిశాచాల మయమైనప్పుడు సామాన్యుడు భూతవైద్యులనాశ్రయించడంలో ఆశ్చర్యమేముంది. వొళ్ళు వేడిగా ఉంటే- డాక్టరు దగ్గరకు కాక పోగు కట్టించుకుందుకో, విభూది పెట్టించుకుందుకో భూతవైద్యుడి వద్దకు పరుగెత్తేవారి సంఖ్య తక్కువ కానందుకు కొంతకారణం ప్రజల అమాయకత్వమూ అవిద్యా అయితే మిగిలిన కారణం సాహిత్యమూ సినిమాలూ. ఓహ్! చలనచిత్ర చరిత్రలో ఎన్ని దెయ్యం




సినిమాలో! ఇవన్నీ కలిసేకాదూ సమాజాన్ని దెయ్యం పట్టిన మనుషుల గుంపుగా మార్చి వొదులుతున్నదీ? తిలాపాపం, తలాపిడికెడు అన్నట్లు పత్రికలవాళ్ళూ, సినిమా వాళ్ళూ కూడా బాగానే పంచుతున్నారీ పైశాచిక పాపాన్ని.

ఇరవయ్యొకటో శతాబ్దంలో అడుగిడబోతున్న తరుణంలో, ఒకటో క్లాసులెక్కలకు కూడా కాలిక్యులేటర్లు వాడబడుతున్న కాలంలో, తడవతడవకీ కంప్యూటర్లు ప్రవేశించిన చోటల్లా వేలలోనూ లక్షలలోనూ ఉద్యోగులని నిరుద్యోగులుగా ఆఫీసుల బయటకి సాగనంపుతున్న శాస్త్రవిజ్ఞాన శతాబ్దంలో.

ఒక మనిషి చంద్ర గ్రహంమీద అడుగు పెడుతూంటే లక్షల మంది చంద్ర పీడలవెంటా మోహినీ కామినీ పిశాచాలనూ గాలినీ ధూళినీ వొదిలిస్తాననే భూతవైద్యుల వలయంలోకి ప్రవేశిస్తున్నారు.

నిత్యమూ శ్మశానంలో ఉండే... నిశివేళ కూడా యిక్కడ చరించే తను కాటికాపరిగా... దెయ్యాలూ అవీ లేవని గొంతుచించుకుని చెప్పినా ప్రజలు నమ్మరు.

వీళ్ళకి నిజం నప్పదు, భ్రమే తప్ప. సినిమాలంటించిన దౌర్భాగ్యమిది.

అందుకే వీళ్ళకి నిజం- భ్రమా, భ్రమ- నిజమూ!

★ ★ ★

మధ్యాహ్నమేదీ శవం రాలేదు. దానితో ఆమెకంతా తీరుబడే.

సాయంత్రమయ్యాక పనిలేకుండా శ్మశానంలో ఉండడం విసుగనిపించి ఊళ్ళోకి వెళ్ళింది శివాని.

మనుషుల మధ్యకి వొచ్చేసరికి ఈ యిరుకూ... గోలా... యివే బాగున్నాయనిపించాయి ఆ శ్మశాన ఏకాంతమూ ప్రశాంతమూ కంటె. కాని అదెంత సేపు? ఎలాగూ రానే వొచ్చానని కొన్ని పుస్తకాలు కొనుక్కుని... టిఫిన్ తినేసింది యింటికెళ్ళి వండుకునే అవసరంలేకుండా. అప్పటికే బాగా చీకటిపడింది. రోడ్డుమీదయితే దీపాలు వెలుగుతున్నాయికానీ... పెద్ద రోడ్డునుంచి శ్మశానపు మట్టిరోడ్డు విడిపోయాక మాత్రం దీపాలు లేక మసక మసకగా ఉంది. అదీ వెన్నెలుంది కనుక!

మెల్లగా నడుస్తున్న శివానీ త్రుళ్ళిపడి ఆగింది. జరుగుతున్నది ఒకపట్టాన ఆమెకర్థంకాలేదు.

అర్థమయ్యేసరికి... ముగ్గురు మగవాళ్ళు ఒక స్త్రీని దాదాపు చక్రబంధంలోలాగ తాము కోరుకునే వేపే తరుముతున్నారు! ఆమెను వేరే దిశవేపు కానీ వెనక్కి కాని పోనివ్వడంలేదు. ఒకసారి వెన్నెలలో ఆమెను స్పష్టంగా చూడగలిగేసరికి శివానీకామె పోలిక దొరికింది.

ఆమె ఒక పిచ్చిది. తను వూళ్ళోకి వెళ్ళినప్పుడు కనిపిస్తూంటుంది జుత్తు విరబోసుకుని. అర్థనగ్నంగా, పెంటకుప్పలలో ఏవేవో ఏరుతూ... స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటుంది. ఆ పిచ్చిదానితో వీళ్ళకేంపని? అసలు వాళ్ళెవరూ!

కొంచెంసేపట్లో వాళ్ళు ఆమె దృష్టిని దాటి కనపడకుండాపోయారు. శివాని కుటీరాని కొచ్చి పడుకుంది. సాయంత్రం తిరిగి తిరిగి అలసిపోయిందేమో బాగానే నిద్రపట్టింది.

అర్ధరాత్రి దాటుతూంటే... అవతల ఏదో అలికిడై మెలకువొచ్చేసింది. టార్చిలైటూ కర్రా పట్టుకుని యివతలికి వొచ్చి అలజడి వేపు దీపం వేసేసరికి... ఆ వెలుగులో... ముగ్గురు మగాళ్ళు, ఆ పిచ్చిదానిని మానభంగం చేస్తున్నారు. మరింత దగ్గరగా వెళ్ళేసరికి వాళ్ళు ముగ్గురూ కుష్ఠువాళ్ళని పోలిక పట్టింది.

# ఏరిన ముత్యాలు

★ మనం మనకోసం చేసేది మనతోనే అంతరించిపోతుంది. ఇతరులకోసం చేసేది శాశ్వతంగా వుంటుంది.

-గాంధీజీ

★ అదృష్టంలో నాకు నమ్మకంలేదు. పనిలోనే నాకు సంపూర్ణ విశ్వాసం వుంది.

-పండిట్‌నెహ్రూ

★ దేశభక్తి అంటే కేవలం మాతృదేశాన్ని ప్రేమించడం మాత్రమే కాదు. తోటి మానవులకు తోడ్పాటునివ్వడం.

-స్వామి వివేకానంద

★ న్యాయం గెలుస్తుందన్నమాట నిజమేగాని గెలిచేదంతా న్యాయంకాదు

-శ్రీశ్రీ

★ శ్రమశక్తి పెట్టుబడికి మూలం.

-అబ్రహం లింకన్

★ ద్వేషాన్ని ద్వేషంతో చల్లార్చలేము. ప్రేమాభిమానాలతోనే చల్లబర్చగలము.

-సర్వేపల్లి రాధాకృష్ణన్

★ పగతీరితే అప్పటికి తృప్తి. ఓర్పు ఎప్పటికీ తృప్తి.

-తిరుక్కురళ్

★ సత్యశోధనకు సందేహం తొలిమెట్టు.

వాసియాబాలో

★ మనం క్షణంలో కోల్పోయినదాన్ని తిరిగి పొందడానికి దశాబ్దమైనా పట్టవచ్చు.

-నెపోలియన్

★ ఎంత గొప్పగా మాట్లాడినప్పటికీ మాటలతోనే జన విశ్వాసం పొందగలమనుకోవటం కేవలం భ్రమ.

-హాజ్లిత్

★ దొంగచాటుగా దెబ్బ తీసి అదే విజయంగా భావించడం పిరికితనమే అవుతుంది.

-లూథర్

★ యుద్ధం యోచన మనిషి బుర్రలో పుట్టినట్టే శాంతి కూడా మనిషి బుర్రలోంచి రావల్సిందే.

-ఎన్. కజిన్స్

★ సంస్కరణకు అవకాశం లేని జాతికి మనుగడకు కూడా అవకాశం వుండదు.

-ఎడ్మండ్ బర్క్

---

సేకరణ : రంగు చక్రపాణి

నిర్ఘాంతపోయింది శివానీ ఆ దృశ్యానికి. ఆమెను రక్షించాలని వాళ్ళవేపు ఉరికింది.

"ఎవరది? ఇటొస్తే చంపేస్తాం" తెగించి నట్లరిచారు ముగ్గురూ దానినొదలకుండానే.

పరిస్థితి ఆమెకర్థమయింది.

ఆ కుష్ఠువాళ్ళకి వ్యభిచారిణి కూడా దొరికి ఉండదు డబ్బిస్తా మన్నా. ఇంకే స్త్రీ దొరకని ఆ కుష్టుకాముకులకీ పిచ్చిదే అనువుగా దొరికి ఉంటుంది. దీనిని దారిమళ్ళించి శ్మశానంలోకి తీసుకొచ్చారన్నమాట తను నిద్రపోయాక.

వాళ్ళు ముగ్గురు... తనొక్కతె. తను ఆడ దని చూసి ఆ పిచ్చిదాన్ని వొదిలి తనని పట్టుకుంటారేమో. ఏంచేయాలి?

ఊళ్లోకి వెళ్ళి ఎవరినేనా పిలుచుకొద్దా మన్నా సమయం చాలదు. ఎలా ఆపాలి ఆ దారుణ మానభంగ కాండని?

తాను చీకటిలో నక్కి ఒక్కసారి దెయ్యంలా భీకరంగా అరిచింది.

అంతే...

ఆ ముగ్గురూ పారిపోయారు బెదిరిపోయి "అమ్మో, దెయ్యం" అంటూ కేకలేస్తూ...

వాళ్ళు పోయాక బాధితురాలి దగ్గరగా వెళ్ళింది టార్చివేస్తూ.

ఆ పిచ్చిదానికి జరగవలసిన అపకార మంతా అప్పటికే జరిగిపోయినట్లుంది. గుండెలనిండా గోళ్ళరక్కులూ, గాయాలూ, రక్తపు మరకలూ... నడుము దిగువనా అలాగే... మందార రేకుల్లా గాయాలు.

పిలిచింది. కాని పిచ్చిది పలకలేదు.

శివానీ ఆమె ముఖంమీద నీళ్ళు జల్లి... తాగడానికి మంచినీళ్ళందించింది పెదాలకి. తాగింది కాని... ఏదో గొణిగి మళ్ళీ కళ్ళు మూసేసుకుంది పడుకోనిమ్మన్నట్లు. ఆపాద మస్తకమూ నగ్నంగా ఉందామె. ఆ కాముక కుష్ఠువాళ్ళా వొంటిమీది అర్ధవస్త్రం కూడా చీలికలూ వాలికలూ చేసేసి విసిరేసి ఉంటారు.

ఆమెను కుటీరంలోకి తీసుకువెళ్ళేందుకు శివాని ప్రయత్నించింది కానీ ఆమె ఎంత మాత్రమూ సహకరించకపోవడంతో అది సాధ్యపడలేదు. ప్రాణాపాయం లేదుకదాని అలాగే ఆమె వొంటిమీద బట్ట కప్పి తను లోపలికి వెళ్ళింది.

ఎంత ప్రయత్నించినా నిద్రరాదే! దారుణంగా చెరచబడిన ఆ పిచ్చిదే కళ్లముందు మెదలసాగింది. స్త్రీత్వానికి పిచ్చితనం కూడా అవరోధం కాదన్నమాట! కామానికి... మగ వాడి కామానికి స్త్రీ అయితే చాలు. ఆమె పిచ్చిదయినా, అవిటిదయినా, చివరికి గర్భిణీ అయినా, చిన్నపిల్లయినా, ముసిలిద యినా, రోగిష్టిదయినా. కామాతురాణాం నభయం నలజ్జః మాత్రమే కాదు... నదయా నదాక్షిణ్యం. నవివేకం నవిచక్షణా అని కూడా చేర్చాలి.

ఆరునెలలకిందట యీ పిచ్చమ్మాయి కొత్తగా వొచ్చిందట ఈ వూరు. ఎంతో బలంగా, యౌవనంతో ఉండేది. ఇప్పుడు వాడిపోయి, వడలిపోయి శరీరం బిగేపో యింది.

అంటే... ఈ ఆరునెలలుగా... ఆమె చాలా రాత్రులు ఇలాగే కుష్ఠువాళ్లచేతో... ముష్టివాళ్ళచేతో పాశవికంగా చెరచబడు తూనే ఉందా? ఎంతదారుణం!

గడియారం ఐదు కొట్టింది. కొంచెం వెలుగొస్తుంటే వెళ్ళి పిచ్చిదాన్ని లేపితే అది కళ్ళు తెరచి చుట్టూ చూసి "బాబోయ్ శ్మశానం" అంటూ అరుస్తూ పారిపోయింది విన కుండా.

శివానికి మతిపోయింది. పిచ్చిదానికి కూడా శ్మశానమంటే భయమేనా! నిజానికి రాత్రి తన శరీరం ఈ శ్మశానం కంటె అన్యాయమైపోయిందే!



★ ★ ★

రాత్రులు శివానికి చీమ చిటుక్కుమన్నా మెలకువ వొచ్చేస్తుంది.

గాజుల గలగల... గాలి గుసగుసలా గొణుగుళ్ళు, మూలుగులు, నిట్టూర్పులు.

ఏమిటా అని తడికెతోసుకుని బయలు దేరింది శివాని. ఆమెకళ్ళు చీకటిలో చూడ డానికి కూడా అలవాటుపడిపోడంతో టార్చి వెయ్యలేదు. చీకటి కూడా బలహీన పడి మసకగా ఉంది.

ఆ మసక వెలుగులో...

గోరీ పక్కన గడ్డిలో...

ఒక స్త్రీ, పురుషుడూ దిగంబరంగా. వీరి బట్టలు



దూరంగా పెట్టబడున్నాయి. ప్రపంచంలో తామిద్దరే ఉన్నట్లు స్వేచ్ఛగా క్రీడించేస్తున్నారా జంట.

అసహ్యంతోపాటూ ఆశ్చర్యమూ వేసిందామెకి. స్మశానం లయస్థావరం తప్ప సృష్టిస్థలంకాదు. స్మశానంలో సమాధుల పక్కనే స్త్రీ పురుష సంయోగమూ సృష్టికార్యమూ అంటే- మరుగు దొడ్డిలో మృష్టాన్నపు విందు కుడిచేటట్లు ఎబ్బెట్టుగా ఉండదూ!



వారు బట్టలు కట్టుకునేవరకూ నిరీక్షించి అప్పుడు ముఖాలమీదకి టార్చివేసింది.

"మీ పనికి శ్మశానమే దొరికిందా! పదండి... పోలీసుల కప్పగిస్తాను. తిక్క వొదులుతుంది" కర్ర ఝళిపిస్తూ గద్దించింది.

వాళ్లామె కాళ్లమీద పడినంత పని చేస్తూ దణ్ణాలు పెట్టారు.

"ఏం చెయ్యమంటారు? పెద్దమనసుతో మా కష్టం ఆలకించండి. ఈ ఆడదానికి మగదిక్కు లేదు. నాకింట్లో పేరుకి పెళ్ళా మున్నా ఆడ సుఖంలేదు. వారానికో పదిరోజులకో యిద్దరం కలుస్తాం. సవకబారు హోటలు గదిలో కెళ్దామంటే పోలీసులు. పార్కులోకి పోదామంటే వాచ్‌మన్ పోలీసులకంటే వొడికేస్తాడు. ఏటొడ్డుకు పోదామంటే రౌడీ నాకొడుకులు... దానికి మొగుళ్ళేకపోయినా పిల్లలున్నారు. అంచేత దాని గుడిసెలో కుదర్దు. అలాగ మాకు మరుగు కరువైపోనాది. శ్మశానమే బెస్టనిపించినాది. పోలీసులూ పిరికివాళ్ళే గనుక ఇటు రారని మేం శ్మశానాన్ని పడకిల్లు జేసుకున్నాం. జనాభా ఎక్కువైపోయి మనుషులకి ఆడా, మగలు సుఖపడ్డానికి మరుగే కరువైపోతన్నాది రాన్రానూ"

"ఇది వ్యభిచారం! తప్పని తెలీదా!"

"అంతంత పెద్ద మాటని మమ్మల్ని బెదరగొట్టకమ్మా. ఆడా, మగా హాయి అంతే. నీకింకా పెళ్ళికానట్లుంది. అందుకే మా యావ ఎంత పోర్సయిందో తెలుసుకోలేకపోతున్నావు. ఇంద... ఈ ఐదు ఉంచు. మమ్మల్ని పోనీ. వొచ్చినప్పుడల్లా నీ చేతిలో ఐదెడతాం. అలాగేనా? ఇంటికంటె గుడిపదిలమేనో కాదోకాని, యిలాటి వాటికి శ్మశానమే మేలు. ఇక్కడెంత సుఖంగా గడిపామో"

"పొండి- మరెప్పుడేనా వొచ్చారో" కోపంగా అరిచింది శివానీ కుక్కలని తరిమినట్లరుస్తూ.

★ ★ ★

పూర్తిగా రాత్రికాలేదు. చీకటి గాఢంకానేకాలేదు. ఇంతలో గేటు చప్పుడు.

ఎవరో మగాడు చెంబుపట్టుకుని వస్తున్నాడు.

శివానికి మండిపోయింది. ఎవడువాడు? అరె! ఒకడు కాడు. ఒకరి తరవాత ఒకరుగా. నలుగురు... వాళ్ళుద్దేశమేమిటి! ఇది శ్మశానమనుకున్నారా పాయిఖానా అనుకున్నారా! పైగా గుంపుగా ఏమిటీ! సహపంక్తి విరేచనాల్లాగా!

అదేమిటీ?... వాళ్ళు నలుగురూ పేకాటక్కూర్చున్నట్లు వలయంలా కూర్చుని...

మొలలోంచి సీసా... పొట్లామూ తీసి...

చెంబుల్లో నీళ్ళొంపేసి...

సీసాలు వాటిలో వొంపి...

ఓహో! శ్మశానమైతే ఎవరూ చూడరని ఇక్కడ మొదలెట్టారా! ప్రొహిబిషనేమయిందీ!

చెంబట్టుకుని యిక్కడకి రావడమూ సారా సేవించి వెళ్లడమూనా? పోలీసులని తప్పించుకుందుకు మంచి జాగాయే! దేముడా! ఏమిటిది? పితృవనమని చక్కని పేరు కల- గౌరవనీయమయిన స్థలం యీ శ్మశానం. తాగుబోతులకి, వ్యభిచారులకీ మాయగాళ్ళకీ కేంద్రమౌతూందా!

ఆమధ్య అర్ధరాత్రి... చడీచప్పుడూ లేకుండా ఓ ముగ్గురు శ్మశానంలోకి జొరబడిపోయారు. చితి పక్కన చదునునేలమీద పీఠంవేసి ఒకడు మూటా, మరొకడు సూట్‌కేసూ... ఇంకొకడు జోలే తెరిచి, మధ్య పరచబడిన తువ్వాలుమీద నగలు, డబ్బు, వగైరా, నానారకాల వస్తువులు, కుప్పలా పోశారు. తరువాత పంచుకోడం మొదలుపె




ట్టారు.

ఎంత నిర్భీతిగా ఎంత గోలగా అదంతా చేశారో! ఎంత గొడవపడ్డారో! స్మశానంలో వాళ్ళదే యిష్టారాజ్యమైపోయింది. తను వొంటరీ... ఆడదీ... ఫోనులేదు. పోలీసులకి చెప్పాలన్నా వాళ్ళ ముందునుంచే బయటికి వెళ్ళాలి. ఆ సమయంలో ఆ చోరుల కంటపడితే తనని చంపేయటం ఖాయం.

నిస్సహాయంగా చేతులు ముడుచుకు కూర్చోవలసి వొచ్చింది గుండెలుగ్గ బట్టుకుని.

ఇది యింకా నయమే. ఒకసారయితే... చీకటిపడుతూంటే ఇద్దరొచ్చారు. గురుశిష్యుల్లా ఉన్నారు. ఆకారమే చెబుతోంది వాళ్ళు క్షుద్రదేవతోపాసకులని.

"బిడ్డా! నువ్వు మాకు సహకరించి యీ రేత్రికి శ్మశానం మాకివ్వాలి. అంటే మేమిక్కడేం చేసినా కాదనకూడదు, ఎవరికీ చెప్పకూడదు. మాతో అలా చేతులు కలిపితే మేము మా శక్తులు కొన్ని ధారపోస్తాం. దేవి నిన్ను కరుణిస్తుంది" అన్నాడు గురువులా కనపడుతున్నవాడు.

"శ్మశానంలో మీరేం చేస్తారు? నేనేం చెయ్యాలి? ఏమేం చెయ్యకుండా ఉండాలి" అడిగిందామె.

"నువ్వేమీ చెయ్యక్కర్లేదు. కళ్ళు మూసుకునుంటే అదే చాలు నోరు మెదపకుంటే అదే చాలు"

"సరే... మీరేం చేస్తారు? " కుతూహలం కొద్దీ అడిగింది!

"మేము వామాచారులం"

"అంటే కుడిచేత్తో చేసే పనులు ఎడమచేతితో చేస్తారా; అన్నంతినడమూ అదీ"

"అది కాదే బిడ్డా మాది తంత్రవిద్య. శక్తోపాసకులం. శవాన్ని తెస్తాం. దాంతో సంయోగం చెందుతాం. శవాన్ని పూజిస్తాం. శక్తికి బలిస్తాం. రక్తంపానం చేస్తాం. మాంసం మహా నైవేద్యం పెడతాం. శక్తిని ఆహ్వానిస్తాం. వశపరచుకుంటాం. ఒకటేమిటి, ఎన్నో చేస్తాం. చూస్తావుకదే చేవుంటే బిడ్డా. కంటితో చూసింది. మనసులోనే దాచుకోవాలి"

"బలి ఎవరినిస్తారు? "

"తెస్తాము, సంపాదించి. ఎనిమిదేళ్ల బాలుడు. అందాలరాముడు. శక్తికి ప్రీతిపాత్రుడు"

"ఎందుకూ ఇలాటి క్షుద్ర విద్యలభ్యసించడమూ, కానిపనులు చేయడమూ? "

"శక్తిని వశపరచుకుంటే ప్రపంచమే చెప్పు చేతులలోకి రాదూ? "

ఇదొక రకం దాహం. అతను నేనొప్పుకుంటానేమోనని చాలా విషయాలు చెప్పాడు. అతను ఏ శవంతో సంభోగిస్తాడో దాని కనుగుడ్లు పెరికి ఆ గోతులలో దీపాలు వెలిగిస్తాడట! అలాటివే మరికొన్ని అతిభయంకరమైనవనీ, జుగుప్సాకరమైనవీ!

అన్నింటికంటే దారుణం బాలుణ్ణి బలియిచ్చి శవానికి శక్తినావహింపజేసి రక్తతర్పణం చేయడం!

తన మూర్ఖత్వానికి ఒకలేత బాలుణ్ణి బలివ్వడానికి కూడా వెనకాడని అతను మాంత్రికుడా, మహాకరినుడా? వీళ్లది వామాచారం కాదు, భ్రష్టాచారం. వీళ్ల ఆచారం మండినట్లే ఉందనుకుంది శివాని.

"పోలీసుల సహకారం తెప్పిస్తాను, మీకు తోడు కావాలంటే" అంది శివాని.

అంతే. ఆ గురుశిష్యులిద్దరూ పరుగోపరుగు.

వీళ్లు వెళ్లిపోయినా ఆలోచనలు విడచి వెళ్లలేదామెను.

స్త్రీ శవం తెస్తారట వెధవలు! శవమయ్యాక కూడా స్త్రీకి, ఆమె శీలానికి రక్షణ

లేదా?

ఆమధ్య ఓ పదహారేళ్ల అబ్బాయొచ్చాడు.

వస్తూనే "అక్కా! నువ్వేకదూ కాపరివి?" అంటూ చేతిలో వంద రూపాయలు కుక్కేశాడు.

"సిస్టర్! నాదో రిక్వెస్ట్. తిట్టకు. నేను స్త్రీని దిగంబరంగా చూడాలి. శవాన్నయినా సరే. నో బ్లూ ఫిలిమ్స్. నో ఫొటోస్. నో డ్రాయింగ్స్ ఏవీ కుదరడంలేదు. కనుక **శవం** అయినా సరే. రియల్ నేకెడ్‌నెస్. ఐవాంట్ టు సి. లేడీ బాడీ పాతిపెట్టగానే నేనిచ్చే నంబరుకి టెలిఫోన్ చేశావో నేనొచ్చేస్తాను. బాడీని గోతిలోంచి బయటకు తీసి తనివితీరా చూసి"

తను ఆగ్రహంతో మండిపోయింది. కోపాన్నిహ ఆపుకోలేక "షటప్! యూ ఇడియట్! క్రేజీ! పర్‌వర్ట్" అంటూ వాడి నోటు వాడిమీదకు విసిరేసి,

"మళ్లీ ఈ పరిసరాల్లో కన్పించావో పోలీస్‌కి అప్పగించేస్తాను. బివేర్" అని అరిచింది.

ఆ కుర్రాడు బెదిరిపోయి లాగు తడుపుకుంటూ పరుగెత్తాడు. స్త్రీ శవాన్నయినా నగ్నంగా చూసి తరించెయ్యాలనీ, తనివితీరాలనీ తపన పడిన ఆ కుర్రాడామెకు మతి పోగొట్టి వదిలాడు.

మనిషి మెదడులోకి ఎక్కడినుంచి సరఫరా అవుతున్నాయి ఇటువంటి వికృతవాంఛలు?

ఎంతో ఆరోగ్యవంతంగా ఉండవలసిన కామం ఎందుకిలా కుళ్లి పురుగులు పడుతోంది?

ప్రాచ్యదేశాలలో అయినా, పశ్చిమదేశాలలో అయినా ప్రపంచంలో ఎక్కడైనా ఈ స్త్రీలూ, ఈ పురుషులే కదా.

రుతువు అనే నియమం కూడా లేకుండా అందరూ అనుభవిస్తున్నది కామమేకదా? ఇంకా ఈ విపరీత ధోరణులేమిటి? పురుషుడికి స్త్రీపట్ల ఇంత వ్యామోహం ఏమిటి?

ఆమధ్య ఒక స్త్రీ శవం వచ్చింది. దాని వెంట వచ్చినవారు మాట్లాడుకున్న గుసగుసలనుంచి దారుణమైన విషయమొకటి తెలిసింది.

ఆ స్త్రీ నిశ్చయంగా అత్యంత సౌందర్యవతి.

ఆమెకు జబ్బుచేస్తే చేర్పించిన హాస్పిటల్ డాక్టర్‌కి ఒక బలహీనత. అహ... పిచ్చి ఉందట.

అందంగా ఉండే రోగిని స్పృహ తప్పించి ఆ అపస్మారకస్థితిలో ఆమెననుభవించడం అతనికి హాబీ అట.

అవకాశం రావాలేకాని స్త్రీ శవంతో సుఖించడం (?) మరీ ముచ్చటట!

ఈ సౌందర్యవతి అతని ఆ పనులవల్లే చనిపోయిందట. అది నిజమే అయితే అంతకంటె దారుణం మరేమయినా ఉంటుందా?

ఇలాటివి పైశాచిక రాక్షసవాంఛలు కాక మరేమవుతాయి?

నిజంగా ఆ డాక్టరు అలాటి నేరస్తుడే అయితే అతనికే శిక్ష సరిపోతుంది?

"స్పృహలేని, ప్రాణంలేని స్త్రీ కట్టెనుండి ఆ పిశాచి జుర్రుకునే ఆనందమేమిటి?

అతను డాక్టర్ కూడా! మానవత్వం, వివేకం, విచక్షణ ఏదీ మిగలలేదా అతనికి?

మగవాళ్లతో సమానంగానో, అంతకంటె ఇంకా కొంచెం ఎక్కువగానో ఉన్నారు తప్ప స్త్రీలు తెల్లకాకులు కారే! సంఖ్యలో తక్కువ కాదే! అరుదయిన జీవులూ కారే. మరెందుకు మగవాడు ఆడదాని ముఖమే చూడనట్లు ఆమె శవంకోసం కూడా ఇంతగా వెంపరలాడడం?





ఆలోచిస్తున్న శివాని గేటు పాడిన సంగీతానికి తుళ్లిపడింది. కిటికీలోంచి బయటకు చూస్తే ఎప్పుడో చీకటిపడిపోయింది. ఇలాటివేళ ఎవరొస్తున్నారూ?

ఆమె లేచి టార్చి తీసుకుని బయటకు నడిచింది.

గేటులోంచి పిచ్చివాడిలా ఉన్న ఒకతను వస్తున్నాడు. జడలు కట్టి ఉన్న జుత్తు. ముఖం అదోలా బుగ్గలు లోపలికి పోయి ఆరీనులా నడుముకి చిన్న గుడ్డ... బికారిలా...

అతను పిచ్చివాడైతే కష్టమే.

ఏం చెప్పినా అర్థం కాదు. పొమ్మన్నా సరే ఓ పట్టాన పోడు.

అతని కళ్లు సూదుల్లా ఉన్నాయి. తీక్షణంగా చూస్తున్నాయి.

సాయంత్రపు చితి ఇంకా పూర్తిగా ఆరలేదు. చంద్రనిప్పులు కణకణలాడుతూ ఎర్ర వెలుగులు చిమ్ముతున్నాయి. నల్లని చీకట్లో ఎర్రని వెలుగు చిత్రంగానూ, భయం గొల్పుతూనూ ఉంది.

ఆ ఎర్రని వెలుగులో అతను మరింత భయంకరంగా కనిపిస్తున్నాడు. అతని చేతిలో ఆయుధముంది. అది చూసి ఆమెకు వొణుకొచ్చింది.

శ్మశానంలో కాపరికి రక్షణ లేదు. ఎప్పుడేనా ఏదయినా జరగొచ్చు. కాపరి స్త్రీ అయితే అత్యాచారం కూడా.

తను భయపడుతున్నట్లు కనిపిస్తే ఎదుటివాడు మరింత విజృంభిస్తాడు. ప్రస్తుతానికి మేకపోతు గాంభీర్యం నటించి అంత అవసరమొస్తే అప్పుడు తోకముడవడం మంచిపని. లేకపోతే కాటికాపరి మరింత లోకువైపోతుంది.

అతను చితివేపే చూస్తున్నాడు, అదోలా.

"ఎవరు నువ్వు? " అడిగింది శివానీ.

"అఘోరీని" అతను ఆ మాట అయిష్టంగానే చెప్పినట్లున్నాడు, చితిమీంచి దృష్టి తీయకుండా.

"నీకిక్కడేం పని? "

అతను నవ్వాడు. "నాకు నచ్చిన ఆహారం దొరికేదిక్కడే. శ్మశానంలోనే"

"అంటే? "

"అఘోరీలు ఎక్కువగా మాటాలాడడానికి ష్టపడరు. కాని తప్పేట్లు లేదు. మేము శివ భక్తులం. మా విహారమే కాదు, ఆహారానికీ శ్మశానమే అనువైనది"

"అంటే? "

"మాకు నచ్చే ఆహారం మానవమాంసం. శవం ఎంత పచ్చిగా ఉంటే ఆ మాంసం అంత మంచిది. నేను వచ్చింది ఆహారాన్వేషణలో. అంటే శవాన్వేషణలోనే"

"ఎక్కడినుంచి వచ్చావ్? నిన్నెప్పుడూ చూసినట్లు లేదే"

"మేము అఘోరిలం. ప్రస్తుతానికి యూనివర్సిటీ వెనుక ఏరియాలో ఉంటున్నాం. ఇక్కడికి చుట్టపుచూపుగా వచ్చాను. ఈ శ్మశానంలో నా ఆహారంకోసం ఒక ప్రయత్నంచేసి నా అదృష్టం పరీక్షించుకుందామని వచ్చాను. ఎందుకలా బెదిరిపోతావ్? నీకు అఘోరీల గురించి అపోహలే తప్ప అసలు నిజాలు తెలియవనుకుంటాను. అందుకే భయపడుతున్నావ్"

"ఏమిటా అసలు నిజాలు? "

"ఇప్పుడు తప్పనిసరయి వ్రతభంగం చేస్తున్నాను కానీ- అఘోరీలు మాట్లాడడాని కిష్టపడరు. మౌనమే వారికి ప్రియమయిన భాష. మేము శివభక్తులం. మొలకి చర్మం కప్పుకోవడమే బాగుంటుంది మాకు. అలాగే వొంటికి చితాభస్మం పూసుకుంటాం. జుత్తు జడలు కట్టడమే మాకలంకారం"

కొంచెం ఆగి మళ్ళీ చెప్పసాగాడు.

"మీకు మా గురించి అట్టే తెలియదు. మా జాతి ఎక్కువగా ఉత్తరదేశం వేపు న్నారు. మేము చదువుకుంటాం. మా అఘోరీలు కొందరు యూనివర్సిటీ విద్యార్థులు కూడా

"ఆ! నమ్మలేకపోతే మానెయ్. నాకు నష్టంలేదు. ఒకటి మాత్రం నువ్వు నమ్మితీరాలి. మేము అఘోరీలం. నరమాంస భక్షకులమే కాని నరహంతకులం మాత్రం కాము. నరమాంసం మాకత్యంత ప్రీతికరమయిన ఆహారం అనేది మాత్రం నిజం"

నాక్కొంచెం ధైర్యమొచ్చేసింది అతని మాటలకి.

"నరమాంసానికి రుచి ఉంటుందా? "

అతను నవ్వాడు.

"ఆ మాటకొస్తే ఏ మాంసానికి మాత్రం రుచి ఉంటుంది? మీకు మాంసం రుచంతా మసాలా ఉప్పు కారాలలోనే. కాని పచ్చి మాంసం తినే మాకు తెలుస్తుంది దేని అసలు రుచి ఏమిటో. అఘోరీలనడిగితే ఈ ప్రపంచంలో అన్నిటికంటే రుచికరమైనది మానవమాంసమే అంటారు"

"చూస్తూ చూస్తూ మానవమాంసం ఎలా తినగలుగుతారూ? "

"మేక మాంసం, కోడి మాంసమూ మీరెలా తినగలుగుతారో అలాగే మేము నరమాంసమూను. మనిషి కపాలంలో అదే శవం పుర్రెలో మేకరక్తం నిలవచేసి తాగితే ఎంత మజాగా ఉంటుందో!"

ఆమెకామాటలకే వాంతొచ్చే పర్యంతమయింది. అయినా తమాయించుకుందెలాగో.

"న్యూగినీలోని ఒక తెగలో కుటుంబసభ్యులెవరేనా చనిపోతే వారి మాంసం తినే ఆచారమ్మూ, అలవాటూ ఉండేది. దానివల్ల ఎన్నో సులువులున్నాయి. శవదహనపు ఖర్చులుండవు. పైగా ఆ కుటుంబానికి కొన్ని రోజులపాటు తిండి సమస్య ఉండదు" అన్నాడు అఘోరీ.

"కాని అందువల్ల వారికి కురు అనే మెదడువ్యాధి కూడా వచ్చేదట. తెలుసా? "

"వ్యాధులకీ ఆహారానికీ సంబంధమున్నా లేకపోయినా మనం చేయగలిగిందేమీ లేదు. చూడూ, కవులు సుందరీమణుల కనులను పోలుస్తారే మీనాలు, మత్స్యాలు అంటూ.

వాటిని తినడం కళ్లకి మంచిది కాదంటారు వైద్యులు. అలాగని చేపలు తినడం మానేశారా? బీఫ్ తింటే పేగులలో ఏలిక పాములాంటి ఒకరకమైన క్రిమి పెరుగుతుందంటారే! మరి ప్రపంచం బీఫ్‌ని ఆహారంగా త్యజించిందా? అంతెందుకూ... మేక, గొర్రె మొదలయిన జంతువుల మాంసంలో కొవ్వూ, కొలెస్టరాలూ ఎక్కువ. వాటివలన హృదయవ్యాధులూ, గుండెజబ్బులూ రావడానికి అవకాశం పెరిగిపోతుంది. మరి వాటి మాంసం తినడం మానెయ్యలేదే మనుషులు!

ఆహారం ఏదీ నిషిద్ధం కాదు. ఎవరికేది ష్టమయితే అది తింటారు.

పాములని తింటారు జపాన్‌లో

కుక్క మాంసం భక్షిస్తారు కొందరు. ఉసుళ్లు అంటే తెలుసుగా. వేసవిలో వర్షం వచ్చేముందు హఠాత్తుగా పుట్టుకొచ్చే రెక్కల దీపం పురుగులు వేయించుకు తినేవారు కొందరు.

వానపాములని ప్రీతిగా నూడిల్స్‌లా తీసుకునేవారున్నారు.

జపాన్‌లో కప్పకాళ్లతో ఊరగాయ పెట్టుకుంటారు.

మనదేశంలో నక్కలోళ్లు, యానాదులు, ఎరుకలు మొదలైన కొందరు కాకుల్ని కొట్టుకు తినేవారొకప్పుడు.

ఎలుకల్నీ, ఉడతల్నీ, నక్కలనీ కూడా తినే





వారున్నారు.

అంచేత ఎవరి తిండి వారిష్టం. దానిలో ఆక్షేపించడానికి కాని, నిషేధించడానికి కాని ఏమీలేదు.

పుర్రెకొక బుద్ధీ, జిహ్వకో రుచీ అని ఊరికే అనలేదు పెద్దలు. నా జిహ్వకు నర మాంసం రుచి" నవ్వాడు అఘోరీ.

అతను ఈ జాబితా అంతా చెబుతూంటే ఆమెకు వాంతివొచ్చేంత పర్యంతమయింది.

"మాడమ్! నాదో చిన్న ప్రార్థన" అన్నాడు అఘోరీ.

ఏమిటన్నట్లు చూసిందామె ఏం వినవల సివస్తుందో అని ఒకపక్క భయపడుతూనే.

"మా అఘోరీల సంఖ్యకు తగినన్ని శవాలు లభ్యం కావటంలేదు. మాకెప్పుడూ తృప్తిగా తిన్నట్లే ఉండటంలేదు. కడుపునిం డనే నిండదు. నరమాంసంలో కూడా మళ్లీ ఎంపూ, ఎన్నికా ఉంటుంది. పసిపాపలు చనిపోతే ముందు గొయ్యితీసి దాన్లో ఉప్పేసి అప్పుడు పాప శవాన్ని పూడ్చుతారు ఉప్పువేస్తూ. అలా ఊరిన లేతమాంసం రుచి చెప్పనలవి కాదు"

ఆమె అసహ్యించుకుంటున్నట్లు అంది. "గోతి దగ్గర నక్కలే గోతిలోని శవాన్ని పీక్కుతింటాయనుకున్నానిన్నాళ్లూ. మను షుల్లో కూడా ఉంటారన్నమాట గోతిలో శవాల్ని తినేవారు"

అతనామె అసహ్యాన్ని ఎంతమాత్రమూ పట్టించుకోలేదు. తన ధోరణిలోనే "మీకు ఒక విషయం తెలుసా? మనిషి మెదడు తియ్యగా ఉంటుంది మిగిలిన భాగాలకంటె. ఎందుకంటే బ్రెయిన్‌లో గ్లూకోజుంటుంది. అందుకే మనిషి మెదడు ప్రత్యేక రుచి కలి గిన భాగం. చూడూ. ఈమధ్య ఏమయినా శవాలు పాతిపెట్టడం జరిగిందా ఇక్కడ? " చాలా తేలికగా కుశలప్రశ్న వేసినట్లే అడి గాడు.

"ఎందుకూ? " అందామె ఆశ్చర్యంగా.

"ఇంకెందుకు? విందు చేసుకుందుకు. ఇది పెద్ద వూరే. శవాలూ బాగానే దొరుకు తయ్. కాని చెప్పానుగా. మా అఘోరీల సంఖ్య కూడా ఎక్కువే. దాంతో మందెక్కు వైతే మజ్జిగ పల్చన అనే తీరులో ఒక్కొక్క రికీ అందే మాంసం తగ్గిపోతుంది. అంచేత మేము నరమాంసానికి సదా ముఖం వాచి ఉంటాం. ఇక్కడ మావాళ్లు అట్టే మంది లేరు.

అందుచేత పోటీ తక్కువనీ, అదృష్టం పరీక్షించుకుందామనీ వచ్చాను. ఏమిటలా చూస్తావ్? " అతను జాలిపడుతున్నట్లడి గాడు.

"శవభక్షణ మీకు అసహ్యంగా కాని, తప్పుగా కాని, పాపంగా కాని అనిపించదా? "

"దేముడి ప్రసాదంగా ఇచ్చే లడ్డూ అవీ తినడం మీకు తప్పుగానో, పాపంగానో అని పిస్తుందా? " ఎదురుప్రశ్న వేశాడు.

అలాటి ప్రశ్నకు ఆమె జవాబేం చెప్పగ లదు?

అతనే మళ్లీ చెప్పాడు. "అఘోరీల గురించి వాస్తవాలు తెలియక మీరందరూ చాలా అపోహలలో ఉన్నారు. అఘోరీలు శివభక్తులని చెప్పానుగా? అయితే వీళ్లది వామాచారం. భగవంతుణ్ణి వీళ్లు మరోవి ధంగా ఆరాధిస్తారు.

"మనిషి దేముడి సృష్టే. ఆ సర్వేశ్వరుని సృష్టిలో వ్యర్థమైనదేదీ లేదు. అందుకే మేము మాంసం, మనిషి మాంసం తింటాం. చితాభస్మం పూసుకుంటాం. మొలకి చర్మం ధరిస్తాం. శివుడి ననుకరిం చడం ద్వారా ఆ దేముడ కృపకు పాత్రులం కావాలనుకుంటాం. అందుకనే శ్మశానమే మా కోవెల. శ్మశానంలో దొరికే శవాలు

మాకు దైవప్రసాదాలు. శివుడి గణాలు భూతాలుండేది శ్మశానంలోనేకదా.

"అఘోరీలం శవభక్షకులమే తప్ప నర హంతకులం కాము.

ఇన్నీ చెప్పానుగదా! నాకో ప్రత్యుపకారం చెయ్యాలి! చిన్నపిల్లల శవం. ఉప్పులో ఊరితే ఎంత బాగుంటుందో! అలాటిది ఉంటే చూపండి. పండగ జేసుకుంటాను. లేతమాంసం. ఉప్పులో ఊరినదైతే... ఓహ్!"

లొట్టలు వేయసాగాడతను.

దిగ్భ్రాంతితో ఉండిపోయింది శివాని.

"కాటికాపరి స్త్రీగదా అని ఇక్కడికి గస్తీ మీద ప్రతిరాత్రీ మూడుసార్లు వచ్చి వెళ్తాం టాడు పోలీసు. అందుచేత మీకు నేనే ఉప కారమూ చెయ్యలేను. సారీ" అని ఎలాగై తేనేం అతన్ని వదుల్చుకోగలిగింది.

ఉండీ ఉండీ ఒక్కసారి విపరీతమయిన విసుగు ముసురుకుంటుంది శివానీ హృదయం నిండా. అది నైరాశ్యమూ కాదు, నిస్పృహా కాదు. తన జీవితం వ్యర్థమేమో అనిపిస్తుంది. ఆమె మెదడులో మూడు ప్రశ్నలు వేలాడుతాయ్ చురకత్తుల్లా. ఆ ప్రశ్నలు చిన్నవే కాని తేలుకొండిలాటివి. మనసుని తెగ బాధిస్తాయి.

"నువ్వెవరి కోసం? "

"నీకోసం ఎవరు?"

"నువ్వసలు ఎందుకోసం?"

ఎంత తలబద్దలు కొట్టుకున్నా, తనని తాను వంచించుకుందుకు సిద్ధపడినా ఆ ప్రశ్నలలో ఒక్కదానికయినా జవాబు రాదు.

"నేను ప్రజలకోసం, వారికి సేవ చేయడం కోసం. అనుకుంటున్నావా?

"ఈపాటి సేవకి నువ్వే అక్కర్లేదు. ఎవ రైనా సరిపోతారు.

"నిజానికి నువ్వు చేస్తున్నదేముంది? రిజి స్టరులో చనిపోయిన వారి వివరాలు రాయడం.

శ్మశానవాటిక రుసుము వసూలు చేయడం. తరువాత వాటిని మునిసిపల్ ఆఫీసులో అందజేయడం. అంతేగా?

"ఆడదానివని శవం తాలూకువారే దహనం సంగతి చూసుకుంటారు. వీళ్ళ మనుషులు ఉంటారు. నువ్వొట్టి పర్యవేక్ష ణకి.

"ఈ క్షణంలో నువ్వు రాజీనామా చేస్తే ఈ పనికి పదిమంది సిద్ధం. పూర్వంలా కాదు.

"అంచేత నిన్ను నువ్వు ప్రజా సేవకోసం అని మభ్యపెట్టుకోకు.

"సరే. పోనీ నీకోసం ఎవరు? ఎవర యినా నిన్ను చూడాలని తహతహలాడ తారా?

"నీతో మాట్లాడాలని ఆతృత చెందు తారా?

"నీ సన్నిధిలో వాళ్లకి కానీ, వాళ్ళ సన్ని ధిలో నీకు కాని జీవితం హాయిగా కొత్తగా అనిపిస్తుందా?

ఎవరి మాటలలో అయినా తీపి కని పిస్తుందా నీకు? ఎవరైనా ఉన్న దానికంటె అందంగా గాని, గొప్పగాగాని అనిపిస్తారా?

"ఆ రచయిత విప్లవ్ నీవాడని భ్రమప డకు. తమది ప్రేమ వివాహమనీ, తన ప్రేమంతా భార్యదే అని సందర్భం కల్పిం చుకుని మరీ అతనెందుకు చెప్పాడనుకు న్నావ్? తనమీద కలలు పేర్చుకోవద్దని ముందుగానే హెచ్చరించడానికి.

అతని దృష్టిలో ఓ రచయితకి దొరికిన పాఠకురాలివి మాత్రమే నువ్వు. ఆ అవసర మున్నంతవరకే అతను నీ వద్దకు వస్తుం టాడు. అవసరార్థం ఏర్పడిన ఈ పరిచయం స్నేహమవుతుందేమో కాని అంతకంటె ఇంకేమీ కాబోదనటంలో సందేహం లేదు"

ఇలా సాగుతున్నాయామె ఆలోచనలు.

శివాని ఒంటరితనం భౌతికమైనదే కాదు. మానసికమయినదీనూ. అందుకే ఆమె ఒక్కొక్కప్పుడలా విలవిలలాడిపోతుంది బాణం తగిలిన పావురంలా.

ఈ బాధ భరించలేకనే ఆమె మళ్ళీ ప్రయత్నించింది. ఊళ్లో ఇల్లు దొరుకుతుం దేమో, నలుగురి మధ్యాఉంటే కొంతయినా నయంగా ఉంటుందని. కాని ఆమెకంటే ముందు ఆమెచేసే ఉద్యోగమే కనుపించ డంతో ఎవరూ కాటికాపరికిల్లిచ్చేది లేదనే శారు. అద్దెకి కూడా ఆశపడకుండా.

ఒకవేపు చదువు, మరోవేపు ఛాందసం.

ఒకవేపు నాగరికత మరోవేపు **పాశవికత.**

అంతేకదా ఎంత పట్నవాసులయినా?

కాటికాపరంటేనే అరిష్టమనేదానికి పర్యా యపదమని చాలామంది నమ్మిక. తన గురించి తెలిసినవారికి తన ముఖం చూడ డానికే జంకు. తను పలకరించబోతే ముఖం తిప్పేసుకుంటారు. తనే మృత్యు వులా కనిపిస్తుందేమో వారికి? తననుంచి దూరంగా తొలగిపోతారు. ఒకవిధంగా తనని వెలివేసినట్లే ఉంటుంది వారి ప్రవ ర్తన.

ఎవరైనా ముందు తెలియక తనతో మాట్లాడినా అంతలోనే ఎవరో వచ్చి "అది కాటికాపరి" అని చెప్పడమూ వాళ్లూ తనకి దూరంగా పారిపోవడమూను.

అలాటప్పుడు ఆవేశమూ, ఉక్రోషమూ పట్టలేక-

"నేను- మీకు న్యూసెన్స్‌గా మిగలకుండా శవాలని సంస్కరించి పెట్టే సహాయకురా లినే తప్ప నేను శవాన్నీ కాదు, మీపాలిటి మృత్యువునీ కాను. కాటికాపరే లేకపోతే మీ బతుకులెంతగా ఎలా కుళ్లిపోతాయో ఎంత రోగగ్రస్తమవుతాయో మీరు ఊహించన యినా ఊహించలేరు. మీకంత ఉపకారం చేసే నన్ను మీరు ఏమాత్రం మనుషుల యినా మీలో ఏమాత్రం మానవత్వంకాని, కృతజ్ఞతకాని ఉన్నా, మీకేపాటి వివేకమూ, విచక్షణా జ్ఞానమూ ఉన్నా మీరు చేయవల సింది నన్ను వెలివేయడమూ, దూరంగా ఉంచడమూ కానేకాదు. నన్నూ మీలాటి మీసాటి మనిషిగా గుర్తించి స్నేహం అందించాలి" అని అరవాలనిపిస్తుంది. నలు గురిలోనూ అలా అరిస్తే పిచ్చిదనుకుంటా రేమో అని కుటీరానికి వచ్చి అరిచి ఆవేశం చల్లార్చుకుంటుంది. ఏడ్చుకుని దుఃఖోపశ మనం చేసుకుంటుంది. అదేం దౌర్భాగ్యమో తనకి కొందరిలో ఎక్కడలేని గుర్తింపూను.

ఆ పేపర్లవాళ్లు తనని పాప్యులర్ చేసి ఒకవిధంగా ద్రోహమే చేశారు. గజదొంగ, ఘోరహంతకుల ఫొటోల్లా తన ముఖమూ చాలామందికి తెలిసిపోయింది. దానివల్ల మరింత వెలి. తనని ప్రేమించడం మాట దేముడెరుగు. కనీసం స్నేహమయినా చేయరు తనతో.

తనతో ఎవరయినా నాలుగు మాటలు మాట్లాడతారంటే- అది శవం తాలూకు వాళ్లే! అదయినా శ్మశానంలో తనదే అధి కారం కనుకా. తనతో అవసరాలుంటాయి కనుకే. శవదహనమైపోయి శ్మశానం గేటు దాటారో వారే తనని గొంగళిపురుగుకిమల్లే చూస్తారు.

అవసరంపడితే తప్ప తన ముఖం చూడ రెవరూ. అలా చూసేది కూడా అవసరం ఉన్నంతవరకే. రేవు దాటేవరకూ ఓడమల్లయ్య. వొడ్డు చేరేశాక బోడిమల్లయ్య.

తనతో ఎవరికీ అనుబంధాలేర్పడవు-అవ సరం కలగడమే తప్ప. ఆ రచయితకయినా అంతే.

కాటికాపరి కావడమే తను చేసిన పొర పాటా?

మగ కాటికాపరికీ ఇలాటి వృత్తిమూలక





వెలివుంటుందా?

ఉంటుంది.

ఇంతగా కాకపోయినా కొంతేనా.

రామదాసు తాతకి ఊళ్లో ఇల్లు దొరకలేదుగా? అతను కాటికాపరే కాకపోతే అతనికి మెడ వంచయినా మారుమనువు చేసేవారు కాదూ?

కాటికాపరంటే మనుషులని చంపే హంతకుడు కాదు. చనిపోయినవారి శరీరాలను సంస్కరించేవాడు మాత్రమే. మరెందుకూ సంఘంలో అతన్ని ఇలా వెలివేయడం?

ఇదేం న్యాయం? ఏం ధర్మం?

హంతకుడినో, గజదొంగనో, బందిపోటునో వెలివేస్తే సమంజసంగాని కాటికాపర్లేం నేరం చేశారని?

ప్రశ్నలు, ప్రశ్నలు, ప్రశ్నలు.

ఎవరు జవాబులు చెబుతారామెకి?

ఏమని చెబుతారు?

శివానిని బాధిస్తున్నది ప్రేమరాహిత్యం.

ప్రేమించాలి. ప్రేమించబడాలి. అప్పుడే తీరుతుందా తపన. అలాగే చల్లారుతుందా తాపం. కాని కాటికాపరని పేరు పడిపోయిన ఆమెను ప్రేమించేదెవరు? స్నేహంచేసేదెవరు? కమ్మగా కబుర్లు చెప్పేదెవరు? ఆప్యాయంగా ఆలింగనం చేసుకునేదెవరు?

ఆమె ప్రేమరాహిత్యానికి విముక్తీ నివారణ ఎలా? ఎప్పుడు? అసలున్నాయా అవి? ఈ ప్రేమరాహిత్యపు ఆందోళన నుంచి తప్పించుకోవాలని పుస్తకం తెరుస్తుంది. చదవబుద్ధి కాదు. కోపంగా విసిరేస్తుంది. తిండి మానేసి తననితాను శిక్షించుకుంటుంది. ఒక్కొక్కప్పుడు కావాలని వాత పెట్టుకుంటుంది. లేదా వేలు కోసుకుంటుంది. తననితాను శిక్షించుకుని తనమీద తనే కసితీర్చుకుంటుంది. కాని ఇవేవీ పైవారికి తెలియవు. జరిగేవన్నీ కుటీరంలోనే కనుక. తెలిసినా ఎవరు పట్టించుకుంటారు కాటికాపరి వంటి క్షుద్రజీవిని?

ఆమె ఏమైతే ఏం. ఎలా పోతే ఏం? ఆమెమీద జాలిపడే హృదయమెవరికుంది? చివరికి ఆఫీసులో జీతాలిచ్చే గుమాస్తా కూడా సూటిగా ఆమె ముఖంలోకి చూడడే. ఆ ముఖం చూస్తేనే పంచమహాపాతకాలూ అంటుకుపోతాయన్నట్లు.

కనీసం సాటి పారిశుధ్యపు పనివారే ఆమెను పల్కరించరే, తోటి ఆడదనయినా ఆలోచించరే!

ఎందుకీ బండబతుకు? ఎందుకీ దండగ బతుకు? చివరికి శవాలు కాలే శ్మశానంలో కూడా తులసికోటలున్నాయి. వాటిలో తులసిమొక్కలో పూల మొక్కలో ఉన్నాయి. అవి పూలు పూస్తాయి. శ్మశానంలోని గడ్డి పూలు పూస్తుంది.

అటు చితిమంటలు. అయినా ఇటు విరిసేవిరులు.

కాని తన ఎడారి జీవితంలో ఒక్క మొక్కా మొలవదేం? ఒక్క పువ్వూ పుయ్యదేం? ముచ్చటపడదామంటే. ఒక్క మధురస్మృతి మిగలదేం? తియ్యనివేవీ జరగవేం?

ఈ కాలంలో కూడా వెలి! నమ్మశక్యమేనా? ఈ కాలంలో కూడా సతి ఉందట. అది చదివినప్పుడు నివ్వెరపోయింది. కాని, ఇప్పుడు వెలిని ప్రత్యక్షంగా అనుభవిస్తోంది. తన జీవితమూ అనుభవాలే నిదర్శనాలు. ఏ తప్పుకీ వెలిశిక్ష? పదిమందికీ అవసరమైన మంచిపని చేస్తున్నందుకా మనిషిని వేరుపెట్టే సమాజం!

ఇదా మన చదువూ, నాగరికతా, విజ్ఞానమూ, సాంకేతికాభివృద్ధీ సాధించినవి! ఇదా సమసమాజం! ఈ సమాజపు... దేశపు... రాజ్యాంగమూ ఉద్యోగ నియామకాలలోనూ, ఉద్యోగాలలోనూ వివక్షత పాటించబడదని ఉల్లేఖించింది.

తాతా! ఇందుకేనా నువ్వు నేనీ ఉద్యోగంలో చేరతానంటే సుముఖత చూపించనిది? ఆవేళే నువ్వు వివరించి రాబోయే పరిణామాలివీ, నీ జీవితం కాటికాపరివైతే ఇలా సాగుతుంది అని నాకర్థమయ్యేటట్లు స్పష్టంగా చెప్పగలిగి ఉంటే ఎంత బాగుండేది! నేనీ తప్పటడుగు వేసేదాన్ని కానేమో. ఇప్పుడు ఎంత వగచీ, పశ్చాత్తాపపడీ ఏం లాభం? గతజలసేతు బంధనమే. పూర్తిగా ఊబిలో కూరుకుపోయాను. నన్నెవరూ రక్షించలేరు. టూలేట్. హోప్‌లెస్. క్రయిసిస్ రానే వచ్చేసింది. నో సొల్యూషన్.

ఉంది. పరిష్కారం ఉంది. కచ్చితంగా ఉంది. ఎటొచ్చీ తను ధైర్యం చెయ్యగలగాలంతే. నిజానికి ధైర్యం కూడా కాదు. తెగింపు. మూర్ఖత్వంతో కూడిన తెగింపు.

అదే నయమేమో. విద్య, వివేకము, విచక్షణ, సేవాదృష్టీ ఇవన్నీ ఏం ఒరగబెట్టాయి తనకి? దుఃఖమే తవ్వి తలకెత్తుతోంది. జీవితమంటే అర్థం ఏడుపూ, విషాదమే అయిపోయింది. బతుక్కి భాష్యం ఒంటరితనమే అయింది. మనుగడ ఒట్టి ఎడారియానమే అన్నట్లు మారిపోయి ఎందుకీ బతుకు? ఎవరికోసం?

అక్కడ శ్మశానంలో అలికిడేమిటి? ఇలా టివేళ ఎవరు? ఏం చేస్తున్నారు?

ఆలోచనలు వాయిదావేసి కర్తవ్యం నిర్వర్తించేందుకు లేచింది శివాని.

ఆవరణంతా శ్మశానమే అయినా, ఆ నాలుగుగోడల నడుమా ఉండేదంతా వల్లకాడే అయినా తన కుటీరాన్ని ఇల్లుగానూ, మిగిలిన భాగాన్నంతటినీ శ్మశానంగానూ భావిస్తుంది శివాని.

ఇప్పుడామె ఒక చేతితో టార్చిలైటూ, మరోచేత్తో చాపాటి కర్రా (దుడ్డు కర్రా) పట్టుకుని నడుస్తోంది. కాటికి కాపు కూడా ఆమె విధే. అందుకే ఆమె ఉద్యోగానికి 'కాటి కాపరి' అనే పేరు.

ఆమె టార్చి వెలిగించలేదు. మసక వెన్నెలలో అంతా కనిపిస్తూంది- అస్పష్టంగానే అయినా. చితిపేర్చే చోటుకి పదిపదిహేను గజాలదూరంలో ఒక చెట్టుంది. దాని పేరే కాదు, ఉపయోగమేమిటో కూడా ఆమెకు తెలియదు. అది ఎన్నడూ పూతపెట్టలేదు. కాపు కాయలేదు. ఊరికే పెరిగిందంతే. కొమ్మలూ, రెమ్మలూ, ఆకులూ. తనలాగే ఒంటరిగా వ్యర్థంగా.

ఆ చెట్టు దిగువ ఎవరో? అక్కడ జరుగుతున్నది బాగానే కనిపిస్తోంది. ఒక మనిషి లీలగా కనిపిస్తున్నాడు. తాడుని ఆ కొమ్మ మీదకు విసురుతున్నాడు. ఎందుకో? ఆ తాడు అతను కోరుతున్నట్లు పడడం లేదల్లే ఉంది. మళ్ళీ మళ్ళీ విసురుతున్నాడు. సునిశితమయిన తన చెవులకి వినిపించింది ఈ తాడు కొమ్మలకి తగులుతూ చేసిన శబ్దమే.

ఎలాగైతేనేం అతను సాధించినట్లున్నాడు. ఆ తాడుని మెడకి తగిలించుకుని ముడి. మెడకి ముడి.

"ఆగండి!" అరుస్తూనే టార్చి వేస్తూ అతని వద్దకు పరుగెత్తింది.

అతను ఊహించని ఈ పరిణామానికి బిత్తరపోయాడు. మెడలో తాడు ముడితో అలాగే ఉండిపోయాడు ఆమెవేపు వెర్రిచూపులు చూస్తూ.

అతను తీవ్రమైన నిరాశ చెందినట్లున్నాడు తన ప్రయత్న భంగానికి.

"ఎవరు మీరు? " అడిగింది. దాదాపుగా అరిచింది.

అతని ఉద్దేశమూ, ప్రయత్నమూ–నిర్ద్వంద్వంగా అర్థమైపోవడంతో ఒక్కసారామెకు ఆశ్చర్యం వేసింది. శ్మశానానికొచ్చి ఉరి తీసుకోవాలనుకోవడంలో ఇతని ఉద్దేశమేమిటి?

వెనకటికొక లోభి శవవాహక ఖర్చు తప్పుతుందని- చివరిక్షణాలలో శ్మశానానికొ





చ్చేసి కూర్చున్నాడట. అది కథే కావచ్చు, కాని ఇది నిజం. కళ్లముందు కనపడుతున్నది.

"ఎవరని అడుగుతూంటే మాట్లాడరేం?" గద్దించింది శివాని.

ఈసారతను నవ్వాడు.

"నవ్వుతారేం, అడిగినదానికి జవాబు చెప్పకుండా? " అంటూనే ఆ తాడు లాగేసి దూరంగా విసిరేసింది.

"నేను తల ఎత్తానంటే... ముఖం చూపానంటే... నేనెవరో నోరు విడచి చెప్పకుండానే మీకు తెలియనూ తెలుస్తుంది, దాంతో ఆమడదూరం పరుగెత్తనూ పరుగెత్తుతారు. నా మాట విని మీరు వెళ్ళిపోయి నా మానాన నన్ను హాయిగా చావనివ్వండి. ఆత్మహత్య చేసుకోనివ్వండి. మీకు చేతులెత్తి మొక్కుతాను"

"మొక్క నక్కర లేకుండానే చేసుకోనిస్తాను. ఐతే ఒక షరతు. మీరెందుకు చనిపోవాలనుకుంటున్నారో చెప్పాలి. అది సవ్యమయిన కారణమయితే నేనూ మీకు సహకరిస్తాను. అంతే కాదు. నేనూ ఆత్మహత్య చేసుకోవాలని ఆలోచిస్తున్న దానినే. ఎటొచ్చీ సరయిన మార్గదర్శకత్వం లేక ఆగిపోతున్నాను. మీరు నాకు గైడ్‌గా ఉండి నాచేత ఆత్మహత్య నిర్వర్తింపజేద్దురుగాని. రండి.. ఇక్కడ చలేస్తూంది. లోపలకెళ్ళి మాట్లాడుకుందాం"

ఆమె మాటలతనికి అర్థంకాలేదు. ముఖ్యంగా ఆ ధోరణి. తనని ఆటలు పట్టిస్తూందేమో అనిపించింది. అందుకే అతను కొంచెం కోపంగా "మీరెవరు? ఆడవాళ్ళయి ఉండీ యీ రాత్రివేళ ఒంటరిగా శ్మశానంలో ఎందుకున్నారు? " అని అరిచాడు.

"మీలాటివాళ్ళు అనవసరంగా ఆత్మహత్యలు చేసుకోకుండా చూసేందుకే నేనిక్కడున్నాను మిస్టర్! ఇది శ్మశానం. అంటే... మనుషులు చనిపోయాక వారి శవాలను కాల్చేచోటు. అంతే తప్ప- ఈ ప్రదేశం చావడానికి కాదు. ఆత్మహత్య పాపమేకాదు, ఆత్మహత్యా ప్రయత్నం నేరమూను ఫ్రెండ్! నేనెవరినని అడిగావు కదూ? ఈ శ్మశానమనే కార్యాలయానికి అధికారిని. ఇప్పుడు నిన్ను ఆత్మహత్యాప్రయత్న నేరం కింద పోలీసులకు పట్టించగలను, తాడు సాక్ష్యంగా ఉంది కూడా"

ఎందుకో ఆమెకతన్ని బెదిరించాలనిపించింది. ఆమెకలాటి కోరిక కలగడం అదే మొదటిసారి.

ఆమె బెదిరింపుకి అతనొక్కసారి పకపక నవ్వేశాడు ఆపుకోలేనట్లు. ఆమె తెల్లబోయింది ఇతనేమీ నాగరికుడిలా లేడు. మరి పోలీసులకి భయపడడేం పైగా నవ్వుతాడు కూడా ఏం?

"ఏం చేస్తారు పోలీసులు? కోర్టుకి తీసుకెళ్తారు. జడ్జి ఉరిశిక్ష వేస్తాడు. కాని నన్ను ఉరితీసేదెవరు? ఊరంతటికీ ఒక్కడే మంగలైతే అతనికి క్షవరం చేసేదెవరు? " మళ్ళీ నవ్వాడు.

అతని మాటలామెకేమీ అర్థంకాలేదు కాని బయటపడకుండా "ఉరిశిక్ష పైపైన లేదు ప్రతినేరానికీ విధించడానికి. మీ నేరానికి పడేది ఉరికాదు. జైలు. కొన్నేళ్ళపాటు జైలుశిక్ష"

"పోలీసులు... జైళ్ళు... ఉరి... నన్ను బెదిరించమాకండి. అవన్నీ అమ్మ పుట్టిళ్ళే. నేను మసిలేదే అక్కడ!"

సాధికారంగా ఉందతనికంఠం.

"మీరు... మీపేరు"

"చావబోయేవాడి పేరుతో మీకేం నిమిత్తం? " ఎదురు ప్రశ్నవేశాడు.

పొట్టి యాంగ్రీయంగ్‌మాన్‌లా ఉన్నాడనుకుందామె. "పోనీ, యిదేనా చెప్పండి బతక

లేక చనిపోవాలనుకుంటున్నారా?"

"పిచ్చి ప్రశ్న. బతకలేక కాకపోతే చావ లేక చనిపోవాలనుకుంటారా ఎవరైనా? నేను చావాలనుకునేది నేను బతకలేకకాదు. నన్ను బతకనివ్వక"

"అంటే?"

ఆమె కావాలనే అతనికి విసుగుతెప్పిస్తూంది. ఇలా తాత్సారం చేయిస్తే అతని ఆత్మహత్య వేడి తగ్గి మనిషౌతాడని ఆమె ఆశ! అందుకే ఏవేవో ప్రశ్నలు వేస్తూ కాలహరణం చేస్తూంది.

"మిమ్మల్ని బతకనివ్వని దెవరు?"

ఒక్కసారతనిలోకి మళ్ళీ కోపం వొచ్చేసింది. "జనం! నా చుట్టూ ఉన్న జనం" కసిగా అన్నాడు.

"భలే వారే! జనంకోసం మనం చావడమేమిటీ, మరీ అమాయకత్వం కాకపోతే? ఔనూ... ఇందాకా... మీరు... మీ ముఖం చూస్తే చాలు. చెప్పక్కర్లేకుండానే మీరెవరో తెలిసిపోతుందన్నారు. ఔనా?" మరచిపోయిన విషయం మళ్ళీ జ్ఞాపకం వొచ్చినట్లడిగింది.

"అన్నాను. కావాలంటే మళ్ళీ అంటాను" మొండిగా అన్నాడు.

అక్కర్లేదు. కానీ నాతో రండి" మృదువుగా అడిగింది.

"ఎక్కడికి?"

"నా కుటీరానికి"

"ఎందుకు?"

"అక్కడ విద్యుద్దీపముంది. ఆ కాంతిలో మీ ముఖం చూసి... మీరెవరో తెలుసుకుందుకు ప్రయత్నించి చూస్తాను. నేను గెలుస్తానో వోడతానో చూసుకోవాలని సరదాగా ఉంది"

"సరే... కాని ఒక షరతు. పోనీ... పందెం లాటిది"

"ఏమిటి?"

"మీరోడిపోతే నన్ను ఉరివేసుకోనివ్వాలి అడ్డు పడకుండా"

"గెలిస్తే?"

"మీ మాట వింటాను. మీరు చెప్పింది చేస్తాను"

"సరే! రండి" ఆమె దారితీసింది. అప్పుడప్పుడతను తనతో వొస్తున్నాడో లేదో అని వెనక్కి తిరిగి చూస్తూ... దారి చూపడాని కన్నట్లు టార్చివేయసాగింది.

"ఈ గడ్డిలోంచీ తుప్పలలోంచీ అలా నిర్భయంగా నడిచి పోతున్నారే! మీకు పాముల భయంలేదా?"

"మీకుందా?"

"చచ్చేంత. నాకింకేదన్నా బెదురు లేదు కానీ పామంటే మాత్రం దడ"

"ఎందుకనీ!"

"పాము చుట్టుకుంటుంది. తాడులా... ఉరి తాడులా"

"నాకు పాములంటే భయంలేదు. ఎందుకంటే- పాములు శంకరాభరణాలు. నా పేరే శివాని. శివుడి పేరు కనుక నాకు పాముని మెడలో వేసుకోవాలనిపిస్తుంది" నవ్వింది ఆమె. తను ఎన్ని అబద్ధాలు చెబుతోందీ యితన్ని చావునుంచి తప్పించేందుకు! అంతేకాదు అసలు విషయం అతనే తనని ఆత్మహత్యనించి తప్పించాడేమో.

ఇద్దరూ కుటీరంలోకి వచ్చారు. ఆమె దీపం వేసింది. పెద్ద బల్బు.

"త్వరగా నా ముఖం చూసి ప్రయత్నం చెయ్యండి" తొందర చేశాడతను.

"ఏం ఆత్మహత్యకు... అదే ఉరికి ముహూర్తం దాటిపోతూందా?"

"ఔను. ఆలస్యం అమృతం విషం"





"ఏమో... ఎవరు చెప్పగలరు? ఆలస్యం విషమమృతమేమో. కొన్నింటిలో నిదానమే ప్రధానం. చూడండి... పరీక్షంటే మెదడుకి సంబంధించింది. మెదడు చురుగ్గా పని చెయ్యాల్సి ఉంటుంది. అసలే రాత్రి... నిద్ర మధ్యలో మెలకువ. మత్తుగా ఉంది. ఇది వొదిలి చురుకుదనం రావాలంటే ఉల్లాసానికీ ఉత్సాహానికి వేడివేడి టీ. నిముషంలో తయారుచేసుకొస్తాను కూర్చోండి. టీ తాగి పరీక్షనెదుర్కుంటాను"

అతను కాదనలేకపోయాడు. ఆమెకి తెలుసు. ఆత్మహత్య అనేది ఉద్రేకంలోనూ ఆవేశంలోనూ జరిగేదనీ... అది వాయిదా పడి ఆలోచనకు వ్యవధి లభిస్తే చాలా ఆత్మహత్యలు నివారించబడతాయని.

ఆమె ఏమీ తొందరపడకుండా మెల్లగానే తయారు చేయసాగింది టీ. అతనికి ముప్ఫయ్యేళ్లుండొచ్చు. మనిషి నల్లగా ఉన్నా అందంగా ఆరోగ్యంగా ఉన్నాడు. కాకపోతే కళ్లల్లో ఎందుకో కసి... అందువల్ల ముఖంలో క్రూరత్వమూ కఠినత్వమూ.

"టీ తీసుకోండి" అంది ఎటోచూస్తున్న అతనికి కప్ అందించి. అతని కెదురుగా కూర్చుని ఆమె కూడా టీ తీసుకోసాగింది. దీపకాంతిలో అతని ముఖం స్పష్టంగా కనపడుతోంది. ఆమె తనను పరిశీలించడం అతను గమనించకపోలేదు.

చెప్పండి, నా ముఖం చూస్తే నేనెవరినో తెలిసిపోవడంలేదూ? "

"ఎందుకు తెలియడంలేదూ? మీ మనసు చాలా మృదువు. మీరు చాలా మంచివారు. కాని మీకేదో చేసింది ప్రపంచం. అందుకని మీకు జీవితంమీద కోపమొచ్చేసింది. ఈ కోపమూ ఉద్రేకమూ తాత్కాలికమే. మీకు మంచి రోజులున్నాయి ముందు" మనస్తత్వ శాస్త్రమూ, జ్యోతిషమూ కలగలిపి చెప్పింది.

"అదికాదు... నా ముఖంలో... మీకు యింకేమీ కనిపించడంలేదూ? "

"ఏమిటి కనిపిస్తాయని మీరనుకుంటున్నారు? " ఎదురు ప్రశ్న వేసింది.

"ఉరితాళ్ళు" కసిగా ఉచ్చరించాడు.

ఆమె త్రుళ్లిపడింది. "ఉరితాళ్ళా! అవెందుకు కనిపిస్తాయీ మీ ముఖంలో? మీరు ఉరి తీసుకుందామనుకున్నంత మాత్రాన ముఖాన ఉరితాడు వేలాడుతుందేమిటి? ముఖం- మనసుకి ప్రతిబింబం అన్నమాట నిజమేకాని ఆ ప్రతిబింబం భావాలవరకే. భౌతికమయిన వస్తువులకు కాదు"

"నేను చెబుతున్నది నన్ను నేను ఉరివేసుకోబోయే తాడు గురించి కాదు. ఆ వొక్క ఉరి తాడు గురించీ కాదు. పదుల కొద్దీ సంఖ్యలో ఉరితాళ్ల గురించి"

"మీరేమంటున్నారో నాకేమీ అర్థంకావడం లేదు" అయోమయంగా చూసిందామె.

"మరి- ప్రపంచానికెలా కనపడుతున్నాయో! నన్నల్లంతదూరంలో చూడగానే... నా ముఖంలో వేలాడే ఉరితాళ్లనిబట్టి నన్ను గుర్తుపట్టేసి" అతను దుఃఖమూ విచారమూ సిగ్గూ ఆపుకోలేనట్లు రెండు చేతులతోనూ ముఖం కప్పుకుని ఏడిచేశాడు. భోరుమంటూ.

శివానికి ఒక్కసారి భయమేసింది. కాని అంతలోనే తేరుకుంది. ఇదీ మంచిదే అనుకుంది. ఏడుపు- మనసులోనివి బయటపెట్టుకుందుకు చక్కని మార్గం. మనసుని తేలికపరిచే మహా ఔషధం. ఉరితాళ్ళంటున్నాడంటే- ఇతని వెనుక ఏదో విపరీతమైన కథే ఉండి ఉండాలి. వ్యథాభరితమయిన గాథే ఉండి ఉండాలి. లేకపోతే అసలతను ఉరివరకూ ఎందుకొస్తాడు? జోగి జోగీ రాసుకుంటే బూడిదరాలినట్లు తనలాటి విషాదజీవికి తారసపడేవారు కూడా వ్యథా భరితులే కాబోలు.



అతను మౌనంలోకి జారిపోడం గమనించి "మీరు నిజంగా ఉరేసుకోదలుచుకుంటే పాములూ అవీ తిరిగే స్మశానం వరకూ ఎందుకొచ్చారు కష్టపడి రాత్రివేళ?' అడిగింది.

"ఇంట్లో ఉరి మిగిలిన వాళ్ళకి న్యూసెన్సు. పోలీసులూ కోర్టులూ బతికున్న వాళ్ళని కూడా చంపుతాయి ఉరిపోసుకున్న వాడికి సంబంధించిన పాపానికి. అయినా నాకిల్లు లేదు"

"అదేమిటీ? మిమ్మల్ని చూస్తేసంపాదనా ఉద్యోగమూ లేనివారిలా అనిపించరే!"

ఆశ్చర్యంగా చూసిందామె.

అతనిలో ఒక్కసారి మళ్ళీ ఉద్రేకం.

"ఆ ఉద్యోగమే నా జీవితానికి ఉచ్చూ ఉరీ బిగించింది. ఊపిరాడకుండా ఉక్కిరి బిక్కిరి చేసి వదిలింది బతుకుని. నన్ను నిలువునా ముంచి వొదిలింది"

ఆమె నిట్టూర్చింది.

"నాకేమీ అర్థమవడంలేదు. ఒక పద్ధతిలో మీ కథ చెప్పరాదూ? వినాలని నాకెంతో ఆత్రంగా ఆరాటంగా ఉంది"

నిజమా? అన్నట్లు చూశాడతను. మీరు నా జీవితం గురించి ఆరాటమూ ఉత్సాహమూ చూపడం! చూడగా మీరు మామూలు మనిషిలా లేరే! ఔను... మీరింత సేపయినా నా నుంచి పారిపోలేదంటే... మిమ్మల్నీ మీ మాటలనీ నమ్మొచ్చు నిజానికి నాకూ నా కథ చెప్పుకోవాలనే ఉంది. ఎప్పటినుంచో. కాని వినేవారెవరు" అతను మళ్ళీ నిట్టూర్చాడు.

"నేను" వాగ్దానం చేస్తున్నట్లందామె అతన్ని ప్రోత్సహిస్తూ. ఒక్కసారతని ముఖంలోకి కళ వొచ్చింది. మనిషి బలహీనతే అదేమో. తన గురించి తాను చెప్పుకోగలిగే అవకాశం రావాలే కాని ఎంత మాత్రమూ వొదులుకోడు.

"నేనొక అనాథబాలుడిని. పుడుతూనే తల్లినీ పదోఏట తండ్రినీ పోగొట్టుకుని దయామయులచేత ఒక అనాథాశ్రమంలో చేర్చబడ్డాను. వాళ్ళిచ్చిన తిండీ, బట్టా ఆశ్రయంకంటె చెప్పిన చదువు విలువైనది. మెట్రిక్ పాసయ్యాను వారి ధర్మమా అని. పద్ధెనిమిది నిండాయి కనుక అనాథాశ్రమం వొదిలేయవలసి వొచ్చింది. బతుకుతెరువు వెదుక్కుంటూ తిరుగుతున్న నన్నొక పోలీసాఫీసరు తనింట్లో ఆర్డర్లీగా నియమించుకున్నాడు. అంతవరకూ భాగానే ఉండేది. ఉద్యోగంలో చేరిన తొమ్మిది పదినెలలకి నాకు విషమపరీక్షా అగ్ని పరీక్షా ఎదురయ్యాయి"

"ఏమిటి? "

"జైలు ఒక దోషికి ఉరిశిక్ష విధించింది"

"అయితే మీకేం? "

"నేను పనిచేస్తున్నది నేను భావించినట్లు పోలీసాఫీసర్ దగ్గరకాదు. ఆయన జెయిల్ సూపరెంటెండెంటయ్యాడు"

"అయితే"

"ఉరి తీత ఆయనే నిర్వహించాలి. మిగిలినవేవీ సమస్యలు కావుకానీ ఉరి తీసేవాడే కరువు. అంతకుమునుపా పని చేసేవాడు చనిపోయాడు. నా కర్మకొద్దీ అతనికి కొడుకులు కానీ మగవారసులు కానీ లేరట. మా ఆఫీసరు నన్ను పిలిచి ఉరితీసేందుకు సిద్ధంగా ఉండమన్నాడు. నాకెంతో భయమేసింది. అనాథాశ్రమం నాలో అహింసాతత్వాన్ని పెంచిపోషించింది. నేను చదివినవి గాంధీగారి ఆత్మ కథ వంటి పుస్తకాలు. ఆశ్రమం పెంపకంలో నేను ఫక్తు శాకాహారినయ్యాను. అలాటిది నేను ఉరి తీయడమా! నాతరం కాదనేశాను, అవిధేయత అని కూడా లెక్కచెయ్యక.

"నీ విధులలో అదికూడా ఒకటి. నీ దరఖాస్తు ఫారంలో ఆ విధి కూడా నిర్వర్తిస్తానని రాయబడింది. కావాలంటే రేపు ఆఫీసు కొచ్చి చూసుకో. అయినా ఉరి గురించి అంత భయపడడానికేముంది? ట్రిగ్గర్‌నొక్కి తుపాకితో షూట్‌చేసినట్లే! ఆ క్షణంలో ఉరి తీయబడే వారి పాదాలకింద ఉన్న పలకను తొలగించడం. అంతేగా? ఒకటి రెండుసార్లు తీస్తే నువ్వే ప్రవీణుడివైపోతావ్. ఎవరికి ఏ అనుభవమైనా రావాలంటే ముందు కొన్నిసార్లు చెయ్యాలి. నీకెందుకూ? నేను దగ్గరుంటాను. అన్నీ నేర్పుతాను. ఉరి దగ్గర నువ్వేమీ ఒంటరిగా ఉండవు. నేను, గవర్నమెంటు డాక్టరు, మేజిస్ట్రేటూ అలా పెద్దవాళ్లు నీ చుట్టూ ఉంటారు. నువ్వేమీ భయపడక్కర్లేదు"

"వద్దు వద్దు... నేను మనిషిని చంపను. చంపలేను" ఏడిచాను.

"అలా అయితే నీ ఉద్యోగం ఉండదు. ఉరితీతకంగీకరించావనే నిన్ను వేసుకున్నాను ఉద్యోగంలో. లేనిదానికి నువ్వే అనేమిటి బోలెడంత మందున్నారీ ఉద్యోగానికి.





నిన్ను నమ్మినందుకు నా పరువు తీయకు. రేపటి ఉరి పూర్తిచేసి తరవాత నీ ఇష్టమొచ్చినట్లు చేసుకో" నామీద అరిచారు ఆఫీసరు.

ఆయన నన్ను బెదిరించాడు. బతిమాలాడు. "నీకేపాపమూ అంటదు. భగవద్గీతలో ఏం చెప్పాడు కృష్ణుడు? కర్మ చేయడమే నీవంతు. ఫలాఫలాలు నావే. మానవుడు నిమిత్తమాత్రుడు. నడిపేవాడిని నేను. నడిచేవాడు నరుడు. అనలేదూ? అంచేత నీకేమీ పాపం అంటదు. న్యాయంగా అయితే నీకు పుణ్యమే వస్తుంది. ఎందుకంటే నువ్వు రేపు ఉరితీయబోయేవాడు పిచ్చిరక్తం తాగే పరమకిరాతకుడు. ఎన్ని దోపిడీలు చేశాడో, ఎందరిని హత్య చేశాడో లెక్కలేదు. వాడు చెయ్యని దుర్మార్గంలేదు. అలాటి మహా పాపిని చంపి భూభారం తగ్గిస్తే పుణ్యమే తప్ప పాపమెలా వస్తుంది?" అని వేదాంతం చెప్పారు. బుజ్జగించారు. డబ్బాశ చూపించారు. ఒకటేమిటి నా మెడలూ, మెదడూ, మనసూ వంచడానికెన్ని చేయాలో అన్నీ చేశారు. యుద్ధంలో శత్రువుని చంపడం దేశభక్తికదా అన్నారు. నా చేత ఒప్పించారు.

ఉరితీయబడే వాడి సంగతేమోకాని ఆ రాత్రి నాకు మాత్రం నిద్రలేదు. ఆఫీసరు నాకొక తైనాతీని ఏర్పాటుచేసి నేను ఆరారా సారా తాగుతూ ఉండేటట్లు చూడమన్నాడు. మొదట అదేమిటో తెలియక, తరువాత ఒళ్లు తెలియకా తాగుతూ చివరికా తాగుడు మైకంలోనే అయ్యగారు చెప్పినవన్నీ కీలు బొమ్మలా చేశాను. ఖైదీకి ముఖానికి నల్లముసుగువేయడం... అతని కాళ్ల కింద చెక్కని తొలగించడం... అవన్నీ నేను కలలో లాగాచేశాను తప్ప స్పృహ ఉండి కాదు. అయినాసరే ఖైదీ శరీరం... అదే కళేబరం పిట్ (గొయ్యి)లో దబీమని పడేసరికి ఒక్కసారి నా మైకమంతా ఎగిరిపోయి కెవ్వున అరిచి నేను పడిపోయాను.

అప్పుడు "తొలిసారంటున్నారుగా ఇతనికి ఉరితీయడం? షాక్" అంటూ డాక్టరింజక్షనిచ్చాడు. రెండు రోజులు నాకు కన్ను మూసినా తెరచినా పీడకలే. నా చేత ఉరి తీయబడిన వాడి ముఖం దీనాతి దీనంగా ఏడుస్తూ కనపడడమూ 'నేను నీకేం అపకారం చేశానని నా ముఖాన్ని కళ్లు కనపడకుండానూ, గాలి ఆడకుండానూ నల్లముసుగేసేస్తున్నావ్?' అనో 'తమ్ముడూ నీకేం ద్రోహం చేశానని నా కంఠానికి ముడిబిగిస్తున్నావ్? నేను నేను నిర్దోషిని తమ్ముడూ! నన్ను చంపకు. నన్ను చంపితే నీకేమొస్తుంది? అని ఏడవడమో అలాటి దృశ్యాలే. అతన్ని చంపడంవలన నాకేమీ రాకపోవడమేమిటి? అంతరాత్మముందు హంతకుడిగా నిలబడవలసి వచ్చింది. డిపార్టుమెంటులో 'హాంగ్‌మన్' అనే బిరుదు చుట్టుకుంది నా పీకకి. ఉరితీయడమనే ఘోరమయిన పని చేసినందుకు మస్తుగా పాపిష్టి డబ్బు అందింది. ఉరితీయడానికి చేయబడిన తయారీలో నాకు సారా తాగడం అబ్బింది. ఉరితీశాక చాలా రోజుల వరకూ నోటికన్నంపోని రోజూలూ కంటికి నిద్రరాని రాత్రులూ లభించాయి. ఇలా ఎన్నెన్నో వొచ్చాయి నాకు ఒక్క ఉరితీతతో ఆ బాధ భరించలేక ఏడుస్తూ ఆఫీసర్‌గారి కాళ్లమీద పడిపోయాను.

"ఇంకెందుకూ ఏడుపు? అయిపోయిందిగా? స్త్రీ ఒకసారి శీలం చెడినా పదిసార్లు చెడినా పతితే. అలాగే ఒక ఉరితీసినా వంద ఉరితీతలు చేసినా హాంగ్‌మానే. ఒకసారి తలారి అనిపించుకున్నాక మరి తప్పించుకోలేవు. అనవసరంగా ఉద్యోగం వదులుకోకు. చిక్కుల్లో పడకు. ఈ రోజుల్లో నీ చదువుకి మరో ఉద్యోగమూ రాదు. రోడ్డున పడతావ్. నా మాట విను. ఎప్పుడో ఏడాదికోసారి ఉరి ఉంటుందని ఉద్యోగం వదు



లుకుంటావా? బంగారం లాంటి ఉద్యోగం" అంటూ నన్ను మభ్యపెట్టేశారు. చక్రబంధంలో ఇరికించేశారు. ఊబిలోకి తోసేశారు. చిన్నవాడిని చేసి పాకుడు రాళ్లమీద పడదోసేశారు. నేను అవసరానికి తలారి పనిచేసే ఆర్డర్లీని. రికార్డులలో నా మెట్రిక్ కూడా నమోదుకాలేదు. ఆ ఆఫీసరు నన్నలా మోసం చేశాడు. ఉద్యోగం ఉండాలంటే ఉరి తీయవలసిందే. కాలుపెట్టిన వేళావిశేషం లాగే తొలి ఉరితీసిన ముహూర్త బలం కాబోలు ద్వితీయ విఘ్నం కలగకుండా మూడు నెలలకే నేను మళ్లీ తలారి అవతారం ఎత్తవలసి వచ్చింది. ముందు రాత్రి జెయిలుకెళ్లాను, తెల్లవారబోతూండగా నేను ఎవరి ప్రాణాలు తీయబోతున్నానో చూద్దామని. అదొక వింత కుతూహలం అంతే. దానికి కారణంలేదు. ఆ సెల్‌లో అతనొక్కడే. ఉరిశిక్షపడ్డ ఖైదీనలాగే సింగిల్ సెల్‌లోనే ఉంచుతారు. అతనికి తెలిసిపోయింది కాబోలు ఉరితీయబడతానని. సెల్ అంతా శివమెత్తినట్లు కలదిరిగేస్తున్నాడు. ఉండుండి పిచ్చివాడిలా కాళ్లూ చేతులూ గాలిలోకి విసురుతున్నాడు శత్రువుతో యుద్ధం చేస్తున్నట్లు. అరుపులు, కేకలు, ఏడ్పులు, పెడబొబ్బలు... ముఖం రెండు చేతులతోనూ కప్పుకుని బస్సుకింద కాలు నలిగిన బక్కకుక్కలా కుయ్యోమంటూ రోదించడం, ఆక్రందనలు... నాకర్థమయింది. నిజంగా ఉరితీయబడే వాళ్లు సినిమాల్లోలాగ గంభీరంగానూ మౌనంగానూ ఉండరు. ఉండలేరు. అతనంతకు ముందు ఎన్ని ఘోరాలూ నేరాలూ ఘాతుకాలూ అయినా చేసి ఉండవచ్చు కఠినాత్ముడే కావచ్చు కసాయి గుండెవాడేకావొచ్చు కాని ఉరితీయబడతానని తెలిశాక అతనికి మనస్థైర్యం కొంచెమయినా మిగలదు. బేలగా దీనంగా పిచ్చివాడిలా అయిపోతాడు.

ఈసారి నా తలారి విధులు కొంచెం పెరిగాయి. ఖైదీని ఉరితీసే తాడు ప్రమాణాల్ని అనుసరించి ఉందా? అనేది నన్నూ చూడమన్నారు. అలాగే సెల్‌నుంచి ఉరికంబానికి ఖైదీని తీసుకువచ్చే పోలీసులకు నన్నూ సాయంగా ఉంచారు. ఉరికంబం... పుల్లీ... పలక అన్నీ సరిగా ఉన్నాయో లేదో నన్నూ పరీక్షించమన్నారు.

ఉరికి కాగితాలమీదయితే చాలా నియమాలున్నాయి. ఉరితీయబడే సమయానికి అతను సంపూర్ణారోగ్యంతో ఉండాలనేది ఒకటి. కాని నిజానికి ఉరితీయబడే వాడికి మానసిక స్థైర్యం ఉండదు. రక్తపోటు హద్దుమీరుతుంది సహజంగా మృత్యుభీతి వల్ల. అలాగే బెదురువల్ల శరీరోష్ణోగ్రత కూడా పెరుగుతుంది. ఇవన్నీ పట్టించుకుంటే ఉరితీయడం కాదని కొందరు పురోహితులు అబ్రాహ్మణుల పెళ్లిని తూతూ మంత్రాలతో జరిపించేసినట్లు గవర్నమెంటు డాక్టరు ఖైదీ పరిస్థితంతా సవ్యంగా ఉన్నట్లు సర్టిఫై చేసేస్తాడు. అంతా హడావిడీ అడ్డదారులే. సూర్యోదయానికి ముందే ఉరితీత అయిపోవాలి. ఆఫీసర్లందరికీ నిద్ర కళ్లూ, తలారికి తాగుడుకళ్లూ. అలా జరుగుతుంది ఉరి"

"చివరి కోరిక లాటిది సినిమాల్లో..." అందించింది శివానీ ఎక్కువసేపు శ్రోతగా మిగలడం విసుగెత్తి.

దానికతను తేలిగ్గా నవ్వి "సినిమాలకీ వాస్తవానికీ పోలికేమిటి? ఖైదీ చివరి కోరిక తీరుస్తారు. కాని అది తిండివరకే. తాగడానికి సారా కూడా ఇస్తారు అతను కోరితేనూ వీళ్లకి వీలైతేనూ. చాలామంది ఖైదీలు తమ చివరి కోరికగా చికెన్ పలావూ, సారా అడుగుతారు. నల్లగుడ్డ ముసుగు పడేసరికే ఆ ఖైదీ చివరి ఆశకూడా చచ్చిపోయి మరణ భయం తారస్థాయికి చేరి అతను అన్ని భావాలకీ అతీతుడైపోతాడు. అప్పటికే అతనొక విధంగా చనిపోయినట్లే. సెల్‌నుంచి ఉరికంబానికి బొమ్మలా ప్రతిఘటించకుండా వచ్చేస్తారు చాలామంది.




నేను ఖైదీ ఉరిని సాధ్యమైనంత సులభం చేయడానికే ప్రయత్నిస్తాను. ఖైదీ బరువుకి సమానంగా ఇసుకబస్తాను తాడుకి కట్టి ఆగుతుందోలేదో చూస్తాను. అలాగే కంఠానికి ముడి సరిగా బిగుసుకుని ప్రాణం తొందరగానూ తక్కువ కష్టంతోనూ పోయేలా కూడా చూస్తాను.

అంతకంటే నేను చేయగలిగేదేముంది? ఉరితీసేముందు నా గురించేగాక ఆ అభాగ్యుడి కోసం కూడా దైవప్రార్థన చేస్తాను"

ఏమిటన్నట్లు చూసిందామె. అతనామె సందేహాన్ని గ్రహించినట్లు తలారి తన కోసం దేముణ్ణి ప్రార్థిస్తాడు **ఓ** దేముడా నేనితన్ని చంపవలసి రావడం విధి నిర్వహణ వలనే తప్ప నాకితనిపై పగకాని, శత్రుత్వం కాని లేవు. అలాగే నేనితనిని చంపేది నా లాభంకోసంకాదు. విధి నిర్వహణగానే. కనుక ఈ ఉరివలన నాకేవిధమయిన పాపమూ అంటకుండా దయతో చూడు అని"

అర్థమయిందన్నట్టు చూసి "మీరు కథ చెబుతూ అలసిపోతున్నట్లున్నారు. మరో రౌండు టీ తాగుతారా? నేను కంపెనీ ఇస్తాలెండి" అని లేచివెళ్లి టీ తెచ్చింది.

"వృత్తి ముఖంలో కనిపిస్తుందనేది చాలా సందర్భాలలో నిజమే. నాలుగైదు ఉరులు తీసేసరికి నా ముఖంలోకి క్రూరత్వం రాసాగింది. నేను నలుగురిలోనూ తలారిగానే గుర్తించబడడం మొదలయింది. పిల్లల్ని అదిగో బూచి అంటూ ముష్టివాణ్ణి చూపించి బెదిరించరూ? అలాగే నన్ను అడుగో తలారి అని ఉదహరించేవారు. నన్నెరుగని వారు కూడా నా ముఖంలో ఏం కనిపించేవో ఏమో నాకు దూరంగా తొలగిపోవడం మొదలుపెట్టారు. మొదట్లో నేనర్థం చేసుకోలేకపోయేవాడినికానీ రాను రానూ నా మట్టిబుర్రకి కూడా తెలిసేలాగే ఉండేది వారి ప్రవర్తన. నన్ను వెలివేస్తున్నారు. వెలి! అది తెలిసివచ్చేసరికి నాకు మతిపోయింది. ఏడుపొచ్చింది.

అసలే నాది మనుషులకోసమూ స్నేహం కోసమూ అనుబంధాలకోసమూ కొట్టుకుపోయే నైజం. చిన్నప్పుడే తల్లితండ్రులని కోల్పోడం ఒక కారణమైతే అనాధ శరణాలయంలో అరకొర స్నేహాలు మాత్రమే లభించడం మరొక కారణమనుకుంటాను నేను మనుషులకోసం వాచిపోడానికి. ఆఫీసరుగారింట్లో పనిచేస్తున్నా నాతో ఆ కుటుంబసభ్యులు ఒక బంట్రోతుతో ప్రవర్తించేటట్లే తప్ప స్నేహంగా ప్రేమగా ఉండేవారుకారు. వాళ్లింట్లో చిన్న పిల్లలులేకపోవడం నా దురదృష్టమనుకుంటాను. నేను తలారినయ్యాక అలా తయారు చేయబడ్డాక ముందుగా వెలివేయబడినది ఆ కుటుంబంచేతా అక్కడి నాతోటి పనివారిచేత నేనేమో.

"హాంగ్‌మన్‌కి మనం వాడి ముఖం చూసే అవసరం కలగకుండా అలాటి పనులకి నియమించడం మంచిదేమో. అలాటివాడి ముఖం పొద్దున్న లేవగానే మాత్రమే కాదు, ఎప్పుడు చూసినా అరిష్టమే. తలారి అంటే తల (రాత)కి శత్రువని. అదే వాడుకలో తలారి అయింది అంటూ మాడమ్ సార్‌కి బోధించడం నా చెవినేపడింది. ఆ యింటి కుక్, చాకలి, పనిమనిషి అందరూ నన్ను విడిగా ఉంచసాగారు. నేనది భరించలేక ఊళ్లోకి పోయి మనుషులమధ్య ఉందామనుకున్నాను.

ఆఫీసరుగారదే మంచిదంటూ అనుమతీ ప్రసాదించారు. కానీ దేముడు వరమిచ్చినా పూజారి వరమివ్వలేదు. ఊళ్లో ఎవరూ నాకిల్లివ్వలేదద్దెకి. పైకి వాళ్లే కారణాలు చెప్పినా అసలు కారణం నాకు తెలిసిపోతూనే ఉండేది. నేను తలారిని కావడమే నాకు వారిల్లు అద్దెకు లభించకపోవడానికి ముఖ్యకారణం. నా సహోద్యోగులు...



సెంట్రీలూ... కూడా నన్ను గొంగళి పురుగునో బొద్దెంకనో చూసినట్లు చూసే వారు. అవసరానికి మించి ఒక్క అదనపు మాట కూడా ఆడేవారుకాదు. నేను పూసుకునీ రాసుకునీ వారితో తిరగబోయినా పడనిచ్చేవారుకాదు. ఫలితం ఒంటరితనం! స్నేహరాహిత్యం! మనసు విప్పి మాట్లాడుకుందుకు మనిషిలేకపోవడం కంటె మరో శిక్ష అక్కర్లేదు మన సున్న మానవుడికి. అందులోనూ ఉద్యోగధర్మం నెరవేర్చి పశ్చాత్తాప పడవలసిన పాడు పని నాది. నా చేతులతో నేను తీసిన ఏ ఉరీ నాకు తక్కువ వ్యథ కలిగించలేదు. నాలాంటి వాడికి సాటి మనిషితో చెప్పుకుని గుండె బరువు తగ్గించుకోవలసిన అవసరాలు ఎంతగా ఉంటాయని! పంచుకుందుకు లేక పోవడంతో నా గుండెలో వ్యథ అలా పేరుకు పోతూనే వస్తోంది కొండలా కొంతకాలం ఇలాంటి ఒంటరి జీవితాన్ని తరించేందుకు సారాతో స్నేహం చేశాను. కానీ అదీ నాకు మంచి స్నేహితుడు కాలేక పోయింది. నా సంస్కారం సారాతో స్నేహాని కంగీకరించలేకపోయింది.

"మీరు నమ్మండి మానండి. నేను మనిషిని. మానవత్వం కలవాడిని. నాకు మనుషులంటే ప్రేమ. దోషి... ఎంత తక్కువ బాధతో చనిపోగలడో అంత తక్కువ యాతనతో ఉరితీయబడాలని నేను ప్రయత్నిస్తాను. నేనంతకంటె చేయగలిగిన ఉపకారమింకేం ఉండగలదు? ఇది చాలా చిన్న విషయమనుకోవద్దు.

"ఉరితీసే వాళ్ళల్లోనూ అక్కడక్కడ కొందరు దుర్మార్గులున్నారుట. వాళ్ళు ఉరితాడుని ఎలా మ్యానేజ్ చేస్తారంటే దోషికి ఉరిసరిగా బిగుసుకోదు. కంఠాన్ని బిగుసుకునీ బిగుసుకోకుండా... అలాగ. అందుచేత అతని యాతన అధికమౌతుంది. అదనపు సమయం గిలగిలకొట్టుకుంటాడు. విలవిలలాడిపోతాడు. ఉరితీసేవాడు అతని మరణ యాతనలనుంచి పైశాచిక వికృతానందం పొందుతాడు! మనిషిలో రాక్షసత్వం అంటే యిదే.

రేపు ఎవరిని ఉరితీయాలో అతని గురించి నేను ముందురోజు రాత్రి తెలుసుకుంటాను. అతను ఉరిశిక్ష పడవలసినంత నేరాలేమేం చేశాడో జాగ్రత్తగా వింటాను అధికారినుంచి అడిగి మరీ తెలుసుకుని. ఎందుకంటే ఒక దోషికి ఉరి విధించబడిందంటే అతను చేసిన నేరాలు చాలా తీవ్రమైనవే అయి ఉంటాయి. హత్య కన్నా తక్కువ నేరాలకి ఉరి శిక్ష పడదు. అధిక సంఖ్యలో హత్యలు చేసిన వారికే యీ శిక్ష పడుతుంది. దోషి నేరచరిత్రవింటూంటే ఎవరికయినా రక్తం సలసలమరిగిపోక తప్పదు.

రైల్లో ప్రయాణం చేసే అమాయకులయిన పిల్లలతో సహా ప్రజలెందరినో రైలు పట్టాలు తప్పించో, బాంబులు పెట్టో, పెట్రోలు పోసో అంటించడం వంటివి వివరంగా వింటూంటే రక్తం మరిగిపోదూ? అలాగ అతను చేసిన ఘోరాలు విని అతని మీద కోపం కలిగించుకుంటాను, అప్పుడైతే ఉరితీయడం కొంత తేలికౌతుందని. లేకపోతే నాకతన్ని ఉట్టిపుణ్యానికి చంపుతున్నట్లనిపిస్తుంది మరి. జడ్జిగారు శిక్ష వేసేటప్పుడే 'చనిపోయేవరకూ ఉరితీయబడాలి' అని పేర్కొంటారు. అందుచేత శిక్ష పడిన వాడు ఎలాగూ చావక తప్పదు. ఆ చావుని త్వరగా ముగించేందుకే నా ప్రయత్నం.

ఉరిశిక్ష పడిన దోషులు సాధారణంగా రాష్ట్రపతికి క్షమాభిక్షకోసం మనవి పంపుకుంటారు. కాని సామాన్యంగా ఉరిశిక్ష మారదు. ఆమ్నెస్టీ ప్రసాదించబడదు. మిగిలినవాళ్ళు అలాటి నేరాలకు పాల్పడకుండానే ఆ ఉరి! అది తగిన బెదిరింపే.

కాని... మనిషి ప్రాణం తీయడం... ఏ





పేరిట అయినా న్యాయంకాదేమోననే ద్వైదీ భావంలో కొట్టుకుంటూ ఉంటుంది నా మనసు. ఎటూ తేల్చుకోలేదు. ఉరిశిక్ష న్యాయమా, అన్యాయమా అనేది నా మట్టుకు నాకు తెగని ప్రశ్నే...

"మీకే కాదు ప్రపంచానికే తెగని ప్రశ్న. మానవత్వ దృష్ట్యా చూస్తే మనిషిని చంపడం సమంజసం కాదనిపిస్తుంది. కాని... నేరాల సంఖ్య పెరిగిపోకుండా ఉండాలంటే మరిన్ని ఘోరాలు జరగకూడదనీ... శిక్షాస్మృతి నేరస్తుల సంఖ్యను నిరుత్సాహపరిచేదిగా ఉండాలనీ అనుకుంటే... ఉరిశిక్ష ఉండి తీరవలసిందే..." అందామె.

"ఏం ఉరో! తెల్లవారాక అతని ఉరి. కాని...రాత్రంతా నాకు ఉరే. నా శిక్ష అతనికంటే ముందు ప్రారంభమౌతుంది. అతని శిక్ష ముగిసినా నాక్షోభమాత్రం ముగియదు. ఉరితీసిన రెండుమూడు రోజులవరకూ మనుషులలో పడలేను. అందుకే సారాయో... నిద్రమాత్రలో తీసుకుంటాను నిద్రపోయి నిద్రలో అన్నీ మరిచిపోయేందుకు. కానీ నిద్రపోయినా పీడకలలే. ఓసారయితే నన్ను నేనే ఉరితీసుకుంటున్నట్లు వచ్చింది కల!"

జాలిగా నిట్టూర్చింది శివానీ... "వృత్తికి సంబంధించిన బాధల్ని గుర్తించడంలో సమాజమూ ప్రభుత్వమూ కాటికాపరి వృత్తినీ ఉరితీసే పనినీ విస్మరించినట్లున్నాయి..."

"ముఖ్యంగా సమాజం. చాలామంది భయపడే... అసహ్యించుకునే... పనిని నేను చేస్తున్నాను. బలవంతంగా ఐతేనేం... మరోలా ఐతేనేం... అందుకు నామీద జాలి పడాలి. స్నేహహస్తం అందించి సానుభూతి చూపాలి. వృత్తి నిర్వహణద్వారా నేననుభవించే వ్యధకు తమ ఓదార్పుతో స్వాంతన కలిగించాలి. అది సమాజపు కనీసకర్తవ్యం. కాని నలుగురూ చేస్తున్నదేమిటి? నన్ను వెలివేయడం. నాముఖం చూడడానికే అసహ్యించుకోవడం.. నన్ను తమకు దగ్గరగా రానివ్వకపోవడం... ఈ ప్రవర్తనే నన్ను అధికంగా బాధించేది. ఔనూ, మీకూ ఉన్నాయా నాలాటి చిత్రమైన హింసలు?"

అతనలా అడగడం ఆమెకెంతో ఆశనీ ఆనందాన్నీ కూడా కలిగించింది. "మనమిద్దరమూ దాదాపు ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నవాళ్లం కనక మీరే నా బాధ నర్థం చేసుకోగలరు. మనిషంటే ఆశలు... కోరికలు... అఛీవ్‌మెంట్స్... అలా ఎన్నో... అలాటి మనిషిని కాల్చివెయ్యడమంటే ఎన్నిటికో మంగళం పాడడం. చిన్నవయసువారి శవం సంస్కరించవలసివస్తే నాకు దుఃఖమే వస్తుంది. పైకి ఏడవలేక మనసులో కుమిలిపోతాను. కానీ...నేననుభవించే దుఃఖానికి ఎవరూ స్వాంతన కలిగించరు. మీలాగే నేనూ వెలివేయబడినదానినే. నాముఖం చూసేసరికే చితీ, మంటలూ కనిపిస్తాయేమో! నేను ఒక శవంలా కనిపిస్తానేమో. నన్ను ముట్టుకోకే నామాలకాకీ అంటారందరూ.

వాళ్ల ప్రవర్తన నాకెంతో దుర్భరంగా ఉండేది. ఇంతమంది మనుషులున్న ప్రపంచంలో నేను ఒంటరిని!" అందామె. మళ్లీ అతడు కొనసాగించాడు. "అదే నా బాధానూ. భరించలేని ఒంటరితనం.

రానురానూ నా ఏకాకితనం నన్ను దహించివెయ్యసాగింది. నా దుర్భరదుస్సహ ఒంటరితనపు శాపానికి విమోచనా మార్గం...• నా ఒంటరి తనానికి తిరుగులేని మందు మనువే. భార్యకంటె మంచి స్నేహితురాలెవరుంటారు మగాడికి? జీవితాన్నీ, కష్టాన్నీ, సుఖాన్నీ పంచుకోగలిగింది పత్నికంటె ఇతరులెవరు?

పెళ్లి చేసుకుందామనుకున్నాను.

నావేపు పెద్దలూ అయినవారూ ఎవరూ



లేరు కనుక- సిగ్గుని పక్కనపెట్టి నేనే ప్రయత్నాలలోకి దూకాను.

నాకు మరిన్ని చేదునిజాలు ఎదురయ్యాయి.

ఈ ఉరితీసేవాడికి తన పిల్ల నిచ్చి ఏ ఆడపిల్లతండ్రీ తనపిల్ల గొంతుకోయడానికి సిద్ధంగాలేడు.

ఈ ఉరితీసే వాడిని చేసుకుని తన జీవితం దినదినగండం చేసుకుందుకు ఏ అమ్మాయీ అంగీకారంగాలేదు. నాముఖం చూడడానికే బెదిరిపోతూంటే వరకట్నం తీసుకోకపోడమేకాక ఎదురుకట్నమిచ్చి పెళ్లి ఖర్చులు పెట్టుకుంటానన్నా నాకెవరూ పిల్ల నివ్వలేదు!" సిగ్గుపడుతూ చెప్పి మళ్లీ కొనసాగించాడు.

"ఉరితీయడానికీ, హత్య చేయడానికీ మధ్య గల తేడాని తెలుసుకోలేక... యిరవయ్యో శతాబ్దపు చివరిదశకంలో కూడా వెలిని వెలివేయకండా బతికిస్తున్న యీ అమాయకపు ప్రజలమీద నాకు జాలీ వేసేది, పట్టలేనంత కోపమూ వచ్చేది. ఐనా నిగ్రహించుకుంటూ... ఎప్పటికేనా నా జీవితం మలుపుతిరగదా... జీవితంలోకి భాగస్వామి ప్రవేశించదా... జీవనయానం సుకరం చేయదా అని ఆశగా ఎదురు చూసేవాడిని. ఈ ఒంటరి ఎడారిబతుక్కి పుస్తకాలూ సినిమాలే ఒయాసిస్సులు మరి. బాధాకరమైన విషయం. అవి నా ఒంటరితనాన్ని మరింత కెలికి... నాలోటుని ఎత్తి చూపడం. దాంతో చాలా కోపమొచ్చేసి వాటిముఖం చూడడంమానేశాను. పిచ్చి ఉద్రేకంతో ఒట్టుపెట్టుకున్నాను. ఐతే దాని వల్ల పరిస్థితి మరింత చెడింది. కాలక్షేపమనేది మరీ కష్టమైపోయింది...".

"పుస్తకాలు మంచి స్నేహితులంటారు... వాటి మీదెం దుకు కోపమొచ్చిందీ మీకు?"

"కాల్పనిక సాహిత్యానికి ప్రధాన వస్తువులు ప్రేమ, పెళ్లి, అనుబంధాలూ, సంసారమూ నాకు కరువైన సాహచర్యం ఆ

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్ని ని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్ర తప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రు: ***3000/–*** పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

పాత్రలకు పుష్కలంగా లభిస్తుంటే అసూయవేసి..."

"అదిసరే... ఆత్మహత్యకు అతి ముఖ్యమైన కారణం""

"ఇంకేమిటి? భరించలేని ఒంటరితనమే. నా వయసు ముప్ఫయ్‌రెండు. ఇంక నేను శారీరకంగా కాని మానసికంగా కాని ఒంటరితనాన్ని సహించలేను..."

"నిజమే. ఒంటరితనం అంత దుర్భరమే. మీరు ఆత్మహత్య చేసుకుందుకు రావడంవల్ల నాకెంతో మేలు చేశారు. మీరు రావడం కొంచెం ఆలస్యమైతే... మీరు ఉరిపోసుకుందామనుకున్న చెట్టుకొమ్మనే నాశవం వేలాడుతూ ఉండేది..."

"ఏమిటి మీరనేది?" అతను అయోమయంగా చూశాడు.

"మన సమావేశం నిజంగా అతి విచిత్రం. ఎంతోమందిని ఉరితీసిన మీరు ఉరివేసుకుందుకు శ్మశానానికి రావడం..."

"నేను తలారినని తెలిశాక కూడా మీకు నేనంటే భయమో, అసహ్యమో కలగడం లేదా?"

"ఎందుకూ? మీవృత్తి లేదా ఉద్యోగం మాత్రమే అది. అంతే తప్ప ప్రవృత్తి కాదు. మీరు మనిషి. చదువు, సంస్కారం, హృదయమూ కల ఉన్నతులైన మనిషి"

అతను నమ్మలేనట్లు చూస్తున్నాడామెను. ఆమె మాటలతనికెంతో హాయిగా అనిపిస్తున్నాయి.

"నా ముఖంలో మీకేమయినా కనిపించడంలేదూ?"

"ఏం కనిపిస్తాయనుకుంటున్నారూ?"

"మండుతున్న చితులు. కాలుతున్న శవాలు... పాతిపెట్టబడుతున్న కళేబరాలు..."

"ఛ...ఛ అలాటివేమీ లేదు"

"నేను కాటికాపరిని. నాపేరు శివాని..."

ఒక్కసారాగి అందామె.

"ఒకవిధంగా మనం ఒకేజాతి పక్షులం కనుకనే యిలాగ ఒకే గూడు చేర్చాడేమో భగవంతుడు"

"అంటే? మీ ఉద్దేశమేమిటి? స్పష్టంగా చెప్పండి శివానీ! అన్నట్టు నాపేరు శివ..."

"శివా! నేనూ మీలాగే ఒంటరిగా మిగిలినదానినే. కాటికాపరిని కావడంవల్ల సమాజంచేత అన్యాయంగా వెలివేయబడి నానా యిడుములూ పడుతున్నదానినే. నాకంటే మీపరిస్థితే కొంత మెరుగు. ఎందుకంటే మీరు మగవాళ్ళు. మరి నేను? ఆడదాన్ని... ఈ శ్మశానంలో ఒంటరిగా ఉంటున్నదానిని. ఔను... నాకూ ఊళ్ళో ఎవరూ ఇల్లివ్వలేదు. మన మనుషులకి తలారి దర్శనమేకాదు కాటికాపరి దర్శనం కూడా అరిష్టమే, పిల్లిశకునంలాగా! నేనూ ఒంటరితనంతో విసిగి వేసారిపోతున్న దానినే. ఆ శాపం యిద్దరమూ అనుభవిస్తూనే ఉన్నాం కనుక ఒకరికొకరం వివరించుకోనక్కర్లేదు. ఇప్పటికి మీరెన్ని ఉరులు తీశారో నాకు తెలియదు కానీ..."

చటుక్కున అతను కలగచేసుకుని... "ముప్ఫయ్యొకటి..." అన్నాడు.

"శివా! మనుషులు అర్థంచేసుకోకపోవచ్చు కానీ మీరు ఉరి తీయడానికీ, నేను దహనం చేయడానికీ వెనుక కారణం ఒకటే. ఉద్యోగ ధర్మం. అందుచేత మనపనులు పాపమూ కావు, అమంగళాలూ కావు. మనం వెలివేయబడనక్కర్లేదు. పాపాత్ములనుంచి మీరు భూమికి భారం తగ్గిస్తూంటే శవాలనుంచి నేను విముక్తి కలిగిస్తున్నాను. మనపనులు గర్వపడవలసినవే కాని గర్హించబడవలసినవెంతమాత్రమూ కాదు. అర్థంచేసుకోలేకపోతే వాళ్ళకర్మ"

"ఐతే... మీరూ... నేనూ... ఒంటరిత

నంతో పీడించబడుతూ... అనవసరంగా వెలివేయబడి..."

"ఔను... నేనూ మీలాగే స్నేహ రాహిత్యంతోనూ, ప్రేమరాహిత్యంతోనూ అలమటించిపోతున్న దానినే నా అనే వారెవరూ లేని అనాథనై, నేనూ సాహచర్యంకోసం అనుక్షణమూ పరితపించి పోతున్నదానినే..."

"నాలాగే మీరూ యీ ఏకాంతపు ఏకాకి చెరనుంచి విముక్తి కోరుకుంటున్నారా? "

"అంతకంటె నాకేమీ వరమక్కర్లేదు..."

సరిగ్గా అదేక్షణంలో... "అమ్మా! కాటికాప రమ్మా!" అని వినిపించింది.

"శవాల కప్పుడే తెల్లవారిపోయింది!" అంటూ ఆమె తడక తెరిచింది. అవతల వెలుగేకాదు ఎండ కూడా!

"అరె! మాటలలో పడి మనం తెల్లవారడమే గమనించలేదు" అని "ఎవరు? " అంది వాళ్ళిద్దరినీ చూస్తూ.

"మేమమ్మా... గంగన్న, సింగన్నలం. జలకడుగులోళ్లం తల్లీ! ఇన్నాళ్ళూ నువ్వు చల్లగా చూసి పైసా తీసుకోకుండా శవాల బుగ్గి దరమం చేస్తూ వచ్చావు. నీమనసు మంచిదై మాకు బాగా కలిసొచ్చింది. అందు కని... నీరుణం... ఉంచుకోకూడదని..." అంటూ పిడికిలి విప్పి చిన్న బంగారం ముద్ద ఆమె చేతిలో ఉంచాడు.

"అంతా బంగారం కాదు కాస్త రాగీ కలిసి ఉంది. నీ పెళ్లికి నీక్కావలసినట్టు తాళి బొట్టు చేయించుకో అమ్మా. నీకు సుబమౌతుంది. కాదనకు" అనేసి ఆమె పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్లిపోయారు వారిద్దరూ.

ఎంతో పేదవారయినా ఆ జలగడుగుల వాళ్లలో ఎంత కృతజ్ఞత! ఎంత అభిమానం! సరిగ్గా యీ సమయంలో బంగారం బహుమానంగా...!

అంతలోనే "మాడమ్! శివానీగారూ!" అంటూ వచ్చాడు విప్లవ్. "నమస్తే శివాని గారూ! వెరీగుడ్ మార్నింగ్... శుభ వార్త. నిన్న పత్రికాఫీసుకు వెళ్లి యిప్పుడే రైలు దిగి తిన్నగా మీ దగ్గరకి వచ్చేస్తున్నాను శుభవార్త చెప్పేసి ఆనందం పంచుకోవాలని. మీ అనుభవాలను రంగరించి రాసిన నవలను పత్రికాసంపాదకుడు పరిశీలించడమేకాదు, పరమానందంగా ప్రచురణకీ తీసుకున్నాడు. కాకపోతే ముగింపు కూడా రాయమన్నాడు. మరి... మీ కథకి... ముగింపు..."

ఆమె నవ్వింది. "వీరు చెబుతారు. లోపలికి రండి. వీరు శివ. మీరు మాట్లాడుతూ ఉండండి, టీ తెస్తాను అందరికీ... వీరు విప్లవ్ అని... రచయిత... నాకథ రాశారు..." అని పరిచయాలు చేసి వంటింటి వేపు వెళ్లబోతుంటే...

"బంగారంలా ఉంది. ఇదేమిటీ? " అడిగాడు విప్లవ్.

"మానవత్వానికీ మంచితనానికీ కృతజ్ఞతకీ అభిమానానికీ ప్రతీకలయిన ఆ బంగారం కథకూడా జోడించవలసి ఉంటుంది నాకథకి..." అని లోపలికి వెళ్లి కాసేపట్లో టీలతో వచ్చింది.

టీలు తాగాక

"మంచి జంట. నవలకు చక్కని ముగింపు. మీ యిద్దరికీ నా శుభాకాంక్షలు, త్వరగా దంపతులై జీవితాంతం సుఖంగా వర్ధిల్లండి" అన్నాడు విప్లవ్.

వారిద్దరూ అతనికి నమస్కరించారు.

మరుభూమిలో- వికసించిన పూవు. వినిపిస్తున్న సంగీతం.

ఆ కాటికాపరి కుటీరంలో కొత్తకళ.







# చతుర ప్రపంచం

## నిద్రలో రకాలు

మనుష్యులంతా సమానమే అంటాంగానీ వాళ్ల నిద్ర అలవాట్లు మాత్రం సమానం కాదు. అలాగే జంతువులంతా సమానమో కాదోగానీ వాటి నిద్ర అలవాట్లు మాత్రం సమానం కాదు. ఒక్కో జంతువుకీ ఒక్కో రకం నిద్ర అలవాటుగా వుంటుంది.

వాటికి.

సీఓట్టర్స్ తమ జంటతో కలిసి నిద్రపోయేటప్పుడు నిద్రలో అవి వేరుపడకుండా సముద్రంలోని చెత్తని తమ ఒంటికి చుట్టుకుంటాయి. అలా నిద్రలోనే ఆ చెత్తతో పాటు కొన్ని మైళ్లు తేలుతూ పోతాయి. ఆల్‌బట్రీజ్ అనే ఆస్ట్రేలియన్ పక్షి ఎగురుతూనే నిద్రపోతుంది. గాలితరంగాలమీద తేలుతూ గంటకి 25 మైళ్ల వేగంతో రెక్కలు చాపి ప్రయాణిస్తూ నిద్రపోతుంది.




గుర్రాలు, జిరాఫీలు నిల్చునే నిద్రపోతాయి. కొన్ని జిరాఫీలు నిద్రలో పడిపోకుండా వుండటానికి వీలుగా ఏ చెట్టుకో ఆనుకుని నిద్రపోతాయి. పొరపాటున అవి పడుకుని నిద్రపోతే మెలుకువ వచ్చాక శరీరాన్ని బాగా అటూ ఇటూ దొర్లిస్తేగానీ లేవలేవు.

గొరిల్లాలు చెట్లమీద నిద్రపోతాయి. అయితే... రెండు రాత్రులు ఒకే ప్రదేశంలో నిద్రపోవు. నిద్రాస్థలాన్ని రోజూ మారుస్తూనే వుంటాయి. ఏరోజుకారోజు కొత్త చోటు దొరికితే తప్ప నిద్రపట్టదు పాపం

న్యూజిలాండ్‌కి చెందిన ఓ తొండ తన జీవితకాలంలో 90 శాతం నిద్రపోతూనే వుంటుంది. దాని నిద్రపిచ్చి ఎంతంటే, భోజనం చేస్తూనే మధ్యలో నిద్రపోతుంది. చెట్లమీద నిద్రపోయే పక్షులు నిద్రలో వుండగా కిందపడడం మనం ఎరగం. అందుకు కారణం కూర్చున్న చెట్టుకొమ్మలని కాలిగోళ్లతో పట్టుకుని నిద్రపోతాయవి.

సీతాకోక చిలుకలు రాత్రిళ్లు నిద్రపోయి

పగలు ఏక్టివ్‌గా వుంటే, వాటి ముందు దశకు చెందిన గొంగళిపురుగులు పగలు నిద్రపోయి రాత్రిళ్లు హుషారుగా సంచరిస్తూ వుంటాయి. సముద్రాల్లో నివసించే ప్యారెట్ ఫిష్ నిద్రపోయేముందు తన శరీరంనుంచి వెలువడే జిగురులాంటి ద్రవంతో గూడుకట్టుకుని నిద్రపోయి, నిద్రలేచాక ఆ గూడుని ఛేదించుకుని బయటకి వస్తుంది. ఇందువల్ల ఇది నిద్రలో వుండగా శత్రువుల బారినపడదు.

మొసళ్లు భోజనానంతరం ఒడ్డుకు వచ్చి దవడలు తెరిచి నిద్రపోతాయి. పిట్టలు వాటి పళ్లమధ్య చిక్కుకున్న ఆహారాన్ని శుభ్రంగా భోంచేసినా వాటికి మెలుకువ రాదు. ఈవిధంగా అవి టూత్ పేస్ట్ లేకుండా పళ్లని శుభ్రపరచుకుంటాయి. మంచుతోడేళ్లు జీరోకి 40 డిగ్రీలు కిందవున్న వాతావరణంలో తమ మొహాలని ముందు కాళ్లమధ్య ఉంచుకుని వీపుకి గాలి తగిలేలా తలకిందులుగా పడుకుంటాయి.

అడవి పావురాలు గుండ్రంగా ఏర్పడి నిద్రపోతాయి. చిన్నపాటి ప్రమాదం సంభవించేలా వుందని తెలిసినా అవన్నీ ఒక్కసారిగా గాల్లోకి నాలుగడుగుల ఎత్తుకి రెక్కలు టపటప కొడుతూ లేస్తాయి. గబ్బిలాలు చలికాలం మొత్తం నిద్రలో గడుపుతాయి. కొన్నిటిమీద మంచు కూడా కురవవచ్చు. మళ్ళీ వాతావరణం వేడిగా అయ్యాకే మేలుకుంటాయి. ఆఫ్రికాలోని లంగ్‌ఫిష్ చెరువు ఎండిపోయినప్పుడు వుండలా చుట్టుకుని బురదలో కూరుకుని నిద్రపోతాయి. వేడికి క్రమంగా వాటి చుట్టూ వున్న బురద ఎండిపోతుంది. మళ్ళీ ఎండాకాలం పోయి వర్షాకాలం వచ్చాక ఒంటిమీద మట్టి బురదగా మారాక ఆ చేప బతికి బయటకు వస్తుంది. ఇది గమనించిన యూరోపియన్స్ ఈ చేపల మట్టిముద్దలని యూరప్‌కి తీసుకెళ్లి అక్కడ నీళ్లల్లో పడేస్తే మట్టికరిగి బతికున్న చేపలు బయటకు రాగానే వాటిని ఒండుకుని తినేవారు.

## సిన్-సిటీ

అమెరికాలో నెవెడా రాష్ట్రంలోని లాస్‌వేగాస్ ఓ ప్రత్యేకమైన పట్టణం. అమెరికాలో ఇంకే ప్రదేశాలూ దర్శించకుండా కేవలం లాస్‌వేగాస్‌లో మాత్రమే కొద్ది రోజులు గడిపి వెళ్ళే విదేశస్థులు ఎక్కువ. కారణం అది సిన్-సిటీ. లాస్‌వేగాస్‌లో కేసినోలు, గేంబ్లింగ్, వ్యభిచారం చట్టవ్యతిరేకం కాదు. ఎవరయినా ఏ సమయంలోనైనా, ఎంత డబ్బయినా జూద గృహంలో ఖర్చుచేయవచ్చు. అక్కడ 12,000 పైగా జూదగృహాలున్నాయి. 'గోల్డెన్ నగ్గెట్; సీజర్స్ పేలస్' లాంటి కోటానుకోట్ల డాలర్లతో నడిచే పెద్ద వాటినుంచి పదిమంది మాత్రమే జూదమాడే చిన్న జూదగృహాలున్నాయి.

గంటకోసారి యూనిఫారంలోని పోలీసులు పెద్ద జూదగృహాలకి వేన్లలో వెళ్లి, జూదమాడేవాళ్ళ నగదు రూపంలోని లాభాన్ని తీసుకెళ్ళి వాళ్ళ లోకల్ బ్యాంక్ అకౌంట్స్‌లో జమచేస్తుంటారు.

చాలా గాంబ్లింగ్ హౌస్‌లలో ఆల్కహాలిక్ డ్రింక్స్ ఉచితం. కొన్ని హోటల్స్‌లో బస చేస్తే వాటి యాజమాన్యం గాంబ్లింగ్‌కి చిప్స్ (డాలర్స్‌ని చిప్స్‌గా మార్చుకుని వాటితో గాంబ్లింగ్ చేయాలి తప్ప హార్డ్ క్యాష్‌తో ఆడకూడదు)ని ఉచితంగా ఇస్తుంటారు.

ఎలక్ట్రానిక్ యంత్రాలతో జూదం ఆడచ్చు. లేదా జూదగృహం మనుషులతో కూడా ఆడవచ్చు. ప్రతీ జూదగృహంలోపల, బయట ఎంత స్టేక్స్ గెలుచుకోవాలో, ఆ మొత్తం ఎలక్ట్రానిక్ డిస్‌ప్లే ద్వారా ప్రదర్శిస్తుంటారు. ఈ ఫిగర్ క్షణక్షణానికీ మారుతుంటుంది. పెద్ద జూద గృహాల్లో ఆ సంఖ్య లక్షల డాలర్ల విలువ కలిగివుంటుంది. ఒక్కోసారి ఈ సంఖ్య కొన్నిరోజుల







పాటు అలాగే వుంటుంటుంది.

ఇక్కడికి వచ్చే సీరియస్ గాంబ్లర్స్ తిరుగుప్రయాణం టిక్కెట్లతో వస్తారు. తమ దగ్గరున్నదంతా పోగొట్టుకున్నాక ఇంటిదారి పడతారు. ఒకోసారి ఆ టికెట్‌ని కూడా క్యాష్ చేసుకుని, తమ అదృష్టాన్ని ఆఖరిసారి పరీక్షించుకుని, తాకట్టు పెట్టి బయట పడతారు.

ఈ కారణంగానే లాస్‌వేగాస్‌లో బంగారం తాకట్టు పెట్టుకునే దుకాణాలు కొన్నివేల సంఖ్యలో కనపడతాయి. స్ట్రిప్‌టీజ్ షోగర్ల్స్, గాంబ్లింగ్ గదుల్లో పనిచేసే అమ్మాయిలు, హోటల్స్‌లో వెయిట్రస్‌లు మొదలైనవారు తీరిక సమయాల్లో అతిథుల్ని కొంత రుసుముకి ఎంటర్‌టెయిన్ చేస్తుంటారు. 'అది, వాళ్ళ వ్యక్తిగత వ్యాపారం. మాకు సంబంధంలేదు' అంటుంది చట్టం. ఈ అమ్మాయిల్లో ఎక్కువమంది ఇంగ్లండ్ నుంచివచ్చిన వాళ్ళే.

ఇక్కడి మరో పరిశ్రమ పెళ్ళిళ్ళు చేయడం. ప్రపంచంలో ఎక్కడ వివాహం అయినా లాస్ వేగాస్‌లో విడాకులు తీసుకుని తిరిగి వివాహం చేసుకోవచ్చు. అందుకని ఇది 'డైవోర్స్ కాపిటల్'గా కూడా భాసిల్లుతోంది. అయితే లాస్‌వేగాస్‌లోని విడాకుల్ని అమెరికాలోని కొన్ని ఇతర రాష్ట్రాలే గుర్తించడంలేదు.

---

## అపూర్వమైన టాక్సీ

**చి**కాగో ప్రజలు టాక్సీ ఎక్కాలనుకున్నప్పుడు అది ఎడ్వర్డ్ హామిల్టన్ నడిపే టాక్సీ అయివుంటే బాగుండుననుకునేవారు. ఎందుకంటే అతని టాక్సీకి ఎన్నో ప్రత్యేకతలున్నాయి.

అతనూ, అతని టాక్సీ అలాంటి కీర్తి గడించడానికి గల కారణాల్లో మొదటిది... ఎవరు టాక్సీ ఎక్కినా అతను ముందుగా "గుడ్ మార్నింగ్ సర్! వేడి కాఫీ ఫ్లాస్కులో వుంది. కప్పులు సీటు వెనక భాగంలో వున్నాయి. ఈ రోజు దినపత్రిక, ఇతర మ్యాగజైన్‌లు రేక్‌లో వున్నాయి" అంటాడు.

కాఫీ అలవాటులేని పాసింజర్స్‌కి ఆరంజి జ్యూస్ ఇస్తాడు. చిన్నపిల్లలు ఎక్కితే లాలీపాప్‌లిస్తాడు. ముసలివాళ్ళు ఎక్కితే సిగార్ ఆఫర్ చేస్తాడు.

సీటుకి ముందున్న పెట్టిలో తలనెప్పి మాత్రలు, టిష్యూ పేపర్, సూదులు, దారం, రబ్బర్ బ్యాండ్లు, సెల్ ఫోన్ టేప్, మీసాలు దువ్వుకునే బ్రష్, దువ్వెనలు, నెయిల్ కట్టర్,

పెన్సిళ్ళు, కాగితాలు, కత్తెర, స్క్రూ డ్రయివర్ ఇవన్నీకూడా ప్రయాణీకుల సౌకర్యార్థం సిద్ధంగా వుంటాయి. క్యాలెండర్‌కూడా ఎప్పుడూ వుంచుతాడు. ప్రయాణీకులు రేడియోలో ఏ స్టేషన్ కార్యక్రమాలు వినదలుచుకుంటే ఆ స్టేషన్‌ని ఆన్ చేస్తాడు. ఈ సౌకర్యాలన్నీ ఎందుకు కల్పిస్తున్నావని ఓ పత్రికా విలేకరి అడిగితే, 'నా టాక్సీ నా ఇల్లు లాంటిది. నా ఇంటికి వచ్చే అతిధులకీ, నా ప్రయాణీకులకీ ఏం తేడాలేదు' అని జవాబు చెపుతాడు.

వారాలకి ఎవరో ప్రయాణీకుడు 'పేపర్ వుందా?' అని అడగ్గానే టాక్సీని పేపర్ స్టాండ్ వద్ద ఆపి కొనిచ్చాడు. అప్పటినుంచీ నిత్యం వివిధ పత్రికలని కొని వుంచసాగాడు.

అతని సర్వీస్‌కి మెచ్చి టిప్స్ బాగానే ఇస్తారు ప్రయాణీకులు. మరీ ఎక్కువ టిప్ ఇచ్చినవాళ్ళ చిరునామాని అడిగి తెలుసుకుని మగవాళ్ళకి సిగార్ గానీ, ఆడవాళ్ళకైతే లిప్‌స్టిక్ గానీ పోస్ట్‌ద్వారా బహుమతిగా పంపిస్తాడు. చికాగోలోని బిజినెస్ ఎగ్జిక్యూ




అతని టాక్సీలో ఇంకా అడిగితే దొరికే సౌకర్యాలేమిటంటే వెదర్ రిపోర్ట్, లోకల్ న్యూస్‌లోని ముఖ్యవార్తలు, వివిధ ఆటలపోటీల ఫలితాలు, చికాగో నగరంలోని టూరిస్ట్ ఇంట్రస్ట్ ఐటమ్స్ జాబితా... వగైరా...!

అతని టాక్సీలోని మరో మర్యాద... రోజుకో ప్రయాణీకుణ్ణి ఉచితంగా దింపడం. పోలియో కాలున్న చిన్నపిల్ల గలవాళ్ళని, పేదవారిలా కనిపిస్తున్నవారినీ... ఎడ్వర్డ్ మెచ్చే గుణాలున్న వారిని ఎంతదూరం తిరిగినా ఛార్జ్ చేయడు.

1927నుంచి, 1963 దాకా ఎడ్వర్డ్ హామిల్టన్ చికాగోలో టాక్సీ నడిపాడు. ఈ 36 ఏళ్లలో అవసరాన్ని బట్టి ఒక్కో సదుపాయం చేసుకుంటూ వచ్చాడు. 1927లో అతను టాక్సీ నడపడం ఆరంభించిన ఆరు

టివ్స్ అతని టాక్సీలోని సౌకర్యాలను గమనించి చిన్న చిన్న మీటింగ్స్‌ని హోటలు గదుల్లో కాక ఆ టాక్సీలోనే జరుపుకునేవారు. మీటింగ్ జరుగుతున్నంత సేపూ ఆ కారు ఎక్కడా ఆగకుండా ప్రయాణిస్తూనే వుంటుంది. హోటల్ గదికన్న ఇదే చవక. మధ్యలో ఎలాంటి డిస్టర్బెన్సూ కూడా వుండదు. సగటున రోజుకి 500 మంది ప్రయాణీకులు ఇతని టాక్సీ ఎక్కేవారు.

1963లో ఆ నగర మేయర్ ఆ టాక్సీకి ఆఖరి ప్రయాణీకుడిగా ఎడ్వర్డ్ టాక్సీలో ప్రయాణం చేశాడు. ఆ రోజు రోడ్డుకు రెండుపక్కలా ఆరువేలమంది చికాగో నగర ప్రజలు నిలబడి ఎడ్వర్డ్‌కు హర్షాతిరేకంతో జేజేలు పలికారు.

# 'ఆర్తి' పై సమీక్షలు

అగస్ట్ 'చతుర'లో ప్రచురితమైన తనికెళ్ల కల్యాణి రచన 'ఆర్తి' పై పాఠకులనుంచి మాకందిన ఉత్తమ సమీక్షలు

## అవగాహనాలోపం

*(ప్రథమ బహుమతి రూ: 100/- పొందిన సమీక్ష)*

ఆగస్టు చతుర నవల 'ఆర్తి' సమాజంలో ఒక వర్గం- అదీ మేధావివర్గం అయిన ఉపాధ్యాయుల గురించి, వారి వృత్తిధర్మాన్ని గురించి, ఆ ధర్మనిర్వహణవల్ల సమాజం వారికిచ్చే స్థానాన్ని కళ్లకు కట్టించింది. వృత్తి పట్ల నిబద్ధత, చిత్తశుద్ధి గల్గిన ఏ ఉద్యోగి అయినా తన ఉద్యోగజీవితాన్ని ఎంతగా ప్రేమిస్తాడో తన విధి నిర్వహణకు ఆటంకమేర్పడితే ఎంతలా కృంగిపోతాడో ఈ నవలవల్ల అర్థమవుతుంది. ముఖ్యంగా నేటి రాజకీయనాయకుల స్వార్థం, 'తమ వర్గంవారు' అన్న ముద్రకోసం వారు చేస్తున్న అధికార దుర్వినియోగం చక్కగా ప్రదర్శితమయ్యాయి. ఉపాధ్యాయవర్గపు చిరుసమస్యలను, మనోసంఘర్షణను చక్కగా విశ్లేషించారు రచయిత్రి. "అయ్యోర్లు కూచోనుండేదే గదా! ఏం చెప్పిస్తారు పిల్లలకి? నెలబెడితే జీతం తీసుకునిపోతారు'' అనే ఒకవిధమైన చిన్న చూపు ఉన్నది టీచర్లపైన. అలాంటివారికి కొంతైనా అవగాహన కల్గించే ప్రయత్నం ఈ నవలలో జరిగింది. కాని "పదవతరగతికి చెప్పిన నేను దిగి 7వ తరగతికి చెప్పగలనా?... ఎం.ఏ.లు చదివాను, వృధాయేనా?"




అంటూ శిరీష అనడం మాత్రం చాలా పొరపాటు. విద్య ఏ స్థాయిలోనైనా నేర్పబడేదీ, అంతే చిత్తశుద్ధి అవసరమయ్యేదీను. ప్రాథమిక, మాధ్యమిక దాటితేనేకదా ఉన్నత విద్య- అమాంతం 10వ తరగతిలోకి ఎగిరిపడదుకదా! అంత విజ్ఞానం, విద్య, చేతన ఉన్న ఉపాధ్యాయురాలిగా శిరీష అలా వాపోవడం సబబుగా లేదు. విదేశాల్లో నర్సరీ,

ఎల్.కె.జి; యు.కె.జి. స్థాయికి పోస్టుగ్రాడ్యుయేట్లుంటారు ఉపాధ్యాయులుగా. 10వ తరగతికి చెప్పేదే చదువు, ఇతర చిన్న తరగతులకి వెళ్లడం దిగడంగాను, పరువు తక్కువగాను అనుకోవడం చాలా చాలా శైశవప్రాయపు టాలోచన. అవగాహనాలోపం అనారోగ్యకరం. రచయిత్రి ఇది గమనించడం అవసరం.

-ఆర్. లక్ష్మి,
సి. మల్లవరం-517 505.

## పునాది గట్టిపడాలి

*(ద్వితీయ బహుమతి రూ: 75/- పొందిన సమీక్ష)*

"ఆర్తి" నవలలో రచయిత్రి పాఠశాలల వాతావరణాన్నీ, రాజకీయ నాయకుల జోక్యంతో ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న బదిలీల పర్యవసానాలనూ సహజంగా వర్ణించారు. 'శిరీష'ను మలచిన తీరు బాగుందిగానీ, అది శిరీషకు బదిలీ కానంతవరకే. అప్పటివరకు ఒక సిన్సియర్ టీచర్‌గా విద్యార్థులకు పాఠాలు చెప్తూ పదవతరగతి రిజల్ట్సు శాతాన్ని పెంచడానికి కృషిచేయడం, విద్యార్థుల బాగోగులను పట్టించుకొనడం కొరకు వారి ఇండ్లకు సైతం వెళ్ళడంలాంటివి ఉత్తమ ఉపాధ్యాయ లక్షణాలు. కాని ట్రాన్స్‌ఫర్ అయిన తరువాతి శిరీషలో మరో కోణాన్ని చూస్తాం. అదే మొండితనం.

ఒక టీచరు పదవతరగతి బోధించి తన సబ్జెక్టులో ఉత్తీర్ణతా శాతాన్ని పెంచితే ఆ టీచర్ ప్రతిభ అందరికీ తెలియవచ్చేమోగానీ, అంతమాత్రాన ఒకటవ తరగతికి చెప్పే ఉపాధ్యాయులు ప్రతిభ లేని వారేనందామా? పదవతరగతి ఎంత ఆసక్తితో చెప్తారో ఒకటవ తరగతి కూడా అంతే ఆసక్తితో చెప్పేవారే నిజమైన ఉపాధ్యాయులు.

మన విద్యావిధానంలోని లోపమంతా ప్రాథమిక పాఠశాలలందే ఉందని అందరికి తెలుసు. అక్కడే పునాది గట్టిపడాలి. అప్పర్ ప్రైమరీల నుండి ఎనిమిదవ తరగతికి వచ్చిన విద్యార్థుల క్కూడా ఏవీ సరిగా రావన్నది ఉపాధ్యాయులందరికి తెలుసు. శిరీషలో తన విజ్ఞానాన్ని విద్యార్థులకు పంచిపెట్టాలన్న తపన వుంది. అది కేవలం పదవతరగతికే పరిమితమా? చిన్న తరగతులకు పనికిరాదా? ఆమె ఎంతసేపూ తనకు హైస్కూలు ఇవ్వమనీ, లేకుంటే తను నేర్చిన విద్యంతా వృధా అవుతుందనీ అంటుందే తప్ప నా విజ్ఞానంతో, నా తపనతో ఆ అప్పర్‌ప్రైమరీని ఒక ఆదర్శ పాఠశాలగా మారుస్తాననదు. అప్పర్‌ప్రైమరీలు ఎప్పటికీ అలాగే వుండవు. వాటిని అప్‌గ్రేడ్ చేస్తారు. ఆవిధంగా ఒక చక్కటి హైస్కూలును శిరీష తన కృషితో తయారు చేయవచ్చు. ఎందుకంటే ఆమెకు సర్వీసు కూడా చాలా వుంది. పైగా ప్రధానోపాధ్యాయురాలిగా ఆమెకు తగినంత స్వేచ్ఛవుంది.

విత్తనంనుండి వచ్చే మొలకలని ఆరోగ్యంగా పెంచితే తప్ప మంచి మొక్కలు రావు. అలాగే ప్రాథమిక పాఠశాలల విద్యార్థులని మన ఆశయాలకు అనుగుణంగా మలచుకొనవచ్చు. ఒక సీనియర్ ఉపాధ్యాయుడైన మార్కండేయుల త్యాగంతో రీత ర్డర్సును అందుకొన్న శిరీషకంటే అప్పర్ ప్రైమరీ స్కూలుకు సంతోషంగా వెళ్తున్న శిరీష ముగింపే బాగుండేది.

నా దృష్టిలో శిరీష కాదు, మార్కండేయులే ఉత్తమ ఉపాధ్యాయుడు.

-యం.వి.సుధ,
సికింద్రాబాద్-500 026

## మార్గదర్శి

*(తృతీయ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)*

నవసమాజ నిర్మాణంలో మూలస్థంభాలైన





ఉపాధ్యాయులు తమ విధినిర్వహణలో ఎదుర్కొనే కష్టనష్టాలను, అనుభవాలను, ఆ వృత్తియొక్క పవిత్రతను కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరించిన నవల 'ఆర్తి'.

ఒకదేశం యొక్క భవిష్యత్తు దాని తరగతి గదిలోనే రూపుదిద్దుకుంటుంది. అటువంటి బాధ్యతాయుతమైన వృత్తిలో శిరీష పాత్రను ఎంతో ఉదాత్తంగా చిత్రీకరించారు. విద్యార్థులలో దిగజారిపోతున్న నైతిక విలువలను పెంపొందించడంలోను, చెడు వ్యసనాలతో అడ్డదారి తొక్కుతున్న విద్యార్థులను సంస్కరించడంలోనూ, శిరీష పాత్ర ద్వారా రచయిత్రి అందించిన సందేశం ఆచరణాత్మకం. రత్నంలాంటి విద్యార్థులు చదువులో వెనకబడినప్పుడు వారిని తప్పుపట్టి, దండించటంకన్నా, దానికి కారణభూతమైన సమస్యలను పరిష్కరించడం ఉత్తమం అని చాటిచెప్పిన ఈ నవలను సందేశాత్మకం అనటంలో అతిశయోక్తి లేదు.

ఉపాధ్యాయురాలిగా, భార్యగా, తల్లిగా, కోడలుగా, వదినగా శిరీష పాత్ర స్త్రీ జాతికే వన్నె తెచ్చేదిగా వుంది. సహోపాధ్యాయునిగా, భర్తగా శిరీషకు సహాయసహకారాలందించిన రవి పాత్ర ఆదర్శవంతంగా ఉంది. జానకమ్మ మేడమ్, డ్రాయింగ్ మాష్టారు లాంటివారు పవిత్రమైన ఉపాధ్యాయ వృత్తికే కళంకం తెస్తున్నారు. నాగేశ్వరి లాంటి అవినీతిపరులైన ప్రజాప్రతినిధులు, వ్యక్తిత్వం లేని ఛైర్మన్లూ విద్యావ్యవస్థను భ్రష్టుపట్టిస్తున్నారు.

మేడిపండులాంటి మన విద్యావ్యవస్థను రచయిత్రి సున్నితంగా విమర్శిస్తూ ఉపాధ్యాయుల విధినిర్వహణలోను, బదిలీల విషయాలలోనూ అడ్డుపడుతున్న అవినీతి రాజకీయాలను ఎండగట్టారు. బదిలీ అనే విషయాన్ని మరీ భూతద్దంలో చూపించినట్లుగా కనిపించినా, మన విద్యావ్యవస్థలోని రుగ్మతలను స్పష్టంగా బట్టబయలు చేశారు. శిరీష బదిలీ ఊరిప్రజల విజ్ఞప్తితోనూ, విద్యార్థుల అర్జీలతోనూ ఆగకపోవడం బాధ కలిగించినా, తోటి ఉపాధ్యాయుని త్యాగంవలన రద్దు కావడంతో నవల సుఖాంతమైంది.

ఆద్యంతం ఆసక్తికరంగానూ, ఆలోచింపజేసేదిగా సాగిన ఈ నవల క్షీణిస్తున్న విద్యావిలువలపై, అధికారుల చిత్తశుద్ధిపై సంధించిన విమర్శనాస్త్రమే. సంపాదనే గమ్యంగా, బాధ్యతారహితంగా ప్రవర్తించే ఉపాధ్యాయ బృందానికి మార్గదర్శి ఈ నవల.

**-యం. శ్రీకాంత్‌రెడ్డి,**
లోనవ్లా-410 402

## ట్రాన్స్‌ఫర్స్ లేకుండా ఎలా?

*(నాల్గవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

విద్యావ్యవస్థలోని అవకతవకలు, ముఖ్యంగా టీచర్లను బదిలీలు చేయడంలో లాలూచీల గురించి తెలియజేసిన నవల ఆర్తి. విద్య వ్యాపారంగా మారిన ఈ కాలంలో కూడా ఉత్తమ ఉపాధ్యాయులున్నారు. వారిని అభిమానించే పిల్లలూ వున్నారు.

ట్రాన్స్‌ఫర్ అయిన తర్వాత శిరీష, రవీంద్ర ఆ విషయాన్ని సీరియస్‌గా తీసుకుని బాధపడటం సబబుగా లేదు. చదువుకున్న ప్రతి ఒక్కరు రెండు మూడు సంవత్సరాలు నిరుద్యోగ పర్వంలో వున్న తర్వాత ఏ ఉద్యోగమొచ్చినా చేస్తామంటారు. ఉద్యోగంలో చేరేముందే స్టేట్‌గవర్నమెంట్‌ది అయితే దానిలోపల, సెంట్రల్ గవర్నమెంట్‌ది అయితే దేశం మొత్తం తిరగాలని తెలిసే ఉద్యోగంలో చేరతారుగదా. అలాంటప్పుడు ట్రాన్స్‌ఫర్ అయినప్పుడు దాని గురించి బాధ ఎందుకు? ఉద్యోగాలన్నీ మనం వున్న వూళ్ళోనే వుండవుగా. పది సంవత్సరాలుగా అదే వూళ్ళో వుండి ఇప్పుడు కొంతదూ

రంలో పంపిస్తే బాధపడవలసిన పనిలేదు. కేంద్రప్రభుత్వ ఉద్యోగులకి, డిఫెన్సులో పని చేసేవారికి ప్రతి నాలుగైదు సంవత్సరాలకొక సారి బదిలీలు అవుతూనే వుంటాయి. తట్టా, బుట్టా సర్దుకుని వేసినచోటికి వెళ్తూనేవుంటారు. పిల్లలు కాలేజ్ చదువులకు వచ్చింతర్వాత కుటుంబాలను వదిలి కూడా వుండవలసివస్తుంది. వాళ్ళందరికన్నా ఉన్న చోటనే వుండి 40, 50 కి.మీ. దూరంలో వుద్యోగాలు చేస్తున్నవాళ్లు చాలా అదృష్ట వంతులనే అనుకోవాలి. మూకుమ్మడిగా ట్రాన్స్‌ఫర్స్ జరిగినప్పుడు రాజకీయనాయకులు, యూనియన్ లీడర్లు వాళ్ళ అభ్యర్థులకు ఇష్టమైనచోట వేయించడం అన్నిచోట్లా వున్నదే. అలాంటి పరిస్థితులనెదుర్కొని చివరికి హైస్కూల్లో పోస్ట్ ఇచ్చిన తర్వాతనే డ్యూటీలో చేరిన శిరీష ధైర్యానికి, వృత్తిపట్ల ఆమెకున్న అంకితభావానికి మెచ్చుకోవాల్సిందే. నాగమ్మలాంటి మనిషి తప్ప ఈ నవలలో విలన్లు ఎవరూ లేరు. అందరూ మంచివాళ్లే. స్కూలుతోను, స్కూలు పిల్లలతోను శిరీష అనుబంధం వదిలి వెళ్ళేటప్పుడు బాధగా వున్నా, అలాంటి టీచర్లు ఎక్కడైనా గొప్పగానే రాణించగలరు. చదువుల్ని గురించి చదివించే నవల రాశారు రచయిత్రి.

**-పి. దాక్షాయణి,**
ఖరగ్‌పూర్-721 303.

## విద్యారాజకీయాలు

***(అయిదవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)***

**త**నికెళ్ళ కళ్యాణిగారి ఆర్తి నవల ఆద్యంతం విద్యారంగం, బదిలీలు, రాజకీయలీలలు మున్నగు వానితో ఆసక్తికరంగా సాగింది. "విద్య యొసగు వినయము, వినయమ్ము వలన పాత్రత..." అనే ఆర్యోక్తికి పూర్తి విరుద్ధంగా నేటి విద్యారంగం కనిపిస్తోంది. పెద్ద పదవులలో ఉన్నవారు సైతం తమ చిన్ననాటి గురు-శిష్య సంబంధాలను మర్చిపోయి, తామేదో ఆకాశంనుండి ఊడిపడ్డట్లుగా ప్రవర్తిస్తుంటారు. ప్రభుత్వాలు చట్టాలను, రూల్సును తయారుచేయవచ్చు, కట్టడి చేయవచ్చు. కాని వాటి అమలు, బాధ్యత ఈ కథలోని పరిషత్ ఛైర్మన్‌గారిలాంటి రాజకీయ శక్తులకు అప్పజెప్తే, ఆ రూల్స్‌వలన లబ్ధిదారులకన్న, నష్టజాతకులే అధికులౌతారన్న విషయం రచయిత్రి చక్కగా వివరించారు. నాన్-డిటెన్షన్, హాజరుశాతం ఇత్యాది పద్ధతులను కూడా రచయిత్రి విడిచిపెట్టలేదు. అన్నదమ్ముల, బావమరదుల చేతుల్లో కీలుబొమ్మలై, మొత్తం పాలనావ్యవస్థకే తలవంపులు తెస్తున్న ఎమ్.ఎల్.ఏ. నాగమ్మ వంటి రాజకీయశక్తులు విద్యారంగాన్ని నియంత్రిస్తున్నంతకాలం, విద్యాపథకాలతో పాటు కోట్లాది రూపాయల ప్రజాధనం నష్టపోక తప్పదని బాగా నిరూపించారు. బదిలీ ఉత్తర్వులు తయారైనాయని తెలిసింది మొదలు చిన్నో పెద్దో రాజకీయ నాయకుణ్ణి ఆశ్రయించి, జిల్లాపరిషత్ ఛైర్మన్‌గారికో, తత్సంబంధీకులకో ఉత్తర, దక్షిణ తాంబూలాల్తో సత్కారాలు చేయడానికి ప్రయాస పడుతున్న ఉపాధ్యాయుల మధ్య, తానే స్వయంగా అధికార, అనధికార ప్రముఖులను కలిసి, సమస్యను నివేదించి, తన కార్యమును అనుకూలంగా మలచుకున్న శిరీష పాత్రను... పట్టుదల, నిర్భయత్వములను ఉపాధ్యాయవర్గానికి నూరిపోయడానికే ఈ నవల ద్వారా రచయిత్రి సృష్టించారని చెప్పక తప్పదు.

**-తమ్మా కృష్ణవేణి,**
కాశీబుగ్గ-532 222

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.






Mango Avakaya | Mango Thokku | Cut Mango | Tender (Vadu) Mango | Sweet Mango Chutney | Amla | Gongura | Drumstick | Lime | Tomato | Mixed Vegetable



Bitter Gourd | Green Tamarind | Ginger | Sweet Ginger | Mango Ginger | Garlic | Onion | Red Chilli | Green Chilli (Sliced) | Green Chilli (Paste) | Gongura & Red Chilli | Green Tamarind & Red Chilli




**Pickles**

**ఏ పచ్చడంటే**

**ఆ పచ్చడి సంసి**

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,** (ప్రియ ఫుడ్స్ డివిజన్), **ఈనాడు** కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ **500 482**